Ayurvedasrama Series—9.

# RASAPRATHIPIKA

A

Treatise of descriptive Study of
Metals and Minerals pertaining to Ayurveda

BY

**MUDUMBA. VENKATACHARYULU**

*with a Telugu Commentary*

**"PRABHA"**

BY

**Vaidyaratna,**
**Ayurvedamarthanda Bhishangmani,**
**Pandit, D. Gopalacharlu,** A. V. S.,

*Principal, Madras Ayurvedic College and Senior Physician, Madras Ayurvedic Free Dispensary, Madras; Ex-President, Ayurvedic Congress, Malabar, All India Ayurvedic Conference, Bombay; President and Examiner, All-India Board of Ayurvedic Examinations, Allahabad, U. P.; Examiner & Member, Text Book Committee, Delhi Ayurvedic and Unani Tibi College; Examiner, Mysore Govt. Ayurvedic Vidwat Examinations, and, of D. A. V. College, Lahore; Commentator on Charaka, Susruta, Madhavanidana, Pathyapathya, Ayurveda Paribasha, Arkaprakasika, Bheshajakalpa, &c., and Gold Medalist in the Various Industrial and Agricultural Exhibitions in India, and All-India Ayurvedic Exhibition, Calcutta.*

**AYURVEDASRAMA, MADRAS.**

1916.

 [Price Re. 1-8-0.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల—౫.

శ్రీమద్ధన్వన్తరయేనమః.

శ్రీమాన్, ముడుంబ - వేంకటాచార్యులవారిచే రచించబడిన

# రసప్రదీపిక.

ఇది

చెన్నపురి ఆయుర్వేదకాలేజ్ ప్రిన్సిపాలును,
చెన్నపురి ధర్మ ఆయుర్వేద వైద్యశాలా ప్రధాన చికిత్సకులును,
ఆయుర్వేద విద్యాపీఠసభానాయకులును పరీక్షకులును మరియు
మైసూరు దొరతనమువారియొక్కయు,
పంజాబు డి. ఏ. వి. కాలేజీవారియొక్కయు, ఆయుర్వేద విద్వత్పరీక్షకులును,
డిల్లి ఆయుర్వేద యూనాని తిబికాలేజియొక్క పఠనగ్రంథ నియమన
సభాసభ్యులును, ఆయుర్వేద విద్వత్పరీక్షకులును,
శ్రీసయాజీ ఆయుర్వేద విద్యాపీఠ సభ్యులును,
చరక సుశ్రుత-మాధవనిదానాది గ్రంథములకు వ్యాఖ్యాన కర్తలును,
కేరళఆయుర్వేదసమాజ సప్తమ మహాసమ్మేళనాధ్యక్షులుగను,
బొంబాయి అఖిల భారతవర్షీయ ఆయుర్వేద మహా సమ్మేళనాధ్యక్షులుగను,
నుండినట్టియు,
భరతఖండమందలి దేశీయమహాసభానుబంధముగ జరిగిన
మహాచిత్రవస్తు ప్రదర్శనములలోను భారత ఆయుర్వేద మహావస్తు
ప్రదర్శనమునను ననేక స్వర్ణపదకములను బొందినట్టియు,
శ్రీమత్పంచమజార్జి సార్వభౌమునిచే ప్రదత్తమగు
"వైద్యరత్న" బిరుదావళీవిరాజమానులునగు
ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి
పండిత, డి. గోపాలాచార్యులు, ఎ. వి. ఎస్., గారిచే
విపులముగ విశేషార్థములతో వ్రాయబడిన
"ప్రభ" యను నాన్వర్థవ్యాఖ్యతో కూడినది.

 ౧౯౧౬. [వెల రూ. ౧-౮-౦.

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులవారియొక్క

చెన్నపురి:

**55,** ఆచారప్పన్ వీధియందు గల

స్వకీయాయుర్వేద ముద్రాయంత్రమున ముద్రింపంబడి

ఆయుర్వేదాశ్రమమున ప్రకటింపంబడియె.



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,
ఎ. వి. ఎస్. అండ్ ఎ. ఎమ్. బి.

శ్రీమద్ధన్వంతరయేనమః.

# ఉపోద్ఘాతము.

## ఆయుర్వేదము, త్రివిధవస్తువిజ్ఞానము.

ప్రజాహితైక పక్షపాతియగు నా శ్రియఃపతి యాదికాలమున నేకార్థ సాధన ధనమగు నాయుర్వేదమును సృజించెను. అయ్యది యనేకవిధములగు చికిత్సాభాగములతో గూడియున్నదని ప్రాజ్ఞులకందరకును విదితమే.

అందలి చికిత్సాపద్ధతులను సృష్టియందలి ఖనిజ ప్రాణిజ కాష్ఠౌషధులను క్రమముగ మహర్షులు వారివారి సమయములయందు పెక్కుపరిశోధనలనుండియు జ్ఞానదృష్టినుండియు గనుంగొనిరి. మహర్షులు పైజెప్పిన మూడువిధములగు పదార్థములచే వాత పిత్త కఫములనెడి దోషత్రయముయొక్క సామ్యాదిస్థితిని యెట్లు కన్గొనిరను విషయమునుగురించి యించుక విమర్శింతము.

మున్మున్ను ప్రమాణ వర్ణ ఆకృతి నామ జాతులను నైదుపాయములచే ప్రతిపదార్థమును నిశ్చయించుచుండిరి. పదార్థ స్వరూపము నెరింగినపిదప వానిని రస వీర్య విపాక ప్రభావ గుణము లను నైదుపాయములచేతను గ్రాహి దీపని పాచని సంశోధని రసాయని భేదని అనులోమని మొదలగు శక్తులచేతను పదార్థతత్త్వమును నిశ్చయించి వికృతములైన వాత పిత్త కఫములనెడి దోషములయొక్కయు దోషజన్యములగు వ్యాధులయొక్కయు సామ్యము గల్గుటను కనిపెట్టిరి. మరియు ద్రవ్యమునందలి రస వీర్య విపాక ప్రభావములను గుర్వాది గుణములను మిక్కిలి సూక్ష్మసూక్ష్మాంశములంగూడ దెలిసియుండిరి.

## ఓషధులు.

కాష్ఠౌషధులను ఓషధి వనస్పతి వీరుత్తు వృక్షములని నాల్గువిధములంగ విభజించిరి. వీనిని దోషభేదమునుబట్టియు పదార్థభేదమునుబట్టియు స్వర

సము, క్వాథము, ఫాంటము, హిమము, చూర్ణము, ఆసవము, అరిష్టము, తైలము, ఘృతము, రసక్రియ, వటికము, మోదకము, పానకము, అర్కము, క్షారము మొదలగు పరిణామముల నందించి వానిని యథాపథశబ్దముచే నుడివిరి.

## ఖనిజములు.

ఖనిజములను మహారసములు, ఉపరసములు, సాధారణరసములు, శక్తి రసములు, లోహములు, రత్నములు, ధాతువులు, అను భేదములచే విభజించిరి. వానిని శోధనము, జారణము, మారణము, ద్రుతి, సత్వపాతనము అను పరిణామముల నందించి వానినే ఔషధములని వ్యవహరించిరి.

## ప్రాణిజములు.

మహామృగములు, మృగములు, విష్కిరములు, ప్రతుదములు, బిలేశయములు, జలజములు, అప్చరములు, ప్రసహములునని ప్రాణిజములు విభజింపబడినవి. వీని సంబంధములగు మాంసము, క్రొవ్వు, రక్తము, పాలు, పెరుగు, నెయ్యి, విషములు, పిత్తములు, వెన్న, మజ్జిగ, మొదలగు పదార్థములయందలి గుణాదివిశేషముల గన్కొని ఆయారోగములయందు వానిని వినియోగించు క్రమమును జక్కగ గుర్తెరింగిరి.

అందు ఏయేవిధములగువాని నెట్లెట్లు ఔషధరూపముగ గనుకొనిన విషయము పాఠక మహాశయులకు దెలుపుట యావసరము. దానిని విపులముగ దెలుపవలెనన్న గ్రన్థవిస్తరమగుట సహజము. ప్రకృతమున ధాతులోహాదులగు ఖనిజపదార్థములను గురించిన రసవైద్యవిజ్ఞానము నీగ్రన్థముబోధించుచున్నది గాన అద్దానింగూర్చి యించుక విమర్శించెద.

## రసతన్త్రములు, వాని విభాగములు.

ఆయుర్వేదమున జెప్పబడిన చికిత్సాది విధానములు వైదికమనియు తాన్త్రికమనియు రెండుతెరంగులు. అందు వైదికకాలమున ప్రధానముగ నోషధులచే జేయబడు చికిత్సాభాగము వైదికమనియు, ప్రధానముగ ఖనిజపదార్థ

ములచే నిర్వర్తింపబడు చికిత్సావిధానము తాన్త్రికమనియు చెప్పబడును. ప్రాణిజములు పై వైదిక తాన్త్రికములను నుభయచికిత్సలయందును మిశ్రముగ నుండుటం జేసియే ప్రత్యేకవిభాగము గానంబడదాయె. అందు వైదికప్రక్రియ బ్రహ్మ మొదలుగ నేర్పడియుండుటం జేసి బ్రాహ్మీప్రక్రియయనియు, తాన్త్రిక ప్రక్రియ పరమశివుడు మొదలుగ నేర్పడియుండుటంబట్టి శైవీప్రక్రియయనియు గూడ వాడుకలోనున్నది. తాన్త్రికవైద్యమునకే రసశాస్త్రమనియు నామాన్తరము కలదు.

ఇట్టి రసతన్త్రము *1 రసఖణ్డము, 2 రసేన్ద్రఖణ్డము, 3 వాదఖణ్డము, 4 రసాయనఖణ్డము, 5 మన్త్రఖణ్డమునని యైదువిధములుగ విభజింపబడినటుల రసరత్నాకరమునుండి తెలియుచున్నది. ఈ యైదువిధములగు విషయములలో రసఖణ్డ రసేన్ద్రఖణ్డములు మాత్రము ప్రకృతకాలమున విశేషముగ వాడుకలోనున్నవి.

## రసఖణ్డము.

ఇందు లోహములు ధాతువులు పాషాణములు మొదలగు ఖనిజములను మహారస ఉపరస శక్తిరస సాధారణరస ధాతు రత్న భేదములచే విభజించిరి. వీని పుట్టుకలను భేదములను వానిని గుర్తించుటకై లక్షణములను తెలిపిరి. వీనిని శుద్ధి భస్మ సిన్దూరసత్వపాతన ప్రభృతులను పరిణామముల నందించుటకు దగుమార్గములును దెలుసుకొనిరి. పై శోధనాదుల జేయుటకై యుపయోగింపబడు వాలుకా డమరుక స్వేదనాది యన్త్రములయొక్కయు గజ వరాహాది పుటములయొక్కయు నిర్మాణంబును వాని పద్ధతులును బేర్కొనంబడినవి.

---

* నిశ్రేయసే తు వైద్యానాం వ్యాధితానాం హితాయ చ। వాదినాం కౌతుకార్థాయ వృద్ధానాం దేహసిద్ధయే। మన్త్రిణాం మన్త్రసిద్ధ్యర్థం విదితాశ్చర్యకారకమ్। పఞ్చఖణ్డమిదం శాస్త్రం సాధకానాం హితాయ చ। రసఖణ్డే తు వైద్యానాం వ్యాధితానాం రసేన్ద్రకే। వాదినాం వాదఖణ్డే చ వృద్ధానాం చ రసాయనే। మన్త్రిణాం మన్త్రఖణ్డేచ రససిద్ధిః ప్రజాయతే॥

మరియు పై శోధన జారణ మారణాదులకై వినియోగింపబడు పదార్థములయొక్క తూనికలు మొదలగువాని నెరుంగుటకు ✱ మానపరిభాష ♦ సంజ్ఞా పరిభాషలును దెలుపబడినవి. ఇట్టివివరణములుగలభాగమునకే రసఖణ్డమని పేరు.

## రసేన్ద్రఖణ్డము.

ఇందు రసఖణ్డమున నిరూపింపబడిన మహారసాది భేదములగు పదార్థములయొక్క భస్మసిన్దూరాదులను అతిసూక్ష్మములగు పరిమాణములచే నానావ్యాధుల నివృత్తికై యనేకములైన యౌషధములును వానిని వినియోగించు విధానమును నిరూపింపబడినవి.

## వాదఖణ్డము.

ఇందు తామ్రము తగరము మొదలగు నీచలోహములను స్పర్శవేధాది ప్రక్రియాసహాయముచే సువర్ణము మున్నగు నుత్తమలోహములుగ మార్చు విధానములును, ఆయా విధానములకు సంబంధించి రసమునకు చేయవలసిన సంస్కారములును అనేకవిధములగు భౌతిక ప్రక్రియలును తెలియజేయబడినవి. మరియు నమూల్యములగు వజ్రవైడూర్యాది మణుల నిర్మాణములుగూడ జెప్పబడినవి.

## రసాయనఖణ్డము.

రసఖణ్డమున బోధితములగు ఖనిజపదార్థములయొక్క భస్మసిన్దూరాదులను ఘుటికాది రూపముల నందించుటయు వానిచే జరామరణాదుల నశింప

---

✱ జాలాంతరగతేభానౌ యత్సూక్ష్మం దృశ్యతేరజః । తస్యత్రింశత్తమోభాగః పరమాణుస్సఉచ్యతే॥ (అనగా కిటికీలనుండి ప్రసరించు సూర్యకిరణములయందు కంటికగుపడు నలుసులలో ముప్పదియవ భాగము 'పరమాణువు' అని దెలిసియుండిరి. ఇట్లు అతిసూక్ష్మతమములగు నలుసులను తూచుటకు తగిన త్రాసులనుకూడ ఆర్యులు చిరకాలమున దెలిసియుండిరనుటకు పైవాక్యములే నిదర్శనములు.

♦ రసరత్నసముచ్చయమున సోమనాథసిద్ధ పరిభాష ప్రసిద్ధము.

జేయుటయు ఖేచరాది సిద్ధులు కలుగుటయు పలువుర పేరోలగంబున నదృశ్యమగుటయు మొదలగు మహామహిమల బొందు అనేక ప్రక్రియలును ఇందు తెలుపబడినవి.

## మన్త్రిఖణ్డము.

ఈ విషయమునకు సంబంధించిన విశేష భాగములుగల గ్రన్థములు ప్రకృతకాలమున లభించకుండుటచే నీవిషయమును విస్తరింపజాలనైతి.

ఇట్లు విభాగముల బొందియున్న శాస్త్రమును రసశాస్త్రముగ నెరుంగనగును.

## వేదములు-రసతన్త్ర పరిజ్ఞానము.

ఆర్యగ్రన్థములలో ప్రమాణతమములును చిరన్తనములునైన వేదముల యందు ఖనిజపదార్థము లచ్చటచ్చట నిత్తైరంగున బేర్కొనంబడియె:—

## లోహాది విజ్ఞానము.

"హిరణ్యేన మణినా శుమ్భమానాః" ఋగ్వేద (1-3-2-8); మునను, "తద్రజతం హిరణ్యమభవత్" యజుర్వేద (1-5-1); మునను, "హిరణ్యం చమేఽయశ్చమే సీసం చ మేత్రపుశ్చమే శ్యామం చ లోహం చ మే" యజుర్వేద (4-7-5); మునను, "యదాఞ్జనం త్రైకకుదం జాతం హిమవతస్పరి, ......యదివాసి త్రైకకుదం యది యామునముచ్యతే" (4-2-9; 4-2-10);

## లోహాది వినియోగము.

మరియు "ఉతాసి పరిపాణం యాతుజంభనమాఞ్జన,.........హరిత భేషజమ్" అని అథర్వవేద 2-2-9; మునను, "యస్యాఞ్జన ప్రసర్పస్యఙ్గ మఙ్గం పరుష్పరుః । తతోయక్ష్మం విబాధసఉగ్రో మధ్యమశీరివ" అథర్వ. (4. 9. 4) మునను, "త్రయోదాసా ఆఞ్జనస్య తక్మాబలాస ఆదహిః । వర్షిష్ఠః పర్వతానాం త్రికకున్నామ తేపితా" అథర్వ. (4. 9. 8) అని యథర్వవేదము

ననున్నది. ఇట్లుండుటంబట్టి అఙ్జనము నుపయోగించుటచే పాణ్డువు జ్వరము సన్నిపాతము విషము మున్నగువ్యాధులు నిర్మూలములగునని తెలియుచున్నది.

ఇంతియేకాక లోహముచే జేయబడిన శలాకను మూత్రమార్గమున ప్రవేశింపజేసి మూత్రాశయమునందలి యశ్మరీరోగమును బోగొట్టుచుండినట్టులును, కాల్చబడిన అయోగోళమునునిచి కాచబడిన వేడినీటిచే స్నానముచేసినచో ప్రస్తతజ్వరము హరించుననియు అధర్వవేదమున గానంబడియెడు.

"లవణేన సువర్ణం సన్దధ్యాత్" అను వాక్యముచే లవణవిశేషమగు వెలిగారముచే విరిగిన బంగారుతునియల నతుకవచ్చునని ఛాన్దోగ్యమున (**4-17-7**) తెలియుచున్నది.

## రసాయనములు.

మరియు "అగ్నేః ప్రజాతం పరి యద్ధిరణ్య మమృతం దధ్రే అధిమర్త్యేషు" (**19-26-1** అధ) అగ్నివలనబుట్టిన బంగారును ధరించు మనుజులను జరామరణరహితులుగ జేయును.

"యద్ధిరణ్యంసూర్యేణ సువర్ణం ప్రజావన్తో మనవః పూర్వ ఈషిరే। తత్వా చన్ద్రంవర్చసా సంసృజత్యా యుష్మాన్ భవతి యోబిభర్తి" అధిక తేజోవిశుద్ధుండగు సూర్యునివలన మిక్కిలి మనోహరమగు వర్ణమును పొందిన బంగారము నెవరు ధరించెదరో వారు ఆయుర్వృద్ధిని తేజస్సును బొందుదురు.

పైజెప్పిన ప్రమాణముల పర్యాలోచించగా ఋగ్వేదాదులయందును విశేషముగ నధర్వవేదమందును ఖనిజపదార్థ పరిజ్ఞానమును కాయశస్త్రచికిత్సలయందు వానివినియోగంబును సువర్ణాద్యాభరణముల నిర్మాణముచేయునప్పుడు వానిసన్ధానముచేయు ప్రక్రియలను మొదలగు రసతన్త్రవిజ్ఞానమును మహర్షులు వేదములకాలముననే సప్రపఞ్చముగ దెలిసియుండిరని యూహింపదగియున్నది. మరియు ఆయుర్వేదాన్తర్గత రసాయనశబ్ద పర్యాయమగు నాయుష్యపదము "ఆయుష్యాణి భేషజాని" అను శ్రుతివాక్యమున నుండుటవలన జరావ్యాధినాశకములై రసతన్త్రమున మిక్కిలి వన్నెకెక్కిన రసాయనయోగరాజములను వైదికయుగముననే యెరింగియుండిరనుట నిర్వివాదము.

## కామసూత్రములు, రసతన్త్రపరిజ్ఞానము.

వాత్స్యాయన మహర్షి విరచిత కామసూత్రములయందు అరువది నాలుగు కలలను చెప్పుచు నందు "సువర్ణరత్నపరీక్షా" అనగా బంగారమును రత్నములను పరీక్షించి వాని క్రయమును నిర్ణయించుట, మరియు "మణిరాగకరజ్ఞానం" అనగా మణులకు వర్ణోత్కర్షతను గలిగించుటయు *"ధాతువాద" మనగా, ధాతులోహాదుల ననేకవిధముల పరిణమింపజేయు ప్రక్రియా విధానమును కలయనియు దెలిపియున్నది. దీనిని పరిశీలించినచో మహర్షులు చిరకాలమునకు బూర్వమే పై రత్నములు ధాతువులు మొదలగు విద్యలయందు మిక్కిలి నైపుణ్యమును పొందినటుల స్పష్టమగుచున్నది.

## శుక్రనీతి-రసతన్త్రపరిజ్ఞానము.

సుప్రసిద్ధనీతిశాస్త్రకోవిదుఁడగు శుక్రాచార్యులు తన గ్రన్థమున చతుష్షష్టి కలలను విభజించుచు నాయుర్వేదమునకు జేరిన కలలు పదియని చెప్పియున్నారు. అందు రసతన్త్రమునకు జేరిన "పాషాణధాత్వాదిద్రుతిః తద్భస్మీకరణం కలా । ధాత్వౌషధీనాం సంయోగక్రియాజ్ఞానం కలాస్మృతా" అను దీనిని గమనించినచో ప్రాచీనకాలముననే ధాతువులనుండి ద్రుతుల దీయుటయందును భస్మీకరణమునందును ధాతు సమ్మేళనములయందును ఆర్యులు మిక్కిలి ప్రశస్తిగాంచిరని తెలియుచున్నది. మరియు "ధాతుసాంకర్యపార్థక్యకరణన్తు కలా స్మృతా । సంయోగాపూర్వవిజ్ఞానం ధాత్వాదీనాం కలా స్మృతా । క్షారనిష్కాసనజ్ఞానం కలాసంజ్ఞం తు తత్స్మృతమ్" అనియు లోహములను ఇతరద్రవ్యములనుండి వేరుపరచుటను ఇతరపదార్థములతో గలిపి మిశ్రపదార్థములుగ జేయుటను క్షారముల జేయు ప్రక్రియలను కలయని దెలిపియున్నది. దీనిని చూడ హిందువులు చిరకాలమునకు ముందుగనే ఇందు చక్కని జ్ఞానము గలిగియుండిరనియు స్పష్టమగుచున్నది.

---

* ధాతువాదః - క్షేత్రవాదః - మృత్ప్రస్తరధాతూనాం పాతనశోధనమేలనాదిజ్ఞానహేతుర్గ్రన్థః. వాత్స్యాయనసూత్రము అ—3 సాధారణాధికరణము.

## చరకసుశ్రుతములు-రసతంత్రవిజ్ఞానము.

చరకసుశ్రుతములని ఖ్యాతిగాంచిన వైద్యగ్రంథములయందు లోహముల యొక్కయు ధాతువులయొక్కయు వినియోగములు విశేషముగ ప్రయోగ సరణియందు గానరావు. అయినను చికిత్సాస్థానమందలి రసాయనప్రకరణమున బంగారు, వెండి, ఇనుము, ముత్యములు, మొదలగువాని వినియోగమును, ప్రమేహమున శిలాజతుప్రయోగమును, కుష్ఠరోగమున రసభస్మప్రయోగ మును, శ్వాసరోగమున మనశ్శిలాప్రయోగమును గనబరచియున్నారు. మరియు సుశ్రుతమున కుష్ఠరోగప్రకరణమున బంగారు, వెండి, ఇనుము మొదలగువానిని అయస్కృతుల (ద్రుతుల) జేయు ప్రక్రియలను నేత్రరోగమున మైలతుత్తము యొక్క వినియోగమును కనబరచియున్నారు. పై గనుపరచిన జారితలో హాదిప్రక్రియలను, జారితమైన రసభస్మముయొక్క ప్రయోగములను బరికించ నయ్యవి శాస్త్రీయములగు రసతంత్రప్రక్రియలుగ క్రైస్తవశకమునకు(బి.సి.) కొన్ని శతాబ్దములకు ముందుగనే యుచ్ఛస్థితిలోనున్నట్లు తెలియుచున్నది.

వేదములకాలమునుండి క్రమముగ నభివృద్ధినందిన రసతంత్రపరిజ్ఞానము క్రమముగ భౌతికవిద్యలుగ పరిణమించినటులను అయ్యవి శక్తితంత్రము, సౌదామినికలా, అండకౌస్తుభము, అంశుబోధిని, లోహతంత్రము, ధాతుసర్వస్వము మొదలగు ననేకగ్రంథముల నాధారపరచుకొని యుండినటులను దెలియుచున్నది. పై గ్రంథరాజములను గూర్చి యనేకమహనీయులు విశేషముగ బ్రయత్నములసలిపిరి; గాని యాగ్రంథములు దొరకుట దుస్తరముగనున్నయది. ఇందు కొన్నిగ్రంథములయందలి విషయములను బెంగుళూరునందుండు అస్మత్ప్రియమిత్రులును, విద్వద్వర్యులునగు బ్రహ్మశ్రీ పండిత ఆనెకల్ సుబ్బరాయ శాస్త్రిగారు దెలిసియున్నారు.

ప్రపంచము అసత్యమనియు పరబ్రహ్మమేసత్యమనియు బోధించు "జగన్మిథ్యాబ్రహ్మసత్యమ్" అను వాక్యములను వెదజల్లిన శ్రీశంకరాచార్యుల వారి కాలమునుండియు మహర్షులచే గనుగొనబడిన ప్రపంచోపయోగమగు భౌతికవిద్యలన్నియు క్షీణింపందొడంగె.

శవచ్ఛేదాదులతోఁ గూడిన శారీరశాస్త్రవిజ్ఞానము వైద్యమునకు ముఖ్యాఙ్గమని సుశ్రుతాదులు బోధించిరి. శుక్రాచార్యాదులు శల్యతన్త్రవిజ్ఞానము ప్రత్యేకకలయని జూపిరి. స్మృతికారులు ఏతదనుయాయులను నిందితులని వ్రాయుటచేతను శఙ్కరాచార్యాదులు నుడివిన పలుకులను ఐహికేతరములని దెలిసికొనజాలక బ్రహ్మనిష్ఠాపరులగుటయే యుత్తమమని ప్రజలు నమ్మికలతోనుండుటచేతను జ్ఞానగరిష్ఠులచే నభ్యసించదగిన కలలు క్రమముగ పామరులపాలబడుట కారంభించెను. ఇట్టి సమయమునందును శారీరశల్యతన్త్రవిజ్ఞానము శ్రీ వాగ్భటుల సమయమున స్వతన్త్రాభివృద్ధి గాంచినటుల అందలి యనేకాంశములనుండి దెలియుచున్నది.

భౌతిక రసతన్త్రములు స్వతన్త్రాభివృద్ధి గాంచకున్నను వైద్యమున కనుకూలమగు విజ్ఞానముమాత్రము క్రమముగ వృద్ధినొందుచుండినటుల నీక్రింద నుదహరించబడిన ప్రమాణములనుండి తోఁచుచున్నయది.

వాగ్భటునికాలమున (క్రీ.శ. 500 A. D.) క్రమముగ వృద్ధినిపొందుచు వచ్చిన రసతన్త్రవిజ్ఞానమున రసవైద్యము క్రీ. శ. A. D. 9 - వ శతాబ్దమున నుండిన బృందమాధవుల కాలముననుు చరకసుశ్రుతములకు విఖ్యాతవ్యాఖ్యాకారుడగు క్రీ.శ. 1050 A. D. నుండిన చక్రపాణికాలమునను చక్కని శాస్త్రీయపద్ధతులతోఁ గూడినదై యున్నతస్థితి నందెననియు వీరికాలముననే ఖండాంతరములయందును పాశ్చాత్యరసతన్త్రప్రక్రియలు కొంతవరకు అభ్యాసదశయందున్నవనియు నయ్యవి గడచిన 17 శతాబ్దమువరకును ఉచ్చస్థితినందలేదనియు డాక్టర్ పి.సి. రాయిగారువారి హిందూకెమిష్ట్రీయందుదహరించియున్నారు.

## రసతన్త్రవాఙ్మయము.

వేదములకాలమునుండి యారంభమై చరకసుశ్రుతముల కాలమునకంటె పూర్వమునుండి యభివృద్ధిగాంచిన ఇందలి వాఙ్మయము రసరత్నాకరము, రసార్ణవము, ఆనందకందము, రసప్రదీపము, రససిద్ధాన్తానుశాసనము, రసరత్నసముచ్చయము, శివతత్వరత్నాకరము, రసహృదయము, రససారము, కాకచండీశ్వరతన్త్రము, రసేన్ద్రచిన్తామణి, రసేన్ద్రచూడామణి, రసప్రకాశసుధాక

రము, రసచిన్తామణి, రసకల్పము, రసరాజలక్ష్మి, రసనక్షత్రమాలిక, ధాతు రత్నమాల, ధాతుక్రియ, రుద్రయామళము, సువర్ణతన్త్రము మొదలగు గ్రన్థ రూపముల సంస్కృతమున గడచిన పదునెనిమిదవ శతాబ్దమువరకును నభివృద్ధి నందియుండెను. ఈ రసతన్త్రవాఙ్మయమున ముద్రితములుగను అముద్రితము లుగనునుండు గ్రన్థములు ఇప్పటికిని భారతభూమియందును ఖణ్డాన్తరములయం దును రమారమి నాదెలిసినకొలది మున్నూరువరకు దొరకుచున్నయవి.

మరియు నీరసతన్త్రవాఙ్మయము గడచిన రెండువందలవత్సరములకు పూర్వమును మూడువందలవత్సరములకు లోపలను ఆన్ధ్రభాషయందు పద్య రూపముగను టీకారూపములుగను కూడ ఔన్నత్యము నందియుండినదనుటకు నవనాథసిద్ధదీపిక, ఆన్ధ్రవైద్యచిన్తామణి, రసప్రదీపము, రసరత్నాకరము మొదలగు గ్రన్థరాజములే నిదర్శనములు.

ఈ రసతన్త్రములనుగురించి సుప్రసిద్ధరాసాయనిక తన్త్రకోవిదుడగు డాక్టర్ ప్రఫుల్లచన్ద్రరాయ్‌గారువ్రాసిన వారిహిన్దూకెమిస్ట్రియను (హైన్దవ రాసాయనికతన్త్రమను)గ్రన్థముచే దీనియౌన్నత్యము ఇందలివిషయములు ప్రా చీనత మొదలగు చారిత్రకవిభాగాదులు తెలియగలవు; అందు వైద్యకప్రక్రియా భాగమున వారిచే విడువబడిన యంశము లనేకము లుండుటంజేసి కొంతవరకు పాఠకుల యుపయోగమునకై వానింగూర్చి యించుక వివరించుచున్నాను.

## రసతన్త్రము దానినిరుక్తి.

రస (పాదరస) ప్రధానముగు ధాతులోహరత్నాది ప్రక్రియలను బోధించుటంజేసి యీతన్త్రమునకు రసతన్త్రమని సంజ్ఞకలిగెను. దీనినే రస శాస్త్రమనియు రసవైద్యమనియు కూడ కొన్నిగ్రన్థములగాననగును.

ఇట్టి ప్రక్రియాది బోధకమగు “కెమిస్ట్రి” యను పాశ్చాత్యరస తన్త్రము దేశభాషలయందు “రసాయన శాస్త్రము” అని వాడుకలో గనబట్టుచున్నది. “రసాయనము” అనునది వేదములయందును ఆయుర్వే దమందును “యజ్జరావ్యాధినాశకం తద్రసాయనం” అనగా ముదిమితన మును వ్యాధులను బోగొట్టి దీర్ఘాయువును గలిగించుతన్త్రము రసాయన

తన్త్రమని బోధింపబడియున్నది గాన "కెమిష్ట్రి" అను తన్త్రమును రసాయనశాస్త్రము అనుటకన్న ఆర్యపుఙ్గవులు ప్రాచీనకాలమున స్థిరపరచిన "రసతన్త్రము" అను పేరున దేశభాషలయందు వాడుట సమంజసముగ నుండును. కొందరు "రసాయనము" అను పదమునకు రసధాత్వాది ప్రక్రియలకు స్థానమని యవయవార్థమును జెప్పి "కెమిష్ట్రి" యనుదానిని "రసాయనశాస్త్రము" అనుట సాధువని జెప్పందొడంగినను "రసాయన విషయములు" కూడ పై రసతన్త్రముయొక్క యైదుభాగములలో నొకటియగుట చేతను వారివాదము నిలువజాలదు.

## రసతన్త్ర విజ్ఞానము, దానియారమ్భము.

ఇనుము సీసము తగరము మున్నగు క్షుద్రలోహములను స్వర్ణ రజతములగు నుత్తమ లోహములుగ బరిణమింపజేయుటకును రత్నములు మున్నగు నుత్తమమణుల నిర్మించుటకును రసశాస్త్రజ్ఞులు తొలుదొలుత బ్రవర్తించిరనియు అట్టిప్రయోగములయందు వారు ఫలమును గాంచకుండుతరి వారి పరిశోధనములన్నియు రసవైద్యవిజ్ఞానరూపముగ బరిణమించినవనియు చరిత్రకారులు నుడివెదరు. శాస్త్రజ్ఞులు ప్రాథమికదశయందు ఎట్టియుద్దేశముతో పదార్థములను పరిశోధనముల జేయగడంగినను వారియుద్యమములకు సంబంధించిన పరిజ్ఞానముయొక్క పరిణామదశయందు గల్గిన ఫలమునుగురించి తెలిసికొనుట యవసరము.

## రసతన్త్రము రెండువిధములు.

అందొక భాగమునకు రసార్ణవాది గ్రన్థకర్తలగు నాగార్జునాదులును మన్థానభైరవాది భైరవులును నిత్యనాథాది సిద్ధులును రసతన్త్రప్రవర్తకులని సంస్కృత వైద్యవాఙ్మయమున దెలియుచున్నది.

దక్షిణభారతమున నగస్త్యసంప్రదాయమునకు చేరిన వ్యాహముని భోగయ్యర్ మొదలగు పదునెనమండ్రుగురుసిద్ధులచే విరచితములగు గ్రన్థములు ప్రసిద్ధములని ద్రవిడవైద్య వాఙ్మయమునుండి తెలియుచున్నది.

ఈరెండువిధములగు రసతన్త్ర గ్రన్థములును దక్షిణభారతమున నిప్పటికిని ప్రసిద్ధములు.

అగస్త్యసంప్రదాయమునుగురించి యుత్తరభారతవాసులగు నాయుర్వేదవేత్తలకును తదితరులకును నాదెలిసినంతవరకు కొంచెమైన తెలియదు. ఈరెండుసంప్రదాయములకును జేరిన రసతన్త్రవిధానములను చర్చించుట యవసరము. అయినను ఆసంప్రదాయమున విమర్శనముతోఁ గూడినగ్రన్థము విపులముగ నాచేత వ్రాయబడుచుండుటచేతను ప్రకృతమున నాగార్జునాదితన్త్రముల నుద్దేశించియే యీగ్రన్థము ప్రవర్తించుటచేతను సంస్కృత రసతన్త్రముల నుద్దేశించియే యిందుక వ్రాసెదను.

## రసవైద్యము, దాని యుద్దేశము.

రసవార్త్తికాచార్యులు భైరవులు సిద్ధులుమున్నగు రసతన్త్రప్రవర్తకులు మూలికలచే జేయబడిన యౌషధము లధికపరిమాణముచే నీయవలసియుండు ననియు అయ్యవి రుచికరములు గాకుండుటచే యసహ్యత గల్గించుననియు వెంటనే రోగములను కుదుర్చుటయందు సామర్థ్యము చాలినంత వానికి లేదనియు అట్టి యౌషధములు చిరకాలమున్నచో నిజవీర్యమున నుండ వనియు తలంచి అట్టి దోషములదొలంగింప లోహములు ధాతువులు మొదలగువానిని భస్మసిన్దూరాదులజేయు నుపాయములకై ప్రయత్నించిరని “ అల్పమాత్రోపయోగిత్వా దరుచేరప్రసఙ్గతః । క్షిప్రమారోగ్యదాయిత్వా దౌషధేభ్యోరసోఽధికః ” అను నీరసరత్నాకర వాక్యముచే దెలియుచున్నది.

## పారదసంస్కారములు.

పారదమును శుద్ధినందించి ఔషధముల నుపయోగించుటకు జెప్పబడిన స్వేదనము, మర్దనము, మూర్ఛనము, ఉత్థాపనము, పాతనము, నిరోధనము, నియమనము, దీపనము, అను నీయెనిమిదివిధములగు సంస్కారములును ; వాదప్రక్రియలయం దుపయోగించుటకై జెప్పబడిన గగనగ్రాసము, చారణము, జారణము, గర్భద్రుతి, బాహ్యద్రుతి, రఞ్జనము, సారణము, క్రామణము,

వేధనము, శరీరయోగము, అను నీపదివిధములగు పారదసంస్కారములును ఎన్నియోవందల సంవత్సరములకు పూర్వము చెప్పబడినను ఇక్కాలపు నవీన పద్ధతులకు వెనుదీయక యున్నయవి.

## యన్త్రములు, వానియుత్కృష్టత.

పాదరసము మున్నగు వస్తువులను పైఁజెప్పఁబడిన యనేకవిధములగు సంస్కారముల నందించుటకు యన్త్రములే ముఖ్యసాధనములని తెలిసికొనిరి. అందు పాదరసమును మూర్ఛనము భస్మము బద్ధము మొదలగు పరిణామముల నందించుటకును వర్ణాన్తరమునందించుటకును యన్త్రములు ముఖ్యములనియు తెలిసినవారు యన్త్రబలములేక పైఁజెప్పినక్రియల జేయఁబూనరనియు "జారణే మారణే చైవ రసరాజస్యరఞ్జనే। యన్త్రమేవపరంకర్మ యన్త్రవిద్యా మహాబలా। ఓషధీరహిత శ్చాయం హఠాద్యన్త్రేణ బధ్యతే। తస్మాద్యన్త్రబలం చైకం నవి లక్షణీయం విజానతా" అను రసార్ణవ నాలవపటలమునుండి తెలియుచున్నది.

యన్త్రబలములేక యెట్టికార్యము జేయఁగూడదనియు యన్త్రబలమే బల మనియు వ్రాసినదాని నేకాగ్రచిత్తముతో యోచించినచో మనపైఁపూర్వులు పూర్వకాలమున నెంతటిదీక్షతో కార్యముల జరుపుచున్నదియు యన్త్రముల విషయమై యెంతటిమహిమను గనుగొనినదియు స్పష్టమగును.

ఇందలి డమరుకయన్త్రము, విద్యాధరయన్త్రము, గర్భయన్త్రము, సోమానలయన్త్రము, కచ్ఛపయన్త్రము, నాభియన్త్రము, వాలుకాయన్త్రము, జారణాయన్త్రము, డోలాయన్త్రము మొదలగు నానావిధ యన్త్రములును; అన్ధమూష, గోస్తనమూష, వృన్తాకమూష, మహామూష, మంజూషమూష మొదలగు మూసలును రసరత్నసముచ్చయమున నేడవయధ్యాయమున నిపుణముగ నిరూపింపబడినవి.

## శోధన జారణ ద్రవీకరణ సత్వపాతనములు.

గనులయందు జనించిన లోహములు, ధాతువులు, రత్నములు మున్నగు వానియందు అనేకములగు విషముల మాలిన్యములు గలిసియుండుట సహ

జము. మున్ముందు అట్టివానిని వానికి విపరీతములైన వస్తువులచేత శోధనములజేసి యట్టి దోషముల నివర్తింపజేయుచుండిరి. ఇట్లు శోధింపంబడిన ఖనిజములను ఔషధయోగములయందు జేర్చియు కేవలము ఔషధములుగను వినియోగించుటను గన్గొనిరి.

శుద్ధినందించినపిదప ఖనిజములను అనేక స్వరసకషాయాది వస్త్వంతరముల సంయోగమున మర్దనములసలిపి నియమితపుటములచే భస్మము సిన్దూరము సత్వపాతనము ద్రవము అనునీ పరిణామముల నందించు ప్రక్రియలను గనిపెట్టిరి.

## లోహములు.

శుద్ధమగు ఇనుము ఉక్కు కాన్తము అను లోహములను అనేకప్రకారములగు ప్రక్రియా భేదములచే సిన్దూరములుగ జేయుచుండిరి. ఈ భస్మసిన్దూరములు భుజించినతోడనే చక్కగ జీర్ణమై రక్తముతో గలియుటకు దగినవై యున్నవి.

పశ్చిమదేశ వైద్యపద్ధతులలో జేరిన ఉత్తమములని చెప్పబడు లోహసిన్దూరము మలబన్ధమును జేయుచుండుటయు మనప్రాచీనులు సామాన్యమని చెప్పియుండు లోహసిన్దూరము మలబన్ధమును జేయకుండుటయు నెల్లవారికిని తెలిసియేయున్నది.

## లోహమిశ్రౌషధములు.

లోహభస్మములయొక్కయు ఇతరములగు ఖనిజములయొక్కయు సంయోజనములనుండి జేయబడు కాన్తవల్లభరసము, లోహరసాయనము, రజతలోహరసాయనము, రసరాట్ మొదలగు నౌషధములును, వాని ప్రక్రియలును, పాశ్చాత్య వైద్యకపద్ధతులలో నున్నట్లు కనుపించవు.

బంగారు వెండి రాగి సీసము తగరము సత్తు మొదలగువానియొక్క భస్మసిన్దూరములు పెక్కుభంగులగలవు. వీని సంయోజనముచే జేయంబడు లక్ష్మీవిలాసరసము, సువర్ణభూపతి, మకరధ్వజము, స్వర్ణపర్పటి, ప్రళయానల

రుద్రరసము మొదలగు నౌషధముల విషయమై ప్రాచీనులు కన్గొనిన మార్గము లలో నేకదేశముగూడ పాశ్చాత్య వైద్యకపద్ధతులవారెరింగియుండలేదనుట యాశ్చర్యము గాదు; బంగారు వెండి ఇనుము మొదలగు లోహములను ద్రవ రూప పరిణామమునుగూడ చిరకాలమునకు ముందే ప్రాచీనులు గనుకొనిరను టకు సుశ్రుతమునందలి అయస్కృతులు నిదర్శనములు.

## రత్నమిశ్రౌషధములు.

వజ్రములు వైడూర్యములు మొదలగు రత్నములను భస్మరూపము గను ద్రవరూపముగను నవరత్నచిన్తామణి మహారాజమృగాఙ్కము మొదలగు నౌషధములను దెలిసియున్నారు. రత్నములకు సంబంధించిన యెట్టి యౌషధ మార్గములు గాని పశ్చిమదేశ వైద్యపద్ధతులలో నిప్పటికిని లేవనుట నిక్కము. ఈ రత్నములలో జేరిన సామాన్యమగు పగడభస్మమువంటి యౌషధముగూడ ఇప్పటి నవీనపద్ధతుల గనపడవు.

## పాషాణమిశ్రౌషధములు.

శంఖపాషాణము, గౌరిపాషాణము, ఉల్లిపాషాణము మొదలగు పాషా ణములను శోధనములనందించి రామబాణరసము, నవగ్రహరసము, ద్విమూర్తి రసము, వాతాగ్నికుమారము మొదలగు నౌషధములంజేయుట గనుగొనిరి. ఇట్టి పాషాణాది సంయోజనౌషధములకు ఆర్యులే మొదటివారని డాక్టర్ రాయి గారు సిద్ధాన్తము జేసినది జగద్విదితము.

## విషమిశ్రౌషధములు.

లోహాదిసంఘటనములో సర్పవిషమును, చేపలు, ఎనుములు, గుఱ్ఱములు, మేకలు, ఆవులు, కోడి, నెమలి మొదలగువాని పిత్తములను (చేదుకట్లు) జేర్చి సూచికాభరణము సింహప్రతీపానలము మహాతరుణార్కము సమ్మోహనా స్త్రము పాశుపతాస్త్రము సూచీముఖరసము మొదలగు దివ్యౌషధములం జేయుపద్ధతిని గనిపెట్టిరి. సూతికారోగములయందును, సన్నిపాతాదులయం దును, వీనిమహిమ నిరంకుశముగనున్నదని యెవరెరుంగరు. ఇట్టిప్రక్రియలు పాశ్చాత్యవైద్యముననుండినట్లు కనుపించదు.

## ద్రుతులు.

సైన్ధవలవణము అన్న భేది వెలిగారము బిడాలవణము సౌవర్చలలవణము గన్ధకము మైల్ తుత్తము సురేకారము క్షారములుమున్నగువానిని భాగభేదములుగ జేర్చి తిర్యక్పాతన యన్త్రసహాయముచే శఙ్ఖద్రావకము పఞ్చలవణద్రావకము లోహద్రావకము గన్ధకద్రావకము మొదలగు ద్రావకములను మిగుల నేర్పుతో దీయు విధానము నెరింగిరి. అట్టి ద్రావకములను గుల్మము మూత్రాఘాతము మూత్రకృచ్ఛ్రము మహోదరము ప్లీహవృద్ధి యకృద్వృద్ధి మొదలగు వ్యాధులయందు ధారాళముగ నుపయోగించుచుండిరి.

ఈ ద్రావకములను సామాన్యులగు దేశీయవైద్యులుగూడ స్వయముగనే దీయుటను వ్యాధులయం దుపయోగించుటను చక్కగ నెరింగి యిప్పటికిని వాడుకలో నుంచుకొనియున్నారు. వీనినిగూర్చి చిన్తామణి భైషజ్యరత్నావళి రసకౌముది రసరత్నాకరము మొదలగు రసతన్త్రములయందు అనేక యోగములు బోధించబడియున్నవి.

## సూదులచే నౌషధముల యుపయోగము.

ప్రకృతకాలమున పాశ్చాత్యవైద్యులు సూదులనుండి యౌషధములను రోగవిశేషముల నుపయోగించుట విదితము. ఇట్టి ప్రయోగములయందును ప్రాచీనకాలముననే ఆర్యులు నేర్పరులనుట కనేకప్రమాణములు గనుపడుచున్నవి.

అందు రసరత్నసముచ్చయమందలి సన్నిపాతప్రకరణమందిట్లు నిరూపితము. తీవ్రసన్నిపాతవ్యాధియందు తాలు (చెవివెలు) ప్రదేశమున చివ్వి మిక్కిలి వాడియైన మొనగలసూదిచే ప్రయత్నపూర్వకముగ *సూచికాభరణము

*సూచికాభరణరసము.—సన్నిపాతేన తీవ్రేణ ముహ్యతో౽ర్ధ్యాగతస్య చ । తాలుని ప్రచ్ఛయిత్వాథ రసమేనం వినిక్షిపేత్ । సూచ్యాతిసూక్ష్మయా తోయా భిన్నయాతి ప్రయత్నతః । తతస్తైలేన తంలిప్త్వానివాతే సన్నివేశయేత్ । తతో౽ర్ధ ప్రహరాదూర్ధ్వం ముక్తమూత్రపురీషకమ్ । లబ్ధసంజ్ఞం

నుపయోగించునది. బ్రహ్మద్వారమున చీని నెత్తురువచ్చినమీద సూచీముఖరసమును పాశుపతాస్త్రిరసమును ఉపయోగించునది.

## ఔషధములు వానివీర్యము.

వివిధచికిత్సలయందు పైగనబరచిన యౌషధములు కజ్జలి యౌషధములనియు పక్వౌషధము (కుప్పెమాత్ర)లనియు పర్పటియౌషధములనియు పోటలీబద్ధములనియు నివి మొదలగు భేదములు గల్గియుండును. ఇందు పక్వౌషధములు మిక్కిలి శ్రేష్ఠములు. ఇవ్వి కొన్నివేల వత్సరములు గడచినను వీర్యము చెడక నానాట నధికమగుననియు గనుగొనిరి. ఒకానొకరోగమున సిద్ధాన్తితమగు నేయౌషధమైనను అనుపానభేదములచే ననేకరోగములను బోగొట్టునటుల గనిపెట్టిరి. ఇట్టి యౌషధనిర్మాణ పద్ధతు లేవైద్యకపద్ధతి యందును లేవనుట నిశ్చయము.

కొన్నివందల సంవత్సరములకు పూర్వము రాజాస్థానములయందును వైద్యపరంపరలయందును రసతన్త్రముల ననుసరించి సిద్ధులుగ జేయబడిన పూర్ణచన్ద్రోదయము త్రైలోక్యచిన్తామణి మహారాజమృగాఙ్కము వసన్తకుసుమాకరము మొదలగు నౌషధరాజములును అభ్రకము కాన్తము లోహము మొదలగువాని సిన్దూరములును నేటికి ననేకులచే వినియోగింపబడుచుండుటను వానినిజమహిమ యప్రతిహతముగ రోగులయెడ గనబడుచుండుటను అందరెరింగినదియే.

---

ప్రతాపాఖ్యం డోలయన్తం శిరోముహుః । ఆయుష్మన్తం విజానీయాత్ అన్యథాచాన్యథా ఖలు ॥

రసరత్నసముచ్చయమున సూచీముఖరసము.—“బ్రహ్మద్వారవికీర్ణ లోహితలవే గుఞ్జైకమాత్రం దదేత్ ”

వైద్యచిన్తామణిలో పాశుపతాస్త్రము.—“ద్విపాషాణం ద్వితుత్థంచ ....................గుఞ్జామాత్రం భిషగ్వరః । లశునస్య చ తైలేన బ్రహ్మద్వారే ప్రలేపయేత్ । తత్క్షణేన నిహన్త్యాశు సన్నిపాతాం స్త్రయోదశ ”

అట్టి యౌషధముల * మాత్రాది పరిజ్ఞానమున (రోగముల యవస్థా భేదములననుసరించి మోతాదులును దెలుపుట) కు రసరత్నసముచ్చయము వైద్యచిన్తామణి మొదలగు పెక్కు గ్రన్థములే నిదర్శనములు.

## క్షారములు.

రసతన్త్ర ప్రక్రియలలో క్షారకల్ప మొకభాగము. ఈ క్షారములు మృదు మధ్యమ తీక్ష్ణభేదములచే మూడు తెరంగులనుండును. మొక్కపుచెట్టు మద్ది ఉత్తరేణి మోదుగ మున్నగువానిదెచ్చి కాల్చి బూడిదెజేసి యాబూడిదెకు యథోచితభాగముగ సున్నపురాళ్లను జేర్చి పైజెప్పిన త్రివిధక్షారముల జేయు చుండిరి. వీనిని శరీరముపై లేపనాద్యుపయోగములచేతనే యనేకవిధములగు వ్రణముల పరిశుభ్రములుగ జేయుటను మాన్పుటను దెలిసికొనిరి. మరియు అర్శస్సు అశ్మరి మహోదరము మొదలగు వ్యాధులయందు లోపలికిగూడ నుపయోగించి మాన్పుచుండిరి. ఈక్షారవిధానమును గూర్చి సుశ్రుతాచార్యులు తనగ్రన్థమున క్షారపాకవిధియను నధ్యాయమును ప్రత్యేకముగ జెప్పియు న్నాడు. అందుజెప్పిన క్షారపాకవిధి ప్రకారమును సిద్ధములగు క్షారములును మిక్కిలి శ్లాఘ్యములనియు శాస్త్రసమ్మతములనియు మార్పులనేమియు నందిం చకయే ప్రస్తుత పాశ్చాత్య రసశాస్త్రమున జేర్పందగుననియు డాక్టర్ ప్రఫుల్లచన్ద్రరాయిగారు వారి హిన్దూ కెమిస్ట్రియందు వ్రాసియున్నారు.

పైవిషయమును పరికించిచూడ మనయార్యులు క్రైస్తవశకమునకు కొన్ని శతాబ్దములకు పూర్వమే క్షారకల్పనావిధానమున విపులమగు జ్ఞానగరిమనంది యుండిరని దృఢమగుచున్నది.

---

* రసరత్నసముచ్చయము.—"మృతసంజీవనాఖ్యోఽయం రసోవల్లమితో శితః" "శీతభఞ్జిరసో నామచూర్ణయే న్మరిచైస్సమం। మాషైకంపర్ణఖణ్డేన"

చిన్తామణి, "సర్వప్రమాణవటికాః............అనుపాన విశేషేణ సన్నిపాతాన్నిహన్తిచ..................మహాకాలాగ్నిరుద్రోఽయం" గుఞ్జామాత్రం ప్రదాపయేత్ । సన్నిపాతాః...............కాలాగ్ని రుద్రనామాయం.

మరియు 16 శతాబ్దమున హిందూదేశమునకువచ్చిన పోర్చుగీసువారి వలన హిన్దువులు క్షారపాకవిధుల గన్గొనిరనుతలంపుతోనున్న పాశ్చాత్య రస తన్త్రవేత్తయగు ఎమ్. బర్తులెట్టుదొరగారు పై సుశ్రుతమునందలి క్షారపాక విధులను జూచి యాశ్చర్యపడిరనియు, ఇట్టి మహనీయుడు అచ్చెరువొందుట కన్న మనకుకావలసినదేమి? యనియు శ్రీరాయిగారు వారి హిన్దూకెమిస్ట్రి యందుదహరించిరి.

## సిద్ధౌషధ పరీక్షకజ్ఞానము.

సిద్ధములైన భస్మసిన్దూరములను రెండువ్రేళ్లతో గ్రహించి చిటికెబట్టిన నాచిటికెలోనుండు ఔషధముపై వ్రేళ్లయందలి రేఖలు అంకితములైయుండు టయు, నీటిపై యాభస్మమునువైచిన తేలుటయు, పఞ్చమిత్రములనబడు బెల్లము గుగ్గిలము లక్క చిరుచేపలు గురివెందగింజలు అనువానిని లోహసిన్దూ రాదులంజేర్చి వానిని పుటముబెట్టినవాని నిజరూపమును జెందకుండుటయు చక్కగ తీరినందుకు లక్షణములైయుండును.

మరియు లోహాది సంయోగముచేసి జేయబడి సిద్ధములైన సిన్దూరములను వసన్తకుసుమాకరము మొదలగుయౌషధములను రంగునుండియు నిప్పులయందుం చుటచే గల్గు ధూమవర్ణమునుండియు రాపిడి బరువు మొదలగువానినుండియు పరీక్షించుచుండిరి. మరియు "రసౌషధానిసర్వాణి త్వగ్నిమధ్యేవినిక్షిపేత్। కిఞ్చిద్గన్ధం ధూమయుక్తం రసయుక్తం సుపాచితం। నజ్ఞాయతేధూమగన్ధ మతి పాకమనౌషధమ్। వల్మీకశిఖరాకారం భగ్నేనీలోత్పలద్యుతి। ఘర్షణేరక్తవర్ణం స్యాత్ సిన్దూరంతత్ప్రశస్యతే। వల్మీకశిఖరాకారం భగ్నేశ్వేతోత్పలద్యుతి। ఘర్షణే రక్తవర్ణంస్యాత్ సిన్దూరంతత్ప్రశస్యతే। వల్మీకశిఖరాకారం భగ్నేశ్వేతోత్పల ద్యుతి। ఘర్షణేనాగవత్స్యాతంకర్పూరన్తుప్రశస్యతే। చామ్పేయకుసుమాభా సం తద్గన్ధేనచసంయుతమ్। లఘువారితరంశ్లక్ష్ణం వసన్తకుసుమాకరం। బృహతీ కుసుమాకారం లఘువారితరంగురు। ఘర్షణేకృష్ణవర్ణంస్యాత్ తన్మృగాఙ్క స్యలక్షణమ్। అతసీపుష్పసఙ్కాశో భూపతిర్లఘుమానకః। దాడిమీపుష్ప సఙ్కాశం పూర్ణచన్ద్రోదయాహ్వయమ్। కస్తూర్యామోదసంయుక్తం మేహ

రోగాపహంశుభమ్ । కిఞ్చిత్కపిలశుభ్రాంశుచ్ఛేదేగురుచనిగ్ధశమ్ । మృదు శంవర్ణతశ్శ్రేష్ఠం స్వచ్ఛవర్ణంబలప్రదమ్ । రాజతంచాప్యతిశ్వేతం భసితంనతు కర్బురమ్ । తామ్రంజమ్బూఫలాభాసం గురుస్యాద్రేకవాన్తికృత్ । నాగోఽపి రక్తవర్ణస్స్యాత్ కిఞ్చిచ్ఛోణోజలేతరేత్ । శఙ్ఖాభం వఙ్గభస్మస్స్యా దల ఘూర్ణానవర్జినమ్ । లోహజం లోహసజ్కాశం కృష్ణవర్ణం భవేల్లఘు। ప్రవాళానలసజ్కాశం కాన్తభస్మలఘూచ్యతే । బృహతీపుష్పసజ్కాశం వైక్రాన్తస్యచభస్మకమ్ । రేఖాపూర్ణంవారితరం అభ్రకంలఘుచోత్తమమ్ " అను నీ "శివతత్వరత్నాకర" వాక్యముల ననుసరించి వర్ణ తాపన ఘర్షణ తోలనాదులనుండి పరీక్షించి యందలి మంచిచెడ్డల నెరుంగు నుపాయములును జెప్పబడినవి. ఈ పరీక్షలకు నిలువనోపకపోయినచో నయ్యవి బాగుగ సిద్ధముజేయబడలేదని నిశ్చయింపదగును. ఇత్తెరంగున సిద్ధౌషధముల గుణదోష పరిజ్ఞానము నెరుంగుచుండిరి.

## శఙ్ఖద్రవాదుల పరీక్ష.

శఙ్ఖద్రవము, లోహద్రవము, తామ్రద్రావకము మొదలగువానియందు శఙ్ఖలోహాదులను సూదులవలెజేసి ఆయా ద్రావకములయందుంచి నియమిత కాలములలో నాసూదులు ద్రవించిపోయిన నాద్రావకము లుత్తమములని గ్రహించిరి. ఈవిషయము సువర్ణతన్త్రములో ద్వితీయకల్పమున నిట్లు చెప్పబడినది:—"శఙ్ఖద్రావస్య భేదాన్ హితత్కల్పాన్ శృణుసామ్ప్రతమ్। లోహద్రావస్తథా తామ్రద్రావశ్చైవ ద్వితీయకః । శఙ్ఖద్రావస్తృతీయస్స్యాత్ హ్యాన్నాలస్య చతుర్థకః। దన్తద్రావః పఞ్చమస్స్యాత్ అమ్లవేధీతు మధ్యమః। పఞ్చానాన్తు పరీక్షావైకథ్యతే శృణుసామ్ప్రతమ్ । లౌహసూచీం సమాదాయ లోహద్రావే వినిక్షిపేత్ । తత్క్షణాద్ద్రవతాం యాతిసాసూచీ నాత్ర సంశయః। తామ్రద్రావే తథాసూచీం సన్ధిభేదీం వినిక్షిపేత్ । సూచీద్రావో యామమాత్రాత్ భవత్యేవ నసంశయః । శఙ్ఖద్రావే శఙ్ఖసూచీ చతుర్యామేన సద్రవేత్ । హ్యాన్నాలోఽథో యదాగచ్ఛేత్ దన్తాశ్చామ్లా భవన్తిహి । ఏవం పరీక్షాం కృత్వాదౌ ప్రయోగా నారభేద్ధ్రువమ్ ॥"

# విమర్శకసభలు.

ప్రకృతకాలమున ననేకశాస్త్రవేత్త లొక్కెడజేరి భిన్నభిన్న భాగము లలోనుండు అనేకవిషయముల జర్చించుచున్నట్టులు పూర్వకాలమునగూడ శాస్త్రజ్ఞు లప్పుడప్పుడును సభలనిర్మించి పలుదెరంగులగు శాస్త్రవిషయముల జర్చించుచుండిరి.

ఇట్టి సభలనుగురించి చరక సూత్రస్థానమున § ఆత్రేయభద్రకాప్యీయాధ్యాయమున (26)నిట్లు వర్ణింపబడినది :—

ఒకసమయమున శాస్త్రపరిజ్ఞానమునందును వయస్సునందును మిక్కిలి వృద్ధులగు నాత్రేయుడు, భద్రకాప్యుడు, శాకున్తేయుడు, మౌద్గల్యగోత్రుడగు పూర్ణాక్షుడు, కౌశికగోత్రుడగు హిరణ్యాక్షుడు, కుమారశిరస్సు అను నామాన్తరముకల భరద్వాజుడు, వాణ్య (ర్య) విదుడను రాజర్షి, విదేహదేశాధిపతియగు నిమియను రాజర్షి, బడిశుడు, బాహ్లీకదేశవైద్యనిపుణుడగు బాహ్లీకుడను నామాన్తరముకల కాఙ్కాయనుడు అను నీమహర్షులందరును కొంతకాలమును సద్విషయ ప్రచారముచే గడుపందలంచి చైత్రరథమను నొకవనమున గుమిజేరి ప్రశంస జేయునప్పుడు రసమును ఆహారమును నిశ్చయించుటకై విమర్శనాపూర్వకముగ నొకవిధమగు చర్చ జరిగినది.

మరియు 814 క్రైస్తవశకాబ్దమునసుండిన (814 A. D.) రాష్ట్రకూట వంశమున జేరిన నృపోత్తుంగచోళుని యాస్థానమున విద్వద్వైద్యుండగు నుగ్రా

§ "ఆత్రేయో భద్రకాప్యశ్చ శాకున్తేయ స్తథైవచ। పూర్ణాక్షశ్చైవ మౌద్గల్యః హిరణ్యాక్షశ్చ కౌశికః॥ యఃకుమార శిరానామ భరద్వాజస్సచానఘః। శ్రీమాన్ వార్యవిదశ్చైవ రాజా మతిమతాం వరః। నిమిశ్చ రాజా వైదేహో బడిశశ్చ మహామతిః। కాఙ్కాయనశ్చ బాహ్లీకో బాహ్లీక భిషజాం వరః। ఏతే శ్రుత వయోవృద్ధా జితాత్మానో మహర్షయః। వనేచైత్ర రథేరమ్యే సమీయుర్విజిహీర్షవః। తేషాం తత్రోపవిష్టానా మియమర్థవతీ కథా। బభూవార్థవిదాం సమ్యక్ రసాహార వినిశ్చయే" .

దిత్యాచార్యులవారు మాంసాహార మచితముగాదని నిరూపించుటకై గొప్ప వైద్యపరిషత్తును జరిపినట్లులు కల్యాణకారకమను గ్రన్థమున "ఖ్యాతశ్రీనృపతుఙ్గవల్లభ మహారాజాధి రాజాస్థితః ప్రోద్యద్భూరి సభాన్తరే బహువిధ ప్రఖ్యాత విద్వజ్జనే। మాంసాశిప్రకరేన్ద్రతాఖిల భిషగ్విద్యావిదామగ్రతః మాంసేనిష్ఫలతాం నిరూప్య నితరాం జైనేన్ద్రవైద్యస్థితః ॥" అని యిట్లు చెప్పబడినది.

పై శ్లోకమునుబట్టి యాలోచించగా నిట్టి సభలు వారివారికాలముల ననేకములుగ జరిగినట్లులు ప్రాచీనగ్రన్థములనుండి తెలియుచుండుటచే చిర కాలమునకు పూర్వమే ఆర్యులు భిన్నభిన్నవిషయములను సభలయందు జర్చించి సిద్ధాన్తపరచుటయు మిక్కిలి సంస్తవనీయమని యిక్కాలపువారికి దోచకమానదు.

## పరిశోధనములు.

ఇక్కాలమున పాశ్చాత్యవైద్యపండితులు పదార్థతత్వములను స్వయముగ బరిశోధించుటయు శోధితవిషయములను సిద్ధాన్తము జేయుటయు విదితము. అటులనే ప్రాచీనకాలమున నార్యులును రసతన్త్రములయందలి యనేకవిషయములనువారు వారు స్వయముగ జక్కగ బరిశోధించి చూచినట్లును స్వయముగనే కొన్నిటిని ప్రయోగించి వానిఫలమును గన్గొనినట్లును గన్గొనినవాని నెల్ల వ్రాయుచుండినట్లును అనేకములగు విషయములగురించి రసశాలలయందు స్వయముగ బెక్కుపరిశోధనముల జరిపినవారు వారి స్వానుభవసిద్ధములగు వానిని గ్రన్థముల వ్రాసియున్నారు. * ఆయుర్వేద రసతన్త్రికుల వస్తుతత్వ

---

* "స్వహస్తేనకృతం సమ్యక్ జారణం నశ్రుతం మయా। స్వహస్తభవయోగేన కృతం సమ్యక్ శ్రుతేనహి। ధాతుబన్ధస్త్వతీయోఽసౌ స్వహస్తేన కృతోమయా। దృష్టప్రత్యయ యోగోఽయం కథితో నాత్రసంశయః" రసార్ణవము.

"యద్ద్యద్గురుముఖాత్ జ్ఞాతం స్వానుభూతంచ యన్మయా। తత్తు లోకహితార్థాయ ప్రకటీక్రియతేఽధునా" రసరత్నాకరము.

మును పరీక్షించుటకు తగుజ్ఞానముగల యిక్కాలపు ఆయుర్వేదవైద్యులు పరిశోధనల జేయ సమకట్టినచో దగుపరికరములతోగూడిన రసశాలయొక్కటియైన నులేదు. రాజపరిపోషణమా! దూరము. తుదకు పరిశ్రమ జేయు విద్వద్వైద్యులకు దేశభాంధవులుగాని ధనవంతులుగాని జేయు ప్రోత్సాహమా! శూన్యము. ఇట్టిదుస్థితిని కొలదికాలముగ ననుభవించుచు నెరింగిన విషయములలోగూడ నెట్టిపరిశోధనల జేయుటకును సాధ్యముగాక భగ్నోద్యములైయున్నారు.

మఱియు కలలని ఖ్యాతిజెందిన యీవైద్యకరసతంత్రమందలి ప్రత్యక్షప్రయోగములెల్ల స్వప్నప్రాయములైనవి. కలలకుంగల శక్తినివిడచి కేవల మూహాపోహలతోగూడిన విద్యల (తర్కవ్యాకరణాదిశాస్త్రముల) బోలి చరిత్రాత్మకములై నిలిచియున్నయవి.

## రసశాల.

రసప్రక్రియలను నిర్వర్తించుటకును మహౌషధములను సిద్ధముజేయుటకును సిద్ధౌషధములను పరీక్షించుటకును ఆవశ్యకముగ కావలసియుండు రసశాలను నిర్మించుపద్ధతిని గురించి యాతంత్రముల నిట్లు చెప్పబడినది.

సర్వౌషధముల సంపాదింప నర్హమై రమ్యముగనుండు ప్రదేశమున రసశాలనుకట్టవలెను. ఈశాలా ప్రదేశము తూర్పుభాగముననైనను ఉత్తర భాగమున నైనను ఈశాన్యభాగముననైన నుండవలెను. శాలకుచుట్టును మంచి ప్రాకారంబును అందొక నూయియు నుండవలెను. అందలి భాగములన్నియు పరస్పర బాధకములుగాక యుండవలెను. రసశాలయందు తూర్పున రసమును స్థాపించుటకేర్పాటుచేయవలెను. ఆగ్నేయభాగమున పుటములు మున్నగు వహ్నికర్మలు జరుపనగును. దక్షిణభాగముగ పాషాణసమ్బన్ధములగు కృత్యముల జరుపవలయును. నైరృతభాగమున శస్త్రసమ్బన్ధములగు కార్యములును, పడమటివైపున క్షాలనాది కృత్యములును, వాయవ్యభాగమున నెండబెట్టుపనులును, ఉత్తరపుదిక్కున వేధకర్మలును, జరుగునట్లు నియమించవలెను. ఈశాన్యభాగమున సిద్ధవస్తువులను స్థాపించనగును.

మరియు రససాధనమున కుపయోగింపదగిన వస్తువులనన్నింటిని సంగ్రహించి యీశాలయందుంచవలెను. అందు సత్వపాతనకోష్ఠి గారకోష్ఠి భూమికోష్ఠి చలత్కోష్ఠి యను కోష్ఠుల (సత్వములదీయుటకును తీసినవానిని శుద్ధి చేయుటకును నుపయోగించునటుల ఇటికెలు మొదలగువానిచే వివిధవిన్యాసముగ కట్టబడియుండునవి కోష్ఠులనంబడును. ఇవియే కొలిములని వ్యవహరించబడును) మత్తదుచిత భాగములయందు నిర్మించవలెను. అనేకవిధములగు నీటితొట్లు నుంచవలెను. కొలిముల నూదుటకు జంట తోలుతిత్తు లుండవలెను. మట్టిచేతను లోహముచేతను జేయబడిన యూదుడు గొట్టములు బంగారు వెండి ఇనుము కంచు రాగి రాళ్లు అనువానిని కొచుటకుపయోగింపందగిన కుంపటులు ఖండని పేషణి మొదలగు నుపకరణములు దోనెలవలె నుండునవియు గుండ్రముగ నుండునవియునగు ఖల్వములు తప్తఖల్వములు ఆయసఖల్వములు వానివాని కుచితములగు పాత్రములు ఇవిమున్నగు విచిత్రములైన సాధనములన్నియు సిద్ధముగ నుండవలెను.

మరియు మూడువిధములగు జల్లెడల నుంచవలయును. అందొకటి స్థూలద్రవ్యముల జల్లించుట కనుకూలములగు రంధ్రములతోగూడి వెదురుపేళ్లతో కట్టబడియుండవలెను. రెండవది కొండగోగు బూరుగ మొదలగువాని కంబ (నార) చే గూడి వెదురుతో చేయబడి సూక్ష్మద్రవ్యములను జల్లించుట కనుకూలములగు రంధ్రములు గల్గియుండవలెను. మూడవది మూరెడునిడివియు విశాలమునుకల్గి గొఱ్ఱెతోలుచే చుట్టబడి గుఱ్ఱపుతోకయందలి వెండ్రుకలచే నేయబడిన గడ్డకలిగియుండి మిక్కిలి సన్ననివస్తువుల జల్లించుట కుపయోగించునదిగ నుండవలెను.

మరియు ననేకములగు మూసలు మన్ను ఊక ప్రత్తి ఏరుడు పిడకలు ఎండినపిడకలు ధాతువులు జీవజములు మూలికలునను మూడువిధములగు పదార్థములు శిఖిత్రములు (నీళ్లుబోయక చల్లార్చినబొగ్గులు) గోర్వరము (పశువుల దొడ్డిలో పశువులచే త్రొక్కబడిమెండి దుమ్మువలెనుండు పేడ) కంకరరాళ్లు పలుగురాళ్లు ఇవి మున్నగువానిని సిద్ధపరచి యుంచవలెను.

రాజు ఇనుము మన్ను గవ్వ అనువానిచే జేయబడిన కుప్పెలు చేటలు వెదురుతట్టలు కత్తులు కత్తిపీటలు మూకుళ్లు సమ్మార్జనములు మొదలగు పరికరములను ఇవిగాక యింకను ఆయావిధానముల కావశ్యకములగు నిఖిలవస్తువులను సర్వోపకరణములను సిద్ధపరచి యచ్చట నుంచవలెను.

ఆయాదేశభాషలనెరింగి నిఘంటువులను రససంహితలను జక్కగా చదివియుండు జ్ఞానవన్తులను రససాధకులుగా సంపాదింపవలెను. పనులయందు ప్రయత్నముకలవారును పరిశుద్ధులును శూరులును బలిష్ఠులునునగు పరిచారకుల నేర్పరుపవలెను.

ధనవన్తులును వితరణశీలులును సర్వసాధనసమ్పత్తిగలవారును గురువాక్యమున నాసక్తులునునగువారు ధాతువాదకృత్యములయం దుపయోగింపదగుదురు. ఆయా యౌషధముల నామరూపముల నెరింగినవారును పరిశుద్ధులును మోసములేనివారును అనేకదేశభాషల నెరింగినవారును నగువారిని యౌషధుల దెచ్చుటకై నియమింపవలయును.

## రసేశ్వరదర్శనము.

"ఆయతనం విద్యానాం మూలం ధర్మార్థ కామమోక్షాణామ్। శ్రేయః పరంకిమన్య చ్ఛరీరమ జరామరం విహాయైకమ్" అను (రసహృదయ) వాక్యముచే నీరససిద్ధాన్తమునకు ధర్మార్థకామమోక్షము లనుచతుర్విధపురుషార్థములే ముఖ్యప్రయోజనములని జెప్పబడియున్నది. అందు రసరసాయనాదులచే రోగముల పోగొట్టుకొని మంచియారోగ్యమును సంపాదించి త్రివర్గఫలముల ననుభవించుట సుప్రసిద్ధము.

"సంసారస్య పరంపారం దత్తేఽసౌపారద స్స్మృతః" అనునిది మున్నగు వాక్యములచే ముక్తికూడ నీరసయోగములవలన కల్గునని దెలియుచున్నది.

దీనికంటె భిన్నములగు ఉపాసనము కర్మము జ్ఞానము మున్నగు సాధనములచే పురుషార్థచతుష్టయము సంపాదింపబడి యనుభవవేద్యమైయున్నను రససిద్ధాన్తప్రక్రియచే సంపాదింపబడినవానికి తదితరసంపాదితములకన్న విశేష

మగుపడుచున్నది. ఎట్టులన? యజ్ఞాదులవలన సంపాదింపబడిన త్రివర్గమైనను జ్ఞానముచే నొందదగిన మోక్షమైనను తత్తత్క్రియాసిద్ధిచేత కర్మాదిప్రతిబంధకములతోగూడ శరీరమునశించి తత్తత్ఫలానుభవయోగ్యమగు శరీరమునొంది యనుభవింపదగియుండును. రససిద్ధాన్తముచే నటుగాక సిద్ధరసరసాయనాదిసేవనముచే నీదేహముననే యజరామరత్వమును ఖేచరాదిసిద్ధులును గలుగును. మరియు యోగాదిసాధనానుష్ఠానమునకు కావలసిన శరీరదార్ఢ్యాదులు కలిగి ఫలానుభవపర్యంతము దేహమును నిలుపుకొను సామర్థ్యము గలుగును; గనుక తత్తత్ఫలముల ననుభవించు సామర్థ్యమునుగల్గించు యోగసిద్ధిని సంపాదించుటవలన నీజన్మముననే చతుర్వర్గము ననుభవించుట కీసిద్ధాన్తము సాధనమని జెప్పబడియున్నది.

ఈవిషయ మీతన్త్రములయందు వివరింపబడిన “మూర్ఛితో హరతి వ్యాధీన్ మృతో జీవయతి స్వయమ్ । బద్ధః ఖేచరతాం కుర్యాత్ రసో వాయుశ్చ భైరవి” “షడ్దర్శనేపి ముక్తిస్తుదర్శితా పిణ్డపాతనే । కరామలకవత్సాపి ప్రత్యక్షా నోపలభ్యతే । తస్మాత్తం రక్షయేత్పిణ్డం రసైశ్చైవ రసాయనైః” “కర్మయోగేనదేవేశి ప్రాప్యతే పిణ్డధారణమ్ । రసశ్చపవనశ్చేతి కర్మయోగో ద్విధామతః” అనునివి మున్నగు వాక్యములచేత స్ఫుటముగ దెలియుచున్నది.

ఇట్టి ప్రక్రియచే సిద్ధిబొంది జీవన్ముక్తులై పరానందము ననుభవించుచుండువారు కొందరు దేవదైత్యముని మనుష్యులయందు కలరనియు “దేవాః కేచిన్మహేశాద్యాః దైత్యాః కంసపురస్సరాః । మునయో వాలఖిల్యాద్యాః నృపా స్సోమేశ్వరాదయః గోవిన్ద భగవత్పాదాచార్యో గోవిన్దనాయకః । చర్పటిః కపిలోవ్యాళిః కాపాలిః కన్దలాయనః । ఏతేఽన్యే బహవస్సిద్ధాః జీవన్ముక్తాశ్చరన్తిహి । తనుం రసమయీమాప్య తాదాత్మ్యక కథాచణాః” అను నీశ్లోకములచే జెప్పబడియున్నది.

కావున పైజెప్పబడిన తన్త్రప్రక్రియల నన్నిటిని విమర్శించి చూచితిమేని యీతన్త్రమునకు ప్రయోజనము దేహారోగ్యముమాత్రమేగాక దివ్యదేహమును సంపాదించి సిద్ధులనందుటయు త్రివర్గఫలముల నీశరీరముననే యను

భవించుటయు ముక్తిసాధనమగుటయు పురుషార్థముల నాల్గిటి నీశరీరము ననే యనుభవించుటకు దగినమార్గమగుటయు ముఖ్యప్రయోజనములని దృఢముగ దెలియుచున్నది.

దానం జేసియే యీతంత్రము జనులకందరకు నవశ్యము గ్రహింప దగినదని తెలుపుట యీతంత్రకారుల యుద్దేశము.

మరియు "అల్పమాత్రోపయోగిత్వా దరుచేర ప్రసజ్గతః । క్షిప్రమారోగ్యదాయిత్వా దౌషధేభ్యో రసోధికః" అను వాక్యముచే కాష్ఠౌషధములకన్న వీనియందుగల వీర్యాధిక్యము సుస్పష్టమగుచున్నది.

"కాష్ఠౌషధ్యోనాగే నాగోవజ్గేఽథవజ్గ మపిశుల్బే । శుల్బంతారే తారంకనకే కనకంచ లీయతేసూతే" అను వాక్యముచేగూడ సర్వౌషధములకు పారదమున సమావేశము చెప్పబడియున్నది.

రసతంత్రవిజ్ఞానమున ప్రధానమగు పారదమునుండి ఆర్యులు చిరకాలమునకు పూర్వము గనుగొనిన మహామహిమాతిశయముల నీయిరువదవ శతాబ్దమున కొందరికి నమ్మకము లేకున్నను కొందరికైనను రసవైద్యవిజ్ఞానమున వేదముల కాలములనుండి యారంభమై యెన్నియోవందల వత్సరములకు పూర్వమున నుచ్చస్థితినందియున్నారనుటవలన నాశ్చర్యము గలుగకమానదు.

## కర్తవ్యము.

ఆయాదేశములయందు శరీరకష్టములను, విశేషధనవ్యయమును, పాటించక పాశ్చాత్య శాస్త్రవేత్తలు క్రొత్తక్రొత్తవిషయములను గనిపెట్టుచు లోకమున ప్రచురించుచున్నారు. వానిలో ననేకములు తగుపునాదిలేనివై సిద్ధాంతితములుగాక నడుమనే యంతరించుచున్నవి. కొన్ని ప్రారంభదశయందున్నయవి. కొన్ని స్థిరబడుచున్నవి. కొన్ని మనప్రాచీన మహర్షులచే గనుగొనబడినవిగ భారతరాజ్యాంగ వైద్యకమంత్రిపుజ్గవుండగు కర్నల్ సర్ పార్డి లూకీస్ మహాశయునిచేతను యింకననేక పాశ్చాత్యవైద్యవిశారదులచేతను పలుమారు కొనియాడబడుచున్నవి. అనాదికాలమునుండి స్థిరమగుపునాదికలదై మిక్కిలి యున్న

తినిపొంది మనప్రాచీనత్రికాలవేదులగు మహర్షుల జ్ఞానజ్యోతితోకూడిన రసతన్త్రవిజ్ఞానమును దిరిగియున్నతస్థితికి దెచ్చుటకు దగుప్రయత్నములు జేయుటయవసరము. లోకమునకు విజ్ఞానమావశ్యకమైన తరుణ మాసన్నమైయున్నది.

వారివారికి సాధ్యమగు మూలధనముతో రసశాలల నేర్పరచి మన రసతన్త్రప్రక్రియలను నూతన విమర్శనములను పరిశోధించ మొదలిడవలెను. ఫలితమును దేశభాషలలో ప్రచురించవలెను. మహర్షుల జ్ఞానతేజస్సును మనంబున నిడికొని యొకరియాదరణ నెదురుజూడక కార్యముల జేయనారంభించవలెను. క్రియారూపముగ కార్యములం జేయ నారంభించినవారలకు దగు సహాయము జేయవలెను. కొలదికాలముగ కుంభకముచే సహస్రారమున నిమిడ్చి కొనబడియున్న పరమాత్మచందమున వారివారి హృదయకుహరములం దుంచుకొనియున్న విజ్ఞానమును క్రియారూపముగ లోకమున గనుపరుచవలెను.

## గ్రన్థకర్త.

ఈగ్రన్థమును విరచించినది వేఙ్కటాచార్యులు. వీరు శ్రీవత్సగోత్రమున ముడుంబయను వంశమున జన్మించిరి. వీరితండ్రి వేదాన్తాచార్యులు. గురువు భట్టరు నరసింహాచార్యులు. మతము విశిష్టాద్వైతము. జాతినిబట్టి శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు, గ్రన్థారమ్భమునగల పద్యమునందలి “కవితజెప్పెద వైద్యయోగంబులెల్ల” యనుపాదమువలనను ఆశ్వాసాన్తగద్యములయందలి “లక్ష్మీనృసింహప్రసాదలబ్ధ కవితాచాతుర్య” యను భాగమువలనను “సూత్రప్రదీపికకు తెనుగుగావింతు” నని కడంగుటంబట్టియు ఈయన ఉభయభాషావిద్వాంసుండనియు విద్వత్కవియనియు తెలియవచ్చును. ప్రథమాశ్వాసమునందలి నాలవపద్యమువలనను గద్యములయందలి “శ్రీమద్వైద్యవిద్యావినోద” యను బిరుదమువలనను సుప్రసిద్ధవైద్యుండని తెలియుచున్నది. రాయబహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారు తమ కవులచరిత్రమునందు వీరికాలమును గురించి “ఇతడు గోదావరిమండలములో నూరుసంవత్సరములకులోపల నుండినవాడు” అని వ్రాసియున్నారు. ప్రకృతకాలమునందు శ్రీవేంకటాచార్య

స్వామివంశజులవలన సంపాదింపబడిన వారివంశవృక్షము చేనీగ్రంథకర్త ఇప్పటికి కొంచమించుగ రెండువందల వత్సరములకు పూర్వముండినట్లును వీరు తమకాలమునసే వేదాద్రినుండి తునికివచ్చినట్లును తెలియుచున్నది. శ్రీ వేంకటాచార్యుల వారి కాలమునుగురించి శ్రీవీరేశలింగము పంతులుగారు రిరువది వత్సరములకు పూర్వము నూరువత్సరములలోని వారు అని వ్రాసియుండుటచేతను ప్రకృతము వీరివంశజులు దాదాపు యిన్నూరువత్సరముల కాలమునాటివారని వ్రాయుట చేతను చూడ వీరికాలమున కొన్నివత్సరముల వ్యత్యాస మేర్పడుచున్నది. వీరి పరంపరలోజేరిన నాలవతరమువారు ప్రకృతము కొందరు తునియాస్థానవైద్యులుగను విద్వాంసులుగను ఉండియున్నారు. మరియు వీరి ప్రపౌత్రులొకరు రాజమంద్రిజిల్లా న్యాయస్థానమున నుద్యోగిగనున్నారు. ఈపరంపరను బట్టి చూడ శ్రీ వేంకటాచార్యస్వామివారు దాదాపు నూటయేబది వత్సరములకు ముందుగను యిన్నూరువత్సరములకు లోపుగనునుండిన విద్వద్వైద్యుడని దెలియుచున్నది. ఈగ్రన్థమున " వేదశైలరమానాథు పాదారవిన్దముల్ ప్రణుతి జేసి " యని ఇష్టదేవతాప్రార్థనమున జెప్పియుండుటయును ఆశ్వాసాన్తమున " లక్ష్మీనృసింహ ప్రసాదలబ్ధ" యనుటయును వేదాద్రినుండి వచ్చినవారగుటను ధృవపరచుచున్నవి. ఈగ్రన్థకర్త తనకాలముననే కవిగనో వైద్యుడుగనో లేక కవివైద్యుడుగనో తునిసంస్థానమునందలి యాస్థానమున ప్రవేశింప వేదాద్రి నుండి తునికి వచ్చియుండును. వీరివంశజులు ఇప్పుడును గోదావరిమండలమున నచ్చటచ్చట నున్నారు. ఈవిషయమును ఇందలి 34 పుటయందు దగుపరుప బడిన వారివంశవృక్షమువలన తెలియవచ్చును.

## శైలి.

ఈగ్రన్థము చదువువారలకు విషయము సుగ్రాహ్యముగనుండునట్లు నాతికఠినమగుశైలిని వ్రాయబడినది. పద్యరచనమ్ముదుళమై మనోహరమై యుండును. విషయవిభాగమును సొంపుగనే యున్నది. శాస్త్రీయవిషయములను ఛన్దోబద్ధముగ గ్రన్థములయందు వ్రాయువారికి అనివార్యముగ కలుగు ఛన్దోవ్యాకరణములయందలి దోషములు కొన్ని యీగ్రన్థమునను కానవచ్చు

చున్నవి. లేఖక పరంపరలయొక్క ప్రమాదమువలన మనపూర్వుల గ్రన్థముల యందు అనేకదోషములు కానవచ్చుచుండును. అవియన్నియు గ్రన్థకర్తల కంటగట్టుట న్యాయము గాదు. ఈగ్రన్థపు ప్రతులయందును అట్టి వనేకములు కలిగియుండినవి.

## స్వాతన్త్ర్యము.

గ్రన్థకర్త గ్రన్థరచనయందు చాలవరకు సంస్కృతమూలమును విడనాడకయే వ్రాసెను. కాలమునుబట్టియు అనుభవమునుబట్టియు కలుగుమార్పులను ఆయాచోటులయందు కనుపరచెను. అట్లు చూపబడిన స్వతన్త్రములును విశేషములును అగువిషయములు వ్యాఖ్యానమున నచ్చటచ్చట చూపబడినవి. వానినుండి కొన్నిటి నిచ్చట నుదాహరణమునకై చూపెదను.

ప్రథమాశ్వాసమున :—

(1) సంస్కృత రసప్రదీపికయందు సామాన్యముగ దేవతా నమస్కృతింజేసి రసోత్పత్తి నుపక్రమించియుండ ప్రాక్తనాన్ధ్రకవి సమయసిద్ధములగు ప్రబన్ధలక్షణములిందు సిద్ధించుటకు కాబోలును! ఈగ్రన్థము అగస్త్యాత్రేయసంవాదరూపంబుగ జెప్పబడినది. అందును అశ్వినులు ధన్వన్తరికి జెప్పిన తెరంగున నగస్త్యు లాత్రేయున కుపదేశించిరనియు నదియ యీ గ్రన్థరూపమనియు చూపబడినది.

మరియు రసోత్పత్తిని గురించి చెప్పునపుడు పార్వతీ పరమేశ్వరుల క్రీడకు కారణముగ నుండుటకై తారక యుద్ధయాత్రనుకూర్చి యధికముగ వ్రాయబడియున్నది.

(2) రసతన్త్రములయందును వాని ననుసరించిన సంస్కృతమూలమునందును పారద సూతమిశ్రకములు మూడును లభ్యములనియు రసరసేన్ద్రములలభ్యములనియు వ్రాయబడియున్నది. ఈగ్రన్థకర్త ప్రస్తుతకాలమునందలి స్థితి ననుసరించి మూలము నతిక్రమించి “పారదంబొకటియే సులభంబుగాని సూత మిశ్రకములరెండు నూతులిపుడు కానరావు” అని 1-ఆ. 23-పద్యమున స్పష్టముగ వ్రాసియున్నాడు.

(3) మూలమున రసమునకు అష్టాదశసంస్కారములును సప్రయోజన ములని చెప్పియుండ నీగ్రన్థమున వాదమున కుపయోజ్యములగు జారణాదికము లగు సంస్కారములను విడచి దీపనాన్త సంస్కారములను నిరూపించి "కడమశుద్ధులమేలు శ్రీకణ్ఠుఁడెఱుఁగు" నని ప్రకృతకాలమున నవి యుపయోగము లేకుండుటను చూపెను.

(4) మూలమున చెప్పబడక మిగుల నుపయుక్తములై యవశ్యజ్ఞాతవ్యములగు రసభక్షణకాలమందలి యపథ్యదోషముచే గలుగు వ్యాధులను తన్నివారణోపాయములను ప్రథమాశ్వాసాన్తమున మూఁడు పద్యములయందు మిగుల నిపుణముగ నిరూపించెను.

ద్వితీయాశ్వాసమున :—

అభ్రికశోధనమున స్వానుభవ సిద్ధాన్తితమగు గంగరావాకు స్వమూత్రము మేకనెత్తురు మొదలగు ద్రవ్యములచే సంస్కారమును ఎనిమిదవ పద్యమున మూలమున లేకపోయినను చెప్పెను. ఇట్లే ఇరువదిమూఁడవ పద్యమున మూలమున చెప్పబడక గంధకశోధనమునకు అనుభవ సిద్ధములుగ నేర్పడియుండు ద్రవ్యములను నిరూపించెను. ఆనన్దకన్దాది ప్రాచీనగ్రన్థములయందు అహిఫేనశబ్దమును సర్పవిషాదివాచకముగ ప్రయోగించియుండ నీయన తన గ్రన్థమున నల్లమందునకు వాచకముగ వ్రాసి స్పష్టపరచెను.

మూఁడవయాశ్వాసమున :—

పగడమునకు సహదేవిచే శుద్ధిని స్వానుభవసిద్ధమగు దానిని చెప్పెను. మరియు సువర్ణప్రక్రియలయందు ఇరువదిమూఁడవ పద్యమున మూలమున సువర్ణభస్మయోగముగ చెప్పబడియుండు దానిని స్వానుభవజన్య నిశ్చితజ్ఞానముచే కాబోలును సిన్దూరకరణయోగముగమార్చి చెప్పియున్నారు. మూలమున రసమున కొకటియు మహారసోపరస సాధారణరసములకొకటియు రత్నములకొకటియు లోహముల కొకటియునని నాలుగధ్యాయములుగ గ్రన్థమును విభజించి విషయముల వివరించియుండ నీగ్రన్థకర్త రత్నలోహముల నొకయాశ్వాసము

వనే వివరించి మొత్తము మూడాశ్వాసములయందు గ్రన్థము నిమిడ్చెను. ఇట్టి వనేక విశేషములు అచ్చటచ్చట కనుబడుచున్నవి. వానిని పాఠకులు గమనించి చూచెదరుగాక.

## వ్యాఖ్యానము.

మా గ్రన్థమాలయందు సంస్కృతము దెలియని యాన్ధ్రవిద్యార్థులకును వైద్యులకును నుపయుక్తముగ నుండులాగున రసతన్త్రవిషయములను బోధించు గ్రన్థము నొకదానిని ప్రచురించవలయునని తలచుచుంటిని. అట్టితరుణమునఆన్ధ్రకవి వైద్యశిఖామణిచే నింతకుపూర్వమే పద్యరూపమునవ్రాయబడియుండు నీ గ్రన్థము స్మృతిపథమునందెను. పిమ్మట సంస్కృతమున వ్రాయబడియుండు రస గ్రన్థములను పరివర్తనము చేయుటకంటె నింతకుపూర్వమే ప్రాచీనులచే సంగ్రహముగజేసి పరివర్తనరూపముగ వ్రాయబడి పద్యాత్మకమైయుండు నీగ్రన్థమునకు విపులముగు వ్యాఖ్యానము వ్రాయుట యుత్తమమనియు అట్లు చేయుటచే విద్యార్థులకును వైద్యులకును మిగుల నుపయుక్తముగ నుండుటయేగాక పూర్వుల గ్రన్థములు ప్రచారమునకు వచ్చుటకుగూడ నవకాశము కలుగుననియు మనస్సున నూహయొండు పొడసూపెను.

పిమ్మట నాయుద్యమమునకుంగడంగి సంప్రదాయసిద్ధములగు విషయములను తెలుపుచు సంగ్రహముగ చూపబడిన వానిని వివరించిచెప్పుచు అనుక్తములగు నావశ్యక విషయములను పొందుపరచుచు నాయోపినకొలదిగ నీ వ్యాఖ్యానమును ప్రకృతము ముద్రితములుగను అముద్రితములుగను నుండు రసార్ణవము ఆనన్దకన్దము శివతత్త్వరత్నాకరము మొదలగు ననేక రసతన్త్రములను ప్రమాణములుగ గైకొని వ్రాసితిని ఇందు వైద్యులకును వైద్య విద్యార్థులకును నుపయుక్తములగు విషయములనేకములు వ్రాయబడినవి. నా యనుభవమువలన కార్యకారులుగ నిశ్చితములైన యోగములనుగూడ నీవ్యాఖ్యయందు పొందుపరచినచో పాఠకుల కుపకారకములుగ నుండునని తలచి గ్రన్థాన్తరములయందులేని యట్టివిషయముల నాయాచోటులయందు (♦) గుర్తుతో చూపుచు వ్యాఖ్యయందు చేర్చితిని. పైజెప్పబడినయట్లు నీగ్రన్థపుప్రతులు

లేఖక పరంపరాగతములగు ననేక దోషములతో నిండియుండినవి. ఇందు చూపబడిన తెరంగున కొన్ని ప్రతులను సంపాదించి సరిచేసి పొరబాటులను శక్తికొలది సవరించి విషయమునుఁకూర్చి వ్యాఖ్యతో నీగ్రన్థమును ప్రచురించితిని. రససంప్రదాయములయందు పరంపరగ వ్రాయబడుచుండునవియేయైనను రసోత్పత్తి రసాహరణము గన్ధకోత్పత్తి అనునివి మొదలుగాగల కొన్ని విషయములు చూచుటకు అశ్లీలములుగను వైద్యులకు అనుపయుక్తములుగను నుండుటచే నాభాగములను విడచితిని.

ఈగ్రన్థమును రచించిన శ్రీమాన్ ముడుంబ - వేఙ్కటాచార్యస్వామి వారి వంశావళిని విపులముగ దెలిపిన అస్మత్ప్రియమిత్రులును, నుభయభాషా ధురీణులును, ప్రకృతము తునిసంస్థాన మన్త్రివర్యులునగు శ్రీమాన్ బోడపాటి - రాజన్న పంతులు, బి. ఏ, గారికి ననేకవందనముల జేయుచున్నాడ.

పాఠకమహాశయులకు మిక్కిలి యుపయోగమని తలచి ఈగ్రన్థమున నుదహరించిన ధాతులోహాదులను వానిప్రక్రియలను బోధించు పారిభాషిక పదములను సరియగు ఇంగ్లీషుపదములను సాధ్యమైనంతవరకు వ్రాసినాడను. ఇందు ఏష్యాటిక్ సొసైటివారిచే ముద్రించిన రసార్ణవమును డాక్టర్ పి. సి. రాయిగారి హిందు కెమిష్ట్రియును జాలవరకు నాకు సహాయకారులాయెను. కాబట్టి వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

ఈగ్రన్థముద్రణమున మచిలీబందర్ వాస్తవ్యులగు శ్రీమాన్. అగ్నిహోత్రం అప్పలాచార్యులవారును ఆన్ధ్రసాహిత్య పరిషత్తువారును వారివద్దగల పుస్తకములునిచ్చి తోడ్పడినందుకు మిగుల కృతజ్ఞుడను.

25-2-16
ఆయుర్వేదాశ్రమం,
55. ఆచారప్పన్ వీధి.

పండిత డి. గోపాలాచార్లు,

# వంశవృక్షమును చూపు పటము.



శ్రీ

# విషయానుక్రమణిక.

---

## ఈ గ్రన్థమున పాఠాన్తరములదెలుపు ప్రతులకును వాని సంకేతములకును వివరణము.

(క) 1. చెన్నపురి ఆయుర్వేదకలాశాలా పుస్తకభాండాగారమందలి కాగితపుప్రతి.

(ఖ) 2. మచిలీబందరు నివాసులగు శ్రీమాన్ అగ్నిహోత్రం అప్పలాచార్యుల వారొసంగిన తాటాకులప్రతి.

(గ) 3. చెన్నపురియందలి ఆన్ధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమందలి తాటాకుప్రతులు మూడు.

(ఘ) 4. చెన్నపురి ఓరియంటల్ లైబ్రరియందలి తాటాకుప్రతులు మూడు.

# చెన్నపురి ఆయుర్వేదకలాశాల.

ఆయుర్వేదమును లక్ష్యలక్షణములతోడను పాశ్చాత్య వైద్యమందలి అనాటమీ ఫిజియాలజీ మొదలగు వానితోడను గరపబడును.

ఇందు "ఆయుర్వేదభూషణ" అను సంస్కృతశాఖయు "భిషగ్వర" అను ఆన్ధ్రశాఖయును రెండుశాఖలు గలవు.

సంస్కృతశాఖకు నాటకాంత సంస్కృతజ్ఞానము గలవారుగ నుండవలెను.

ఆన్ధ్రశాఖకు తెనుగున మంచి భాషాజ్ఞానము గలిగియుండవలెను.

విద్యార్థులు 16 వత్సరములకు తగ్గకను 24 వత్సరములకు మించనివారుగ నుండవలయును.

కలాశాలయందు జేరగోరువారు అక్టోబరుమాసాంతమునకు దరఖాస్తులను బంపుకొనవలెను.

వివరములు గోరువారు కలాశాలాధ్యక్షులకు వ్రాసిన దెలుసుకొనవచ్చును.

ఆయుర్వేదకలాశాల,
మదరాస్.

వైద్యరత్న పండిత. డి. గోపాలాచార్లు,
ఎ. వి. యస్., ఎ. యం. బి.
ప్రిన్సిపాల్.

శ్రీరస్తు.

రసప్రదీపికయందు జెప్పంబడిన లోహాదులకు

# తెనుగు ఇంగ్లీషు పేర్లు.

| | |
|---|---|
| అభ్రకము | Mica |
| అభ్రకసత్వము | Essence of Mica |
| అన్నభేది | Sulphate of Iron |
| అంజనములు | Collyriums |
| అగ్నిజారము | A sort of seagrown plant, also, a substance discharged from the womb of a kind of sea crocodile |
| అయసము | Iron |
| అద్రిజము | Bitumen |
| అర్క- | *Calotropis Gigantes* |
| ఇంగిలీకము | Cinnabar |
| ఇత్తడి | Brass |
| ఉపరసములు | Inferior or secondary minerals, or, metallic ores. |
| ఊర్ధ్వపాతనము | A sort of apparatus resembling Patana Yantra |
| కంకుష్టము | Cleome felena |
| కంపిల్లము | Rottlera Tinctoria |
| కంచు | Bell metal |
| కఫరి | Iron sulphate |
| కరవీరము | Nerium odorum |

| | |
|---|---|
| కనక (ఉమ్మెత్త) | Datura stromonium |
| కాంతము | Magnetic Iron |
| కాంస్యము | Bell metal |
| కాసీసము | Sulphate of iron |
| కాంక్షి | Alum |
| కిట్టము | Rust of Iron |
| కృష్ణలోహము | Iron |
| కృష్ణాభ్రకము | Black mica |
| గంధకము | Sulphur |
| గవ్వ | Cowrie, or, Marine shell |
| గరుడపచ్చ | Emerald |
| గరుడోద్గారము | Derived from the vomit of Garuda |
| గిరిసింధూరం | Vermillion derived from rocks |
| గైరికము | Red ochre |
| గుగ్గులు | Balsamodendron mukul |
| గోమేదకము | Agate |
| చపలము | A sort of maharasa |
| చంద్రకాంతము | Moon stone |
| జసదము | Zinc |
| తగరము | Tin |
| తాళకము | Orpiment |
| తిర్యక్పాతనము | An apparatus called dipika which occupies the place of Tiryakpatana yantra |
| తీక్ష్ణము | Cast iron (steel) |
| దరదము | Cinnabar |

| | |
|---|---|
| ద్రుతి | Liquification |
| ధాతువులు | Red orche |
| ధాన్యాభ్రకము | A preparation of mica with sali rice |
| ధూపయంత్రము | Fumigating apparatus |
| నల్లమందు | Opium (Papaver sowniferun) |
| నవసారము | Sal ammonia |
| నియమనము | Restraining of mercury |
| నీలము (నీలరత్నము) | Saphire |
| నేపాళములు | Croton tiglium |
| పగడము | Coral |
| పద్మరాగము | Ruby |
| పాషాణము | Cohite oxide of arsenic |
| పారదము | Mercury |
| పాతనయంత్రము | Apparatus for sublimation and distillation |
| పుష్పరాగము | Topaz |
| పూతిలోహము | Metal emitting foetid matter |
| భస్మము | Ash or caln |
| మలము | Impurities of mercury |
| మణిశిల | Realgar |
| మహారత్నము (నవరత్నము) | Precious gems such as Pearl, Diamond, etc. |
| మర్దనము | Rubbing, grinding, pounding |
| మరకతము | Emerald |
| మండూరము | Dross iron |
| మనశ్శిల | Realgar |
| మహారసములు | Superior minerals |

| | |
|---|---|
| మాణిక్యము | Ruby |
| మాక్షికము | Copper phyrites |
| మిశ్రకము | Synonym of mercury |
| ముండము | Wrought iron |
| మూర్ఛనము (మూర్ఛితము) | One of the seven stages of mercury |
| మైలతుత్థము | Blue vitriol |
| మౌక్తికము (ముత్యము) | Pearl |
| యవక్షారము | Corbonate of Soda |
| రససంస్కారములు | Methods of purification of mercury |
| రసదోషములు | Impurities of mercury |
| రససింధూరము | Red ash of mercury, or, Ash |
| రసభస్మము | Calommel |
| రసబంధము | Fixation of mercury |
| రసకము | Calomine |
| రసాయనము | Definition of Rasa |
| రత్నము | Gem |
| రసపంకము | Mud of mercury |
| రసకర్పూరము | Calommel |
| రాగి | Copper |
| రాజావర్తము | An inferior kind of Diamond : also known as lapis lazulis |
| లవణయంత్రము | Saltbath |
| లాంగలి | *Gloriosa superba* |
| లోహములు | Metals |
| లోహము | Iron |

| | |
|---|---|
| లోణము | Saline deposits |
| వత్సనాభము | Conitum ferox (root of Indian aconite) |
| వజ్రము | Diamond |
| వంగము | Tin |
| వరాటకము | Cowrie, or, Marine shell |
| వల్మీకమృత్తిక | Earth from ant-hill |
| వజ్రాభ్రకము | Variety of mica |
| వాలుకాయంత్రము | Sandbath |
| విమలము | A sort of maharasam |
| విషముష్టిగింజలు | Nux vomica |
| విద్యాధరయంత్రము | Apparatus for extracting mercury from cinnabar |
| విజయ | Anacardium semi carpus |
| వృంతాకమూష | Vrintaka crucible (of the shape of brinjal) |
| వెలిగారము | Borax or Subborate of soda |
| వెండి | Silver |
| వైక్రాంతము | A precious stone inferior to diamond |
| వైడూర్యము | *Lapis Lazulis* |
| శిలాజితు | Bitumen |
| శుద్ధి | Purification |
| సత్వపాతము | Escence extracting |
| సాముద్రలవణము | Table salt |
| సద్యక్షారము | Corbonate of Potash |
| సస్యకము | Blue vitrol |
| సీసము (సీసకము) | Lead |

| | |
|---|---|
| సువర్చ్చలవణము | Saltpetre |
| సూతము | Mercury |
| సూర్యకాంతము | Sun stone |
| సౌరాష్ట్రి | Alum |
| సైంధలవణము | Rock salt |
| స్వర్ణము | Gold |
| స్వేదనము | Application of heat to any substance for inducing perspiration |
| హింగుళము | Cinnabar |
| హీరకము | Diamond |
| క్షారము | Alkali |



శ్రీరస్తు.

శ్రీమతేశ్రీనివాసాయనమః.

శ్రీధన్వన్తరయేనమః.

# రసప్రదీపిక.

"ప్రభ" యను

నాన్ధ్రివ్యాఖ్యానసహితము.

## ప్రథమాశ్వాసము.

### — ఇష్టదేవతా ప్రార్థనాదికము. —

సీ॥ శ్రీ లొసంగెడు వేదశైలరమానాథు
పాదారవిందముల్ ప్రణుతి జేసి ।
కూరేశ శ్రీభాష్యకార కురుకాధీశు
లను నాత్మనిష్ఠతో నభినుతించి ।
అశ్వినీదేవసమర్చన గావించి
ధన్వంతరి ప్రసాదంబువడసి ।
వాహటాదుల నెల్ల బ్రస్తుతి గావించి
కలశసంభవుని యంఘ్రులు దలంచి ।
యాదివైద్యుల కెల్ల జోహారు జేసి
మునుల నెల్లర బ్రార్థించి మ్రొక్కి తలచి ।
యాంజనేయుల బూజించి యాన్ధ్రభాష
గవిత జెప్పెద వైద్యయోగంబు లెల్ల॥ ౧॥

—॥ తాత్పర్య ప్రారంభము. ॥—

ఉ॥ శ్రీలసదక్షియుగ్మమున జిందులువారు సుధార్ద్రదృష్టులన్ ।
జాలగఁజిమ్మి లోకతతసంసృతిరోగభయంబుఁ బాపగా ।
మేలగుఁగృత్యముల్ నెరపి మించి జరించుచు సర్వలోకజా ।
లాలయుఁడైనయావిభు శ్రియఃపతి నెంచెద నిష్టసిద్ధికై ॥

సీ॥ రోగజాలమెల్ల లోకంబులం జేరి । మనుజకోటినార్చి మసఁగుచుండ ।
దానినుత్తరింప ధన్వంతరీరూపు । దైయెసంగె నెవ్వ డతని దలతు॥

క॥ చరకుని సుశ్రుతు నత్రిజు । వరగుణులౌ యాశ్వినేయవైద్యోత్తములన్ ।
వరుసన్ వాగ్భటు నన్యుల । సురుచిరవైద్యాబ్ధిమథనసురులం దలతున్ ॥

ఉ-మా॥ ఖ్యాతినిమించు దీవియను నన్వయమందున పూతతాలసద్ ।
గౌతమగోత్రయుక్తమున గౌరవమందిన కృష్ణమార్యుడన్ ।
భూతలదేవుపౌత్రకుఁడ పుణ్యచరిత్రకు రాజ్యలక్ష్మికిన్ ।
పూతుఁడు రామకృష్ణునకుఁ బుత్రుఁడ సద్విఖనోక్తసూత్రుడన్ ।
ఆతతకీర్తియౌ మహీశురాధిపకృష్ణ నరేంద్రునాస్థితిన్ ।
నేతయటంచుఁ బొండితిని. నిస్తులకీర్తగడించి సంస్కృతా ।
ద్యైత్పకలాలయాంగ భిషగీయవిభాగపు దేశికుండునై ।
వీతమలాగరాంబునిధిజాతుఁడునౌ యల పుట్టసామిసం ।
ప్రీతికిఁ బాత్రుఁడై వివిధరీతులనొప్పెడు వైద్యవార్ధిలో ।
లోతు నెరింగితిన్ సుజనలోలుపుడౌ మన జార్జి ఖండితా ।
రాతి ముదంబుతో నొసగ రక్తిఁ జెలంగితి "వైద్యరత్న" నా ।
నూతనమౌ బిరుంద మతిమోదమునందగ గంటి నిద్ధరన్ ॥

క॥ వంగంబుల గవిరాజులు । భంగంబింతయును లేని పరమప్రీతిన్ ।
సంగతిఁ జేసి "భిషఙ్మణి" । విం గమ్మని జెప్పిరెంతొ వేడ్కదలిర్పన్ ॥

మ॥ అటబొంబాయి సమీపదేశ బుధు లత్యంతోత్థ మోదంబునన్ ।
"ఢిటవౌరక్తిని వైద్యవిద్యజగతిన్ దీప్తిన్ జెలంగంగ జే ।

యుటచేనిన్ను దలంతు మెప్పుడును "నాయుర్వేదమార్తండ" యన్ ।
పటువౌ బేరున" నంచు నన్నుతుక సంపన్ముగ్ధగా జేసిరా॥

క॥ గోపాలాచార్యుండని । నూపార్జితకీర్తులందు సొంపొందెడు నే ।
నోపినకొలఁదిని బుద్ధిన్ । రూపించియెరింగినట్లు రూఢి దలిర్పన్॥

ఉ॥ ఆర్యులు సత్కవుల్ బొగడ నార్యకులుండు ముడింబి వేంకటా ।
చార్యులు దా రచించె భువి చాతురియొప్ప రసప్రదీపికన్ ।
ధైర్యముచే దెనుంగున సుధారస మొల్కఁగ దీని జూడ సం ।
చార్యమటంచు నెంచి సరసంబగు వ్యాఖ్యను జేయఁబూనితిన్॥

వ్యా॥ సకలశుభంబుల దయజేయంజాలియుండు వేదాద్రీశ్వరుండగు శ్రీలక్ష్మీనరసింహస్వామి పాదపద్మంబులకు నమస్కరించి స్వమతసిద్ధాన్తప్రవర్తకాచార్యులగు శ్రీకూరేశ్వరులు శ్రీమద్రామానుజులు శ్రీకురుకాధీశ్వరులు మున్నగు పూర్వాచార్యుల నాత్మనిష్ఠాపురస్సరంబుగ బొగడి వైద్యసంప్రదాయమునకుం జేరినవారిలో నుత్తములగు నశ్వినీదేవతలం బూజించి ధన్వంతరి యనుగ్రహంబును సంపాదించి బాహటుడు మొదలగు వైద్యసిద్ధాన్తప్రవర్తకులను స్తుతించి దాక్షిణాత్య వైద్యసంప్రదాయప్రవర్తకాచార్యులగు నగస్త్య మహర్షి పాదంబులందలంచి తక్కిన పురాతనవైద్యులనెల్లర దలంచి మునులను సిద్ధులను బ్రార్థించి నమస్కరించి స్మరించి శ్రీయాంజనేయస్వామికి నమస్కరించి వైద్యశాస్త్రమునకు సంబంధించిన రసతంత్రములలో జేరిన రసప్రదీపికయను సంస్కృత భాషామయమగు నీగ్రంథమును దేటదెల్లమగు నాన్ధ్ర భాషయందు పద్యరూపంబున జెప్పెదను.

### — గురువందనము. —

[1]క॥ ధరనాదిబ్రహ్మశోధక
బిరుదాంకుం డుదధిగాఢభీరుడు ఘనుడై ।

1. (ఖ) ప్రతియందుమాత్రమీపద్యముగలదు.

పరగిన మద్గురు భట్టరు
నరసింహాచార్యవర్యునే సేవింతున్॥ ౨॥

వ్యా॥ ఆదిబ్రహ్మశోధకయను బిరుదమును వహించినట్టియు సముద్రుని వంటి గాంభీర్యము కలిగినట్టియు నాకు గురువునగు శ్రీభట్టరు నరసింహాచార్యులవారిని సేవించెదను.

—॥ ప్రతిజ్ఞ. ॥—

క॥ శ్రీవత్సగోత్ర జనితుఁడ
శ్రీవైష్ణవపాదపద్మ సేవారతుఁడన్।
శ్రీవేంకటాభిధానుఁడ
శ్రీవెలయు ముడుంబ యనఁగ జెలగినవాఁడన్॥ 3॥

శా॥ శారీరంబు నిఘంటు ద్రవ్యగుణముల్ సంఖ్యానిదానంబుస।
త్సారంబైన రసప్రదీపికయు సూత్రస్థానముల్ ధాత్రిలో।
సారంబైన చికిత్ససంగ్రహము భైషజ్యంబు బాహాట మిం।
పారం జూచితి వేదశైలపతి పాదాబ్జంబులే ప్రాపుగన్॥

వ్యా॥ శ్రీవత్సగోత్రమున ముడుంబయను వంశంబున జననమునందినట్టియు భగవద్భక్తుల పాదపద్మముల సేవించుటయం దాసక్తికలిగినట్టియు వేంకటాచార్య లను పేరుగలిగిన నేను శ్రీవేదాద్రి లక్ష్మీనరసింహస్వామి యొక్క పాదంబులయందలి భక్తి ప్రభావంబున వైద్యగ్రంథములయందలి శారీరభాగమును, నిఘంటుభాగంబులును, ద్రవ్యముల గుణముల దెలుపు గ్రంథములును, రోగముల సంఖ్యయు, నిదానంబును, రసశాస్త్రములలో నుత్తమమగు రసప్రదీపికయు, హేతులక్షణ ఔషధస్కంధములను త్రిస్కంధములను ప్రధానంబగు సూత్రస్థానమును, చరకాది చికిత్సల సంగ్రహమును, భేషజకల్పమును, బాహటము మున్నగు వైద్యసంప్రదాయముల బోధించు గ్రంథంబులను ప్రీతితో చదివితిని.

గీ॥ తెలిసినట్లుగ సూతప్రదీపికకును
తెనుగు గావింతు సుజనులు వినుతి సేయ।
పారదోత్పత్తి పాషాణపఙ్క్తి సర్వ
రత్నలోహాదుల ప్రకారముల నెల్ల॥ ౪॥

వ్యా॥ అట్టినేను రసోత్పత్తి వానిభేదములు మొదలగు రసవిషయములు, పాషాణసమూహములు, (మహారసములు, ఉపరసములు, సాధారణరసములు), వజ్రాది రత్నములు స్వర్ణాది లోహములు మున్నగు వానినన్నిటిని ఆయాప్రకరణముల ననుసరించి వివరింపుచు సుజనులు పొగడునట్లు రసప్రదీపికను ఆంధ్రభాషకు పరివర్తనముచేసెద.

—॥ గ్రంథారంభము. ॥—

వ॥ అనుచు నీప్రకారంబున నశ్వినులు ధన్వంతరికి జెప్పిన తెరంగున నగస్త్యుం డాత్రేయున కిట్లనియె॥ ౫॥

వ్యా॥ సుగమము.

—॥ తారకాసురుని దండయాత్ర. ॥—

క॥ తారకదైత్యుడు బ్రహ్మను
గూరిచి తప మాచరించి కుటిలాత్ముండై।
ధారుణి నెవ్వరు నతని ని
వారింపం దరము గాని వరములు గొనియెన్॥ ౬॥

వ్యా॥ మున్ను తారకుడను రాక్షసుడొక్కడు బ్రహ్మనుగూర్చి గొప్ప తపస్సుల నాచరించి ప్రసన్నుండగు నాతనివలన భూమిపై నెవ్వరును తన ప్రచారమును నివారింప శక్తులు గాకుండునంతటి బలంబు గలుగునట్లు వరంబులం గొనియెను.

మ॥ ఒకనా డాగ్రహ మెత్తి దేవతలపై నోడింపదం డెత్తినం
ప్రకటంబైన బలంబుతో నెదిరి శుంభద్వేగుడై యింద్రుడా
జికి దానోర్వకపారె దిక్కులదరంజిత్తంబులో రోయుచున్
అకలంకస్థితి తారకుం డరిగె బాహాటోప మేపారగన్॥ ౭॥

వ్యా॥ ఇట్లు వరంబులంగొనిన యాతారకాసురుండు దేవతలపై యొకసారి యేదియో కారణంబున కోపంబుగదుర వారిని జయించుటకై శస్త్రయుద్ధంబునకు డీకొనియెను. ఇంద్రుండును ప్రసిద్ధంబగు తనబలంబుతో వానినెదుర్కొనియు యుద్ధంబున నిలువనోపక మనసున చాలగ విచారించుచు దిక్కులు చలించుచుండ యుద్ధంబుననుండి పరుగెత్తెను. తారకాసురుండును నిజప్రతాపంబు మెరయుచుండ జయంబునంది నిష్కళంకంబున నిజనివాసంబున కరిగెను.

## — ఇంద్రుని తపస్సు. —

ఉ॥ అంతట విష్ణుదేవు నియమాత్మకుడై మది గూర్చి యింద్రుడ
త్యంతమహాగ్రహా తపము నప్పుడ సేయగ వచ్చినీతపం
బింతట జాలు దైత్యు వధియింపగ రుద్రసుతుండు గాక నీ
వంతయణంప లేరుసురవర్గము దోడ్కొని పొమ్ము ప్రోలికిన్॥

వ్యా॥ ఇట్లు తారకాసురునిచే నవమానితుండైన యింద్రుడుచని విష్ణువును మనసుననిలిపి అతినియమంబున మిగులతీక్ష్ణమగు తపము నాచరింప విష్ణువు ప్రత్యక్షమై “ఓయింద్రుడా! వరబలగర్వితుడగు నాయసురుని బరిమార్ప నీవును ఇతరులును సమర్థులు కాజాలరు. ఆకృత్యంబును నెరవేర్ప రుద్రపుత్రు డొక్కరుడే సమర్థుడగును. తన్నివర్తనమునకై రుద్రపుత్రు డావిర్భవింపగలడు. కావున దేవతలం దోడుకొని పురంబున కరుగు” మని యానతిచ్చి యంతర్హితుం డయ్యె.

— షణ్ముఖోత్పత్తి. —

వ॥ తదనంతరంబున నింద్రప్రార్థితుండై కందర్పుండు తమి రేచిన
నప్పార్వతీపశుపతులు తపంబు జాలించి యప్పర్వతకందరం
బునందు॥ ౯॥

వ్యా॥ స్పష్టము.

... ... ... ...

వ్యా॥ పైఁజెప్పఁబడినరీతిగ పార్వతీపరమేశ్వరులు పరస్పరప్రేమచే క్రీడావినోదంబులపర్వతగుహాలయందు చిరకాలము నేకాంతముననుండుతరి తారకునిచే పీడితులగు నింద్రాదిదేవతలు షణ్ముఖోత్పత్తికై తీవరపడి వారి క్రీడాభంగ మొనరింప నద్దేవదేవుండు తనవీర్యమును గంగలో విడచెననియు, అయ్యది తరంగప్రేరితమై యొడ్డున జేరి పదునొకండు తునియలైనవనియు, మహేశవీర్య మమోఘప్రభావ మగుటం జేసి యందారుతునియ లొకటియై దాన షణ్ముఖుండు జనించెననియు, తక్కిన యైదుభాగములును పారదోత్పత్తికిం బ్రధానకారణములైనవనియు పురాణములం బ్రసిద్ధమైనదియేకాక రసశాస్త్రప్రవర్తకులగు ప్రాచీనులు నట్టి పౌరాణికకథ నవలంబించియే తమతమగ్రంథముల విస్తరముగ వ్రాసియున్నారు. అట్టి పురాతనసంప్రదాయము ననుసరించియే ప్రకృతగ్రంథకారుడును రచించియున్నాడు. అట్టివివరమును దెల్పునట్టి పద్యములు లజ్జాకరంబులును అశ్లీలంబులు నగుటం జేసి పది మొదలు పదునారు వరకుంగల పద్యముల నిచ్చోట వదలి వానిభావముమాత్రము సూక్ష్మముగ జూపబడియె. పారదమునకు సర్వోత్కృష్టతను అతులప్రభావమును స్థాపించుటకై రసతన్త్రప్రవర్తకులు పైజెప్పిన గాథ నవలంబించినట్టులు దోచెడిని.

— పారదోత్పత్తి వానిభేదములు. —

గీ॥ ఐదు విధముల బిందువు లచట బరువు
చేత శతయోజనంబుల లోతుగలిగి ।

రస రసేంద్రంబు సూత పారదము మిశ్ర
కంబు లన నొప్పి పంచకరూపంబు లయ్యె॥ ౧౭॥

వ్యా॥ షణ్ముఖోత్పత్తికి కారణముకాగా మిగిలిన నైదుభాగంబులును దిగువ పడునప్పటి వేగంబుచేతను నతిభారముచేతను భూమియందు చాలలోతు నకు దిగిపోయెను. అట్లు భూమియందణగిన యాతేజోభాగంబులే క్షేత్రభేదంబుచే రూపంబులును గుణంబులును మారి రసమనియు, రసేంద్రమనియు, సూతమనియు, పారదమనియు, మిశ్రకమనియు నైదు తెరంగుల వ్యవహరింపబడుచున్నది.

—॥ రసభేదములు, వానిలక్షణములు. ॥—

సీ॥ రసము నిర్దోషమై రక్తవర్ణంబునై
యమృతస్వరూపమై యమరు దాని।
నజరులు సేవించి యమరత్వ మొందిరి
మరి రసేంద్రంబు శ్యామలము రూక్ష।
మతిచంచలంబు నై యమరు పన్నగు లెల్ల
సేవించి కాయసంసిద్ధి గనిరి।
పీతవర్ణత రూక్ష సూతంబునకు గల్గు
పాండువర్ణం బది పాదరసము।
సకలవర్ణంబు లలరు మిశ్రకమునందు
నిట్టి హారవీర్యమహిమంబు లెవ్వరేని।
గురు తెరంగిన నారోగ్యగరిమ జేయు
ఫలము లీడేర్చు సకలసంపద లొసంగు॥ ౧౮॥

వ్యా॥ అట్లయిదువిధంబులై యుండు పాదరసంబున రసము దోషము లేవియు లేనిదై యెఱ్ఱనిరంగుగలిగి యమృతతుల్యమైయుండును. దేవత లీరసంబును సేవించి మృతిలేనివారలైరి. రసేంద్రము నల్లనై రూక్షమై (జిడ్డు లేనిదై) మిగుల చలనము గలిగియుండును. పన్నగజాతులు రసేంద్రంబు నుపయోగించుకొనుటచే గాయసిద్ధి కలవారలైరి. సూతము పచ్చనిరంగును రూక్షగుణంబును కలదై యుండును. పారదము తెల్లగనుండును. మిశ్రకము నెమలిపురివలె నానావిధవర్ణంబులం గలిగియుండును. ఇట్లు మహామహిమ గలిగి యుండు రసస్వరూపంబు నెవ్వరేని గుర్తెరింగిన వారికి మంచియారోగ్యము గలుగును. కోరికలన్నియు నీడేరును, సమస్తభాగ్యములును కలుగును. ఇందు రస రసేంద్రంబులు ఎట్టిదోషంబులును లేక రసాయనం (రోగమును, ముదిమితనమును బోగొట్టునట్టిశక్తి) బులై యుండును.

పైజెప్పినవానిలో మిగులశ్రేష్ఠములగు రస రసేంద్రంబులు రెండునుగల కూపములను దేవతలును నాగులును రాళ్లు మట్టిపెళ్లలు మున్నగువానిచే పూడ్చిరని "దేవై ర్నాగైశ్చతౌ కూపౌ పూరితౌ మృద్భిరశ్మభిః । తదా ప్రభృతి లోకానాం తౌ జాతావతి దుర్లభౌ" అను నీసంస్కృతమూలముచే దెలియుచున్నది కాన నవి యిప్పుడు లభింపవు. మనకిప్పుడు దొరకునవి సూత పారద మిశ్రకంబులను మూడుజాతులలో చేరినవి. ఇవి కంచుక (సీసము, తగరము, మొదలగువానిచే కప్పియుండుట) చాంచల్యాది దోషంబులు గలిగియుండుటచే నట్లే యౌషధంబులయం దుపయోగించుటకు దగినవిగనుండవు. వీనికి శాస్త్రంబులయందు చెప్పబడిన తెరంగున సంస్కారంబులుచేసి దోషంబులంబోగొట్టి యౌషధంబులయం దుపయోగింపవలయును. అను నీమొదలగు విషయంబులు రసశాస్త్రంబుల వివరింపబడియున్నవి. వీని దోషంబులనుగురించియు సంస్కారంబులనుగురించియు ముందు వివరింపబడును.

క॥ అన విని యాత్రేయుం డి
ట్లనియె నగస్త్యునకు పులకితాంగుండగుచున్ ।

ఘనదుర్ఘటమగు సూతము
జనముల కేగతి ఘటించు జయ్యాన జెపుమీ॥ ౧౯॥

వ॥ అనవుడు.

వ్యా॥ ఇట్లగస్త్యుండు రసోత్పత్తినివివరింప నాత్రేయుం డచ్చెరువంది హర్షోత్సాహ పులకితగాత్రుండై మహామహిమవిశిష్టమై దుర్లభమైయుండు సూతము జనులకెట్లు లభించునని యడుగ నగస్త్యుం డిట్లనియె.

—॥ రసాహరణము. ॥—

సీ॥ మునినాథ యాకూపముల సమీపమునందు
దరద దేశం బాద్రు దాని జనులు।

... ... ... ... ...

వ్యా॥ పైజెప్పినరీతిగ పారద మణగియుండు కూపములైదునుగల ప్రదేశమును దరదదేశమని జనులు వచియింతురు. అచ్చటనుండు రసమును గ్రహించుటకై యొకయువతి యాబావుల తొంగిచూచి తోడనే వెనుకకు మరలిపోయినచో రసంబును నాయువతివెంట కొంతదూరముచని యామె లభించకుండుటంజేసి మరలి వెనుకకుం జనుననియు పురాణ కథగలదు. అట్టివిషయము దెలుపుపద్యము జనరంజకంబుగ నుండమిచే నీయెడజూపక సూచనామాత్రముగ దెలుపబడియె.

చ॥ ఇలరసమేగుదెంచి మగుడేగుచో గుంటలయందు జిక్కెనన్।
బలుమరు నాగవంగ కృతపాత్రలచే దగదీసి దేశవా।
సులుపదిలంబుసేయుదురు సూతమణంగినమృత్తికంతయున్।
దెలియగదెచ్చి పారదము దీతురు పాతనయన్త్రవిద్యచేన్॥

వ్యా॥ పిమ్మట నాపాదరసంబును కన్యక దనకు జిక్కకుండుటచే మరలివచ్చి కూపంబులంజేరును. అట్లు మరలివచ్చునపుడు పల్లపుప్రదేశంబులం

జిక్కిన రసమును ఆదేశస్థులు సీసపుపాత్రములచేతను తగరపుపాత్రములచేతను దీసి దాచియుంచెదరు. మరియు నాపల్లపుప్రదేశంబుల నిలిచియుండు రసంబున గొంతభూమిలో నింకును. అట్లు రస మింకియుండు మృత్తికను (ఇదియే దరదము-Wore) తీసితెచ్చి ఆవిద్యనెరింగినవారు పాతన యంత్రంబులం దునిచి రసంబును దీతురు.

పై విషయమునుండి మనప్రాచీన రసతంత్రజ్ఞులు మున్ముందు పాదరసముంగల గనులను దరదదేశముల గనుంగొనిరనియు నాగనులయందలి యెఱ్ఱగ బరువుగనుండు మట్టి (*దరదము - Wore) నుండి పాతనయంత్ర సాహాయ్యమున పాదరసంబును గ్రహించుచుండిరనియు తేటబడుచున్నది.

రసశాస్త్రములయందెల్ల రసాహరణప్రకారము నీవిధముగనే తచ్ఛాస్త్రకారులు జెప్పియున్నారు. మరియు నిక్కాలపు రసతంత్రజ్ఞులును నిదేవిధుల దెలిపియున్నారు.

— పాదరసమహిమ —

మ-కో॥ భూరితాపసవర్య నూతపు బుట్టు కంతయు నీకు నిం।
పార జెప్పితి పారదంపు ప్రభావము న్వినుము మగ్నిసం।
స్కారయుక్తిని భస్మమాటకు గాఢమూర్ఛ యటంచ్రుదా।
పారదానకు చావు లేదని బల్కె శంభుడు మున్ను గా॥

వ్యా॥ తాపసవరా? రసోత్పత్తిప్రకారంబంతయు నీకు జెప్పంబడియె. ఇంక రసమహిమ నెరింగింతు వినుము. రస మగ్నిసంస్కారవశంబున భస్మ

---

* దరదము అనగా నిక్కాలపువారు హాలండుదేశమున రసగంధకములచేర్చి వండబడిన ఇంగిలీకంబని వాడుదురుగాని యయ్యదిమాత్రము గాదు. కాని యీగ్రంథకర్త ముందుజూపు ప్రయోగములంబట్టి ప్రకృతము వాడుకలోనుండు యింగిలీకమునే గ్రహించినట్లు తోచెడిని.

మయ్యేనేని యద్దానిని రససంప్రదాయజ్ఞులు గాఢమూర్ఛయని వక్కాణింతురు. పారదంబున కెప్పటికిని మృతిలేదని యీశ్వరుడు స్వయముగా జెప్పియున్నాడు. కావున రసమున కెప్పటికిని మృతి గలుగబోదు.

అనగ పాదరసము అగ్ని సంయోగమైనతోడనే సూక్ష్మదృష్టికికూడ గోచరముగాక నెగిరిపోవు స్వభావముగలదనుట సర్వజనవిదితము. అట్టి పారదమును రసతంత్రజ్ఞులు విధులచే నగ్ని సహనమగునట్లు జేయుటయే గాఢమూర్ఛయనుటయు మృతిలేదనుటయు సిద్ధాంతముగ నెఱుంగునది.

—॥ సూతమిశ్రకములు. ॥—

గీ॥ పారదం బొకటియే సులభంబుగాని
సూతమిశ్రకముల రెండుసూతు లిపుడు ।
కానరావు తుషారంబు గప్పుకతన
నవని జనులకు బోవరా దచటి కెపుడు॥ ౨౩॥

వ్యా॥ సూత పారద మిశ్రకంబులను త్రివిధంబులగు రసములయందును పారదమొక్కటియే యిక్కాలంబున సులభముగా దొరకును. తక్కిన రెండును దుర్లభములు. అవియుండు కూపంబులు మంచుచే గప్పబడియుండుటచే నచ్చోటికిబోవ జనులకు శక్యముకాదు.

లేక పై పద్యమునకు ఆకూపములయందు గలరసము సూర్యతాపముచే తుషారరూపము (బాష్పరూపము)గ బరిణమించుటచే నయ్యవి దుర్లభములైనవని జెప్పినచో యుక్తియుక్తముగ నుండునని దోచెడిని. ఈవిషయము దీనికి మూలమగు సంస్కృతగ్రంథంబున గానరాదు. అన్యరసగ్రంథంబులయందును నగుపడలేదు.

ఇచ్చట పారదోత్పత్తినిగురించి ముఖ్యముగ నీక్రిందివిషయము గమనింపదగినది :—

ప్రకృతగ్రన్థమున "ఐదువిధములు........." అనునట్టి ౧౭-వ పద్యము వలన హరతేజస్సు ఐదురూపములయందు జేరియున్నదనియు నా యైదింటికిని గ్రమముగ రసము, రసేన్ద్రము, సూతము, పారదము, మిశ్రకము, లను పేరులు గలవనియు దెలియుచున్నది. వానిలక్షణముల దెల్పునట్టి "రసము నిర్దోషమై........." అనునట్టి ౧౮-వ పద్యముచేత రసరసేన్ద్రసూతపారద మిశ్రకములు వరుసగ రక్తశ్యామపీతపాణ్డుచిత్రవర్ణములు గల్గియుండుననియు దెలియుచున్నది. మఱియు "దేవై ర్నాగైశ్చ........." అనుదీని సంస్కృత మూలమునుబట్టి రసరసేన్ద్రరూపములు రెండును దొరకవని దృఢమగుచున్నదియేగాక "పారదంబొకటియే........." అను ౨౩-వ పద్యముచేత సూత మిశ్రకములుండు బావులు రెండునుగూడ మంచుచే నావరింపబడియుండుటం జేసి యవియు దొరకుటలేదనియు, పారదం బొకటిమాత్రము దొరకుననియు స్ఫుటమగుచున్నది.

ప్రకృతపాశ్చాత్యవైద్యసిద్ధాన్తములం దిలకించిచూడ రస మేకవిధ మనియు అయ్యది రూపాన్తరమునందక తెల్లనిరంగుకల్గియున్నచో ప్రశస్తంబగు ననియు నీలపీతరక్తాదికములగు రంగులుగల్గియుండునెడ నయ్యది గ్రాహ్యము కాదనియు దెలియుచున్నది.

మరియు ఆర్యమతపాశ్చాత్యమతములం బరికించి విమర్శింపంబూనినను అట్టి నీలరక్తపీతాది వర్ణవిశిష్టరసములు చిరకాలమునకుపూర్వమే దుర్లభము లగుటచే విమర్శింప గష్టముగనున్నది. అయినను ఆప్తవాక్యము ముఖ్యప్రమాణముగాన ఆర్యులు ఆదికాలమున నట్టి నీలరక్తాదివర్ణములంగూడిన రసములను వానిమహిమలతో గనుంగొనియే యుండవచ్చునని నమ్మవలెను. సృష్టిస్వభావమున ననేకములు ప్రళయకాలములయందు మార్పుదల నందుచుండుట సహజమైయుండుటంజేసి నీలరక్తవర్ణాది విశిష్టములగు పాదరసములుండు గనులుగూడ ప్రళయకాలమున మారియుండవచ్చునని యూహింపదగియున్నది. మన మెరింగినంతమట్టుకు సముద్రతీరములయందును నదీప్రాన్తములయందును ఇట్టి మార్పులు పెక్కులు గనబడుచుండుట యెల్లరకును దెలిసినవియేకదా!

చిరకాలము క్రిందటివరకును సూతమిశ్రకములను సంజ్ఞలుకల రసములు దొరకుచుండి యీగ్రన్థకర్త యాన్ధ్రమున బరివర్తన మొనరించు కాలమునకు నవియుకూడ దుర్లభములైనట్లులు ౨౩-వ పద్యమున "సూతమిశ్రకముల రెండు నూతు లిపుడు గానరావు" అను వాక్యముచే దేటబడుచున్నది.

పై విమర్శనుండి ప్రకృతము ఆర్యవైద్యకమతముననుకూడ "పారదమను" సంజ్ఞకలిగి పాతనయంత్రసహాయమున దరదమునుండి దీయంబడురసము ఒకటిమాత్రము లభ్యమని యీగ్రంథమునుండి స్పష్టమగుచున్నది. లభ్యమగు పాదరసమునకే రసము, రసేంద్రము, సూతము, మిశ్రమము అను పదములు పర్యాయములుగ నుపయోగించునట్లు దెలియవలెను.

—{ పంచవిధపూజ, దానిమహిమ. }—

* సీ॥ భక్షణంబును కరస్పర్శనంబును దాన
మును ధ్యానమును పరిపూజనంబు ।
లన పంచవిధము లై యమరు పారదపూజ
భక్షణంబును సర్వపాపహరము ।
స్పర్శనంబున ముక్తి సత్యంబుగా గల్గు
దానంబునను తులాదానఫలము ।
ధ్యానంబు బ్రహ్మహత్యాదుల నణగించు
పూజింప శివకోటిపూజఫలము ।
రసము రసమని బల్క సర్వాఘహరము
పచ్చిదియు శుద్ధియైనది బద్ధమైన ।

* ఇచ్చట ౨౪-వ పద్యము మొదలు జేసి ౨౭-వ పద్యమువరకుంగల పద్యములు నాల్గును చికిత్సోపయుక్తములుగావు కావున స్పష్టార్థములని యివ్యెడ వ్యాఖ్యానము జేయబడవు. అందు ౨౪-వ సీస గీత పాదములయందు శుద్ధము

యదియు శివ బ్రహ్మ హరిరూప మనుచు తార్క్షి
మునులు జెప్పిరి యాత్రేయ మునివరేణ్య॥ ౨౮॥

గీ॥ హరుని తేజస్స్వరూపమై యమృత మైన
పారదము నింద జేసిన వారు బ్రహ్మ।
కల్పశతములు బహునరకములయందు
మునుగుచుందురు[1] ఆత్రేయమునివరేణ్య॥ ౨౯॥

సుగంధి॥ అనయ మిట్టి పారదామృతంబు నర్థితోడ భూ।
జనులు సేవ జేసి[2] మేలు కాయసిద్ధిగల్గి యే।
వనట లేక మృత్యుచే నవార్యసత్వ సంపదల్।
ఘనత గల్గి యుండి రెల్లకాలముః మహాద్ధతిః॥

గాని రసము శివస్వరూపమనియు, శుద్ధమైనది బ్రహ్మస్వరూపమనియు, బద్ధమైనది విష్ణుస్వరూపమనియు జెప్పబడియున్నది. ఈ విభాగనియమమును యోజించిచూడ శుద్ధము గాని పాదరసము దోషభూయిష్ఠంబగుటం జేసి ప్రాణహరం బగునుగాన ప్రలయకాలమున ప్రపంచము లన్నిటిని తనయందు లయింపంజేసికొని యొక్కడే విజ్ఞానచైతన్యమాత్రముగ నిలచియుండు శివునితో సమానముగ నిరూపింపబడినదనియు; శుద్ధమగు సూతము వ్యాధిపీడితులకు నిఖిలరోగముల నివర్తింపంజేసి యారోగ్యమునకు హేతుభూతమై ప్రజావృద్ధికి కారణమగుటవలన జగత్సృష్టికి కారణభూతుడగు బ్రహ్మకు బోల్పబడినదనియు; బద్ధమైనరసము రాసాయనిక యోగములయం దుపయుక్తమై జరామరణరాహిత్యమును గల్గించి అపరిమితాయువును వృద్ధినందించి ప్రాణిజాలముల కాపాడును కావున సృజింపబడిన చరాచరప్రపంచమునెల్ల కాపాడునట్టి విష్ణుదేవునితో సమానమగుననియు సృష్టిస్థితిసంహారములకు కారణభూతు

(ఖ) 1. తుదిమొనగనగలేక. 2. తాము.

శా॥ ఆరీతిం బ్రిదశత్వ మొందిజను లత్యానంద మొందర్ సునా।
సీరుం డాత్మ నెఱింగి భీతి గదురర్ శ్రీకంఠు డా వేడినర్।
తోరంబై నెలకొన్న ద్వాదశమహాదోషంబు లందుంచెనే।
పారర్ వాని నెఱుంగ జెప్పెద మహాత్మా వేరువేరందగర్॥

—॥ రసదోషములు. ॥—

సీ॥ మల మగ్నిగరళచాపలగౌరవాఖ్యదో
షము లన నైదు నైసర్గికములు।
సలిలభూశైలదోషంబులు మూడును
నాగ వంగములందు నాల్గుబుట్టు।
అమరగా నీ యేడు నౌపాధికంబులై
సప్తకంచుక లను సంజ్ఞనందు।
నిలనుద్వాదశ దోషములు పారదమునందు
ప్రబలంబులై యుండు భవ్యచరిత।
వాని శుద్ధులు పేళ్ళును వాని దోష
జాలములు నీకు వే. ర్వేర జెప్పె దింక।
వినుము శంకరు మదిలోన వినుతి జేసి
యశ్వినులు మున్ను జెప్పిన యట్టితెరగు॥ ౨౮॥

---

లగు నవనాదిమూర్తిత్రయమును దృష్టాంతముగజూపి పారదమునకు నిరతిశయ ప్రభావమును జూపినట్లూహింపదగియున్నది. ఈపద్యములనుండి ముఖ్యముగ నేర్పడునది యేమనిన రసము శుద్ధిచేసినగాని చికిత్సాది సామాన్యమున నుప యోగింపగూడదని స్పష్టమగుచున్నది.

వ్యా॥ మలము (మాలిన్యము) అగ్ని (ఉష్ణవీర్యము లేక సంతాపజనకము) విషము (ప్రాణహారకశక్తి) చాపల్యము (చంచలగుణము) గౌరవము (అతిభారము) అనునీయైదును రసంబునకు స్వభావమువలననే యేర్పడియుండు దోషములు. మరియు జలదోషము (నీటియందుగల దోషవ్యాప్తి), భూదోషము (భూమియందలిగల సమస్తదోషములవ్యాప్తి), గిరిదోషము (పర్వతము నందలిదోషములు), అనునవి మూడును; నాగము, వంగము, నను లోహంబుల సంబంధంబులగు (తగరముయొక్కయు సీసముయొక్కయు పాత్రలయందుంచుటచే గల్గు) నాలుగువిధముల దోషములును నీయేడును కంచుకములను పేరుననొప్పుచు నాయాపదార్థములయొక్క సంసర్గమువలన రసమున కేర్పడు దోషములు. ఇట్లే పండ్రెండువిధములగు దోషంబులును రసంబునావరించియుండును. అట్టివానియొక్క పేరులును, వానిశుద్ధులును, వానివలన గలుగు దోషంబులును అశ్వినులు జెప్పినతెరంగున నీకెరింగించెద.

ఈ పారదదోషంబు లాయాగ్రంథములయం దనేకవిధంబుల జెప్పబడియున్నవి. అందు రసార్ణవమున—“ ధూమః చిటిచిటి శ్చైవ మండూకప్లుతిరేవచ । అకంపశ్చ వికంపశ్చ పఞ్చావస్థా రసస్యతు ” అని యైదువిధములగు నవస్థలును; “ పారదస్య త్రయో దోషా విషం వహ్నిర్మల స్తథా ” అని మూడుదోషంబులును చెప్పబడియున్నవి.

రసరత్నసముచ్చయమున—“విషం వహ్ని ర్మల శ్చేతి దోషా నైసర్గికా స్త్రయః । రసే మరణ సంతాప మూర్ఛానాం హేతవః క్రమాత్ ” అని మూడునైసర్గికదోషంబులును, “ యౌగికౌ నాగవంగౌ ద్వౌ తౌ జాడ్యాధ్మానకుష్ఠదౌ ” అని రెండుయౌగికదోషంబులును, “ ఔపాధికాః పున శ్చాన్యే కీర్తితా స్సప్తకంచుకాః । భూమిజా గిరిజా వార్జా ద్వే చ ద్వే నాగవఙ్గజే । ద్వాద శైతే రసే దోషాః ప్రోక్తా రసవిశారదైః॥ ” అని యేడు ఔపాధికదోషంబులును కూడి పండ్రెండుదోషంబులును; “ పర్పటీ పాటలీ

భేదీ ద్రావీ మలకరీ తథా । అంధకారీ తథా ధ్వాంక్షీ విజ్ఞేయా స్సప్తకంచుకాః॥ " అని యేడు కంచుకదోషంబులును కనుపరచబడినవి.

రసేంద్రభాస్కరమున—" నాగో వఙ్గో ఽసహ్యాత్తాభో మలం చ శోచ్యః శేశే చంచలత్వం విషం చ । ఏతే దోషాః సప్త మోయం గిరి శ్చ వైద్యై స్సమ్య గ్వర్జనీయాః ప్రయత్నాత్।" నాగము, వంగము, అసహ్యాత, మలము, చాంచల్యము, విషము, గిరిజము, యని యేడు దోషంబులును; " పర్పటీ పాటలీ భేదీ ద్రావీ మలకరీ తథా। అంధకారీ తథా ధ్వాంక్షీ విజ్ఞేయా స్సప్తకంచుకాః॥" అను నేడుకంచుకంబులును నిరూపింపబడినవి.

శివతత్వరత్నాకరమున—" పార్థివ శ్చ తథై వాప్యః ఆగ్నేయ శ్చానిల స్తథా । నాభసో గజచర్మాఖ్యః నారంగో రక్తబిందుకః॥ అసహ్యోఽగ్నిశ్చమణ్డూకో మలా నైసర్గికాః స్మృతాః" అని పది నైసర్గికదోషంబులును; " కాళికా మలినీ చైవ కపోతీ రక్తికా తథా । అలోమీ గిరిజా చైవ పింగళీ సప్తకంచుకాః॥" అని యేడు కంచుకదోషంబులును; " విషం నాగ శ్చ వంగ శ్చ యౌగికాస్తు త్రయః స్మృతాః" అని మూడుయౌగిక దోషంబులును వివరింపబడినవి. ఈగ్రంథంబున పదినైసర్గికదోషంబులును ఏడుకంచుకదోషంబులును మూడుయౌగికదోషంబులును మొత్తమునం దిరువది దోషంబులు చూపబడియున్నవి. ఇట్లే రసగ్రన్థములయం దీవిషయమున పరస్పరభేదము లగుపడుచున్నవి.

రసము సహజముగ గనులయందుత్పత్తి యగుటచేతను అందు అనేక విధ లోహములు సంక్రమించుటచేతను మలినమగు జలంబును అనేకవిధములగు విషవస్తువులును గనులయందుండుటచేతను ఘనీభూతముగ నెఱ్ఱనిరంగుగలిగి మట్టివలెనుండు దరదము (Wore) అనుపేరుగల దీనియందు పాదరసము సహజముగ లోహసామాన్యమును గ్రహించుశక్తి గలదగుటచేతను పైజెప్పిన యనేక దోషములు కూడియుండుట సహజము. చిరకాలమునకుపూర్వముననె నార్యులు రసమందుగల దోషములను పలుదెరంగులం గనుగొని వానిని సహజ ఆశ్రయ ఔపాధికములను మూడువిధములగు విభజనజేసియుండినటుల దెలిసెడిని,

—॥ దోషంబులచే గలుగు వ్యాధులు. ॥—

క॥ మలదోషముచే నుదరం
బలవడు మూర్ఛయును[1]బుట్టు నంటుగుణంబున్ ।
బలవేగము లరికట్టును
బలిమిగ దాహంబు గుష్టు బలముగ జేయున్॥ ౨౯॥

వ్యా॥ రసమునందలి మలదోషము నివృత్తము కాదేని యట్టిరసంబును సేవించువారలకు జలోదరంబును మూర్ఛయు గలుగును. అగ్నిదోషయుక్తముగురసంబును సేవించిన బలమును మలమూత్రాదివేగములను నిరోధించును. తాపమునుగలుగ జేయును. కుష్ఠరోగమును గలిగించును.

సీ॥ విషదోషమున మూర్ఛ వెస మృత్యువును జేయు
వడి గురుత్వము మందవహ్ని జేయు ।
చాపల్య దోషంబు చెనటి కుష్టువు జేయు
పుట్టించు కుష్టువు భూమిజంబు।
శైలదోషం బది జాడ్య మొనరగ జేయు
వాతపైత్యము జేయు వారిజంబు ।
వడిగల యీ నాగవంగదోషంబులు
గలగండగుల్మరోగముల జేయు ।
గాన నష్టాదశాఖ్యసంస్కారములు మ
హేశు డొనరించె మున్ను రసేంద్రమునకు ।
ఫలము లెన్నైన శుద్ధుల పారదమును
జేర్పవచ్చును నవటాకు జేర్పరాదు॥ 30॥

1. (ఖ) నగ్ని వాంతిగుణం.

వ్యా॥ రసంబునందలి విషదోషము మూర్ఛను మృత్యువును గలుగజేయు ను. గురుత్వదోష మగ్నిమాంద్యమును జేయును. చంచలదోషము దుష్టమగు కుష్ఠరోగంబు నాపాదించును. భూమిదోషము కుష్ఠమును చేయును. గిరిజదోషము జడత్వమును కలిగించును. జలదోషము వాతపిత్తరోగములను కలుగజేయును. నాగవంగదోషంబులు గలగండరోగమును గుల్మరోగమును కలుగంజేయును. కావున నిట్టిదోషంబులు లేక రసం బమృతరూపంబునందుట కష్టాదశసంస్కారములు పరమేశునిచే నేర్పరుపబడినవి. రసంబు నొకపలముమొదలు ఎన్ని పలములనైనఁజేర్చి శోధనసంస్కారంబులఁ జేయవచ్చును కాని సంస్కారణము కొరకు గ్రహింపబడు రసము ఒకపలమునకన్న నల్పపరిమాణయుక్తముగ నుండరాదు.

ఇచ్చట శోధనసంస్కారములకై గ్రహింపబడు రసపరిమాణవిషయమై దీనికి మూలమగు సంస్కృతమున నింతకన్న విశదముగ వ్యవస్థ యేర్పరుపబడినది. ఎట్లన:—“ ద్వే సహస్రే పలానాంతు సహస్రం శతమేవ వా। అష్టావింశత్పలాన్యేవ దశ పంచైకమేవవా। పలార్థేనైవ సంస్కారః కర్తవ్యస్సూతకస్య చ” అనియున్నది. మరియు రసరత్నసముచ్చయమునందును ఇదియే అనుపూర్వి చెప్పబడినది. ఈగ్రంథముచేత రసమును శోధనాదిసంస్కారముల జేయుటకై గ్రహించునపుడు అయ్యది రెండువేల పలములైనను లేక వేయి పలములైనను లేక నూరుపలములైనను లేక ఇరువదియెనిమిది పలములైనను లేక పది పలములైనను లేక అయిదుపలములైనను లేక ఒకపలమైనను తుదకు అర్ధపలమైనను పరిమాణము గల్గియుండవలెనుగాని అంతకు తక్కువగ జేర్పదగదని యేర్పడుచున్నది.

అనగా రసమును పరిశుద్ధముగ జేయుటకై నియమితములగు సంస్కారములు పెక్కుభంగులగుటచే నల్పపరిమితితో శోధనప్రక్రియల నారంభించి నచో సంస్కారాంతమున శుద్ధమై మిగులునట్టి రసము అల్పముగనుండును.

చేయదగిన సంస్కారకలాపము అధికపరిమాణమునకును అల్పపరిమాణమునకును సమానముగాన మిక్కిలి తక్కువయగు పరిమితికి శోధనలు జేయుట ద్రవ్యవ్యయంబును ప్రయాసబాహుళ్యంబునేకాని వేరు ఫలములేదు. గాన అధిక పరిమితితో రసశోధనము లారంభించుట యుక్తమమని భావము.

— రససంస్కారంబులకు ఫలములు. —

సీ॥ సూతంబు స్వేదనచేత తీవ్రం బగు
మర్దనంబునను నిర్మలము నగును ।
మూర్ఛనచే దోషములు వాయు సూత ము
త్థాపన పూతిత్వ మాపుజేయు ।
పాతనత్రయముచే సూత మమృతం బౌన
వని నిరోధంబు నాప్యాయనంబు ।
నియమనవిధిచేత నిలుచును కదలక
దీపనంబున ముఖదీప్తిగలుగు ।
వాసనంబున యోగనివాసమగును
చారణంబున బలమును చాల జేయు ।
జారణంబున బద్ధమౌ పారదంబు
కడమ శుద్ధుల మేలు శ్రీకంఠు డెరుగు॥    ౩౧॥

వ్యా॥ పై జెప్పబడినయట్లు రసంబునం దేర్పడియుండు దోషంబులను నశింపజేసి రసంబును పరిశుద్ధమును జేయుటకై 1 స్వేదనము, 2 మర్దనము, 3 మూర్ఛనము, 4 ఉత్థాపనము, 5 పాతనము, 6 నిరోధము, 7 నియమనము, 8 దీపనము, 9 గగనగ్రాసము, 10 చారణము, 11 జారణము, 12 గర్భద్రుతి, 13 బాహ్యద్రుతి, 14 రంజనము, 15 సారణము, 16 క్రామణము, 17 వేధ

నము, 18 శరీరయోగము అని పదునెనిమిది సంస్కారము లేర్పరుపబడినవి. ఇట్టిసంస్కారములచే రసంబున గలుగు మార్పుల నిందు వివరించుచున్నాడు.

అందు స్వేదనసంస్కారమును చేయుటచే రసము తీవ్రమగును. మర్దనసంస్కారముచే స్వచ్ఛమగును. మూర్ఛనముచే దోషంబు లడంగును. ఉత్థాపనముచే దుర్గంధ మమాసును. మూడువిధములగు ఊర్ధ్వతిర్యగధఃపాతనంబుల నాచరించిన అమృతత్వము గలుగును. రోధనసంస్కారంబుచే రసంబున కాప్యాయత గలుగును. నియమనవిధానంబున చాంచల్యమునశించి కదలకనిలుచును. దీపనవిధిచే అభ్రిజారణాదుల కుపయుక్తంబగునటుల రసంబునకు ముఖంబేర్పడును. అనువాసనంబున యోగసాంగత్యము గలుగును. చారణంబున రసంబునకు బలము గలుగును. జారణసంస్కారమున రసము బద్ధమగును. తక్కుంగల సంస్కారంబులయందలి మేలును మహేశ్వరుం డెరుంగును.

ఇచ్చోట దీని సంస్కృతమూలంబున:—“ స్వేదన మర్దన మూర్ఛోత్థాపనపాతన నిరోధనియమాశ్చ । దీపన గగనగ్రాసప్రమాణ మథ చారణవిధానంచ॥ గర్భద్రుతిసారణత్వం రసరంజనజారణ శ్చైవ। క్రమణం వేధో భక్షణ మష్టాదశధా రసస్యకర్మాణి ”॥ అని అష్టాదశసంస్కారంబులును మొదట నిరూపింపబడి పిమ్మట వానిచే గలుగు గుణంబులు చూపబడియున్నవి. రసదోషంబులయందువలెనే రససంస్కారంబులయందును రససంప్రదాయగ్రంథములయందు భిన్నాభిప్రాయము లగుపడుచున్నవి. ఎట్లన?

రసరత్నసముచ్చయమున :—“ స్యాత్ స్వేదనం తదను మర్దనమూర్ఛనం చ స్యా దుత్థితిః పతన రోధ నియామనాని । సందీపనం గగనభక్షణమాన మత్ర సంచారణం తదను గర్భగతా ద్రుతిశ్చ ॥ బాహ్య ద్రుతి స్స్యాత్క జారణా స్యాత్ గ్రాస స్తథా సారణకర్మ పశ్చాత్ । సంక్రామణం వేధవిధి శ్శరీరే యోగ స్తథాష్టాదశధా త్ర కర్మ॥ ” అనుటచే స్వేదనము, మర్దనము, మూర్ఛనము, ఉత్థానము, పాతనము, రోధనము, నియమనము, దీపనము, అభ్రికభక్షణమానము, చారణము, గర్భద్రుతి, బాహ్యద్రుతి, జారణము,

గ్రాసము, సారణము, క్రామణము, వేధనము, శరీరయోగము అను పదునెని మిదిప్రకారములు వివరింపబడినవి.

రసేంద్రభాస్కరమునను నిట్లే పదునెనిమిది సంస్కారంబుల రూపించుచు "అష్టాద శైవ సంస్కారాః ఊనవింశతికాః క్వచిత్ । సంప్రోక్తా రసరాజస్య వసుసంఖ్యాః క్వచి న్మతాః॥" అనుటచే నేకోనవింశతిసంస్కారపక్షంబును అష్టసంస్కారపక్షంబును కలదనిచూపించి స్వేదనాదిదీపనాంతము లగు సంస్కారంబులు అష్టసంస్కారపక్షంబునకు చేరినవని చూపబడెను.

శివతత్త్వరత్నాకరమున "అష్టాదశ స్యుస్సంస్కారా రసస్య పరమేశ్వరి । తత్రాద్యం స్వేదనం కర్మ ద్వితీయం మర్దనం ప్రియే । మూర్ఛా తృతీయ ముత్థానం చతుర్థం పాతనం ప్రియే। పంచమం రోధనం షష్ఠం నియామ స్సప్తమం తతః॥ దీపనం చాష్టమం దేవి నవమం చానువాసనమ్ । దశమం చారణం దేవి జారణం రుద్రసంఖ్యకమ్ ॥ గర్భద్రుతి ర్ద్వాదశం స్యా ద్ద్రుతి ర్బాహ్యా త్రయోదశమ్ । చతుర్దశం స్యా ద్రాగాఖ్యం సారణం తిథిసంఖ్యకమ్ । అనుసారణం షోడశ స్యాత్ విఖ్యాతం క్రామణం తతః ॥ సప్తదశం చాష్టదశం వేధనం దేహలోహయోః" అను శ్లోకంబులచే పదునెనిమిది సంస్కారములను రూపించుచు "అభ్రకభక్షణమాన" మను సంస్కారమును దీసివైచి "అనుసారణ" సంస్కారమునుచేర్చి "శరీరయోగము" ను "దేహవేధము"ని చెప్పి యింకను కొద్దిమార్పులతో పైవానికి కొంచెము భేదించుచు వివరించియున్నాడు.

మరియు తెలుగుమూలమున సంస్కారములనన్నిటిని పేర్కొనకుండుటయే గాక సంస్కారప్రయోజనంబుల జెప్పనపుడు కొన్నిటికిజెప్పి తక్కిన వానిని విడిచియున్నాడు. దీనియుద్దేశము రసాయనములకును ఔషధములకును ఉపయోగించునట్లు రసమును శుద్ధిజేసుకొనుటకుదగిన సంస్కారపద్ధతులనుమాత్రము తెలుపు నభిప్రాయముగ నుండవచ్చును.

రసరత్నసముచ్చయమున "ఇత్యష్టౌ సూతసంస్కారాః సమాః ద్రవ్యే రసాయనే। కార్యా స్తే ప్రథమం శేషాః నోక్తా ద్రవ్యోపయోగినః॥" అని స్వేద

నము మొదలు దీపనపర్యంతములగు నెనిమిది సంస్కారములం జెప్పి తక్కిన వానిని విడిచియున్నాడు. రసేంద్ర భాస్కరమునను నిదియె పద్ధతి యవలంబింపబడినది. మఱియు రసప్రదీపిక సంస్కృతమూలమున నట్లుగాక "తీవ్రత్వం జాయతే స్వేదాత్ అమలత్వం విమర్దనాత్ । మూర్ఛనా ద్దోషరాహిత్య ముత్థానా త్ప్వాతినాశనమ్॥ రసాయనం పాతనేన రోధా దాప్యాయనం భవేత్ । అచాపల్యం నియమనా ద్దీపనా త్స్వముఖోదయః॥ వాసనా ద్యోగ సాంగత్యం చారణా ద్బలసేవితా । జారణా ద్బంధనం సమ్యక్ ఏకత్వం ద్రావణా త్తథా॥ రక్తత్వం రంజనా త్తస్య వ్యాపిత్వం చ త్రిసారణాత్ । క్రామిత్వం క్రామణా ద్దేహలోహాది ష్వపి వేధనాత్ । వేధకత్వం చ సంశుద్ధౌ రసరాజస్య జాయతే॥ ఇ త్యష్టాదశ కర్మాణి రస స్యోక్తాని శంభునా॥" అని యష్టాదశసంస్కారములకును ప్రయోజనముల వేర్వేరజూపి వాని వివరణమున మాత్రము స్వేదనము మొదలు దీపనాంతములగు నెనిమిది సంస్కారములే చెప్పబడియున్నవి.

పైవిషయంబుల విమర్శింప రసమునకు నియమితములగు నష్టాదశసంస్కారములలో స్వేదనాది దీపనాంతమగు నెనిమిది సంస్కారములు రసాయనోపయోగమునను ఔషధోపయోగమునను తక్కినవి విశేషముగ వాదప్రక్రియాదుల కుపయోగమునను ప్రాచీనులచే విభజింపబడినటుల తోచుచున్నది.

—॥ స్వేదనము. ॥—

శా॥ ఆనా లుప్పు కటుత్రయంబు కలబం దల్లంబుల న్నూరియా।
తావిం బిష్టములోన సూత మిడి బట్టం గట్టి వ్రేలాడగా ।
సౌవీరంబును నింపి భాండమున నోజం గట్టి యామీాదటన్।
[1]వైవన్ మూడు[2]పుటంబులగ్ని నిడినన్ స్వేదాఖ్య జెన్నొందెడున్॥

వ్యా॥ క్రమంబున పైజెప్పిన యష్టవిధ సంస్కారంబుల వివరింపం బోవువాడై మొదట స్వేదనంబును జెప్పుచున్నాడు. "క్షారామ్లై రౌ

(ఖ) 1. శేవన్ 2. దినంబు

పక్షే ర్వాపి డోలాయన్త్రే స్థితస్య హి। పచనం స్వేదనాఖ్యం స్యాన్మలశైథిల్య కారకమ్॥'' అనులక్షణము ననుసరించి క్షారములు అమ్లములు ఓషధులు మొదలగునవి వానివాని కుచితమైనవిగ గ్రహించి వానిని డోలాయంత్రంబునననిచి స్వేదనసంస్కారము చేయదగిన ద్రవ్యంబుల నందువండుట స్వేదనం బగును; గావున ఆవాలు, ఉప్పు, త్రికటుకములు, కలబంద, అల్లము వీనినన్నిటిని కలిపి మెత్తగనూరి యాముద్దకు మధ్యభాగంబున రసమునుంచి గుడ్డయందున గట్టవలయును. పిమ్మట నొకకుండయందు సౌవీరంబులంబోసి యాకుండయందు పైజెప్పబడిన రసపుమూటను సౌవీరంబునకు తగులకుండులాగు వ్రేలాడదీయవలయును. తరువాత నాకుండక్రింద మంటవేయుచు మూడుదినములవరకు జాగ్రతగ వండుచుండిన రసంబు స్వేదనసంస్కారమునందును. ఇచ్చో జెప్పబడిన తెరంగున నాయాద్రవ్యంబుల యావిరిచే వండుట కుపయోగింపబడు నుపకరణమునకే డోలాయంత్రమనియు స్వేదనయంత్రమనియు పేర్లు.

స్వేదనయన్త్రనిర్మాణము శాస్త్రములయందిట్లు చెప్పబడియున్నది. "ద్రవద్రవ్యేణభాండస్య పూరితార్ధోదరస్య,చ। ముఖస్యోభయతోద్వారద్వయంకృత్వా ప్రయత్నతః । తయోస్తునిక్షిపే ద్దండం తన్మధ్యేరసపోటలీమ్ । బద్ధ్వాతుస్వేదయే దేత ద్డోలాయన్త్రమితి స్మృతమ్॥'' ఒకకుండకు మెడవద్ద నెదురెదురుగ రెండురంధ్రంబులనుచేసి వానియందొక సరిసగు సన్న కఱ్ఱనుదూర్చి యాకుండకు సగమువరకు తత్తదుచితములగు ద్రవద్రవ్యంబులను నింపి స్వేదనచేయదగిన ద్రవ్యంబుల నాకఱ్ఱకు వ్రేలాడగట్టి యిట్టికుండను పొయ్యిమీదనుంచి కుండక్రింద సంప్రదాయముల నెరింగి క్రమముగ నియమితకాలమువరకు మంటబెట్టుచు యావిరిబుట్టునట్లు చేసి యాయావిరిచే కుండముఖమున అడ్డముగ కఱ్ఱకువ్రేలాడగట్టిన మూటయందలి ద్రవ్యములు శుభ్రమగునట్లుచేయుట డోలాయంత్ర మనబడును.

" సాంబుస్థాలీ ముఖాబద్ధే వస్త్రే పాక్యం వినిక్షిపేత్ । పిధాయ పచ్యతే యత్ర స్వేదనీయన్త్ర ముచ్యతే॥'' కుండయం దర్ధభాగ ముదకములం

బోసి యాభాండముఖంబున నొకగుడ్డగట్టి దానిపై వండదగు పదార్థములనుంచి పైన మూసివండుట స్వేదనయంత్ర మనబడును. అని యీయంత్రము రెండు విధముల నుపవర్ణింపబడినది.

మరియు సౌవీరము, కాంజికము, ధాన్యామ్లము, ఆరనాళము మొదలగు నీపదములు సామాన్యముగ నొకేవిధముగ సిద్ధముచేయబడు ద్రవ్యమును బోధించును. పరస్పర మించుకభేదము కలదని కొందరు చెప్పెదరు. దీనిని సిద్ధము జేయుపద్ధతి యిట్లు వర్ణింపబడియున్నది.

ఆనందకందము:—"యవగోధూమ కలమ మాషముద్గచణాదిభిః। శ్యామాకకోద్రవాద్యైశ్చ నానాధాన్యైశ్చ నిస్తుషైః॥ ధాన్యాచ్చతుర్గుణం తోయం మృష్టఘటే నిక్షిపే త్ప్రియే। ప్రాప్నోతి యావదమ్లత్వం తావద్యత్నేన రక్షయేత్॥ తన్మధ్యే హంసపాదీం చ మీనాక్షీం చ పునర్నవామ్। ద్విచిత్రకం భృఙ్గరాజం విష్ణుక్రాన్తాం శతావరీమ్॥ సర్పాక్షీం గిరికర్ణీం చ ముణ్డీం చ సహదేవికామ్। త్రిఫలాం ఖణ్డశః కృత్వా సర్వా నేతాన్ వినిక్షిపేత్॥ ధాన్యస్య తు చతుర్థాంశం ధాన్యామ్ల మిద ముత్తమమ్। స్వేదనాదిషు కార్యేషు పారదస్య విశిష్యతే॥" యవలు, గోధుమలు, కలమ (వరి) ధాన్యము, మినుములు, పెసలు, సెనగలు, చామలు, ఆళ్ళు, ఈమొదలగు నానావిధములగు ధాన్యముల పైపొట్టుపోవునట్లు దంపి మన ముపయోగించిన ధాన్యముల పరిమితికి నాలుగింతలు నీరుపోసి దానియందు జలమునకు నాలవ భాగము (అనగా ధాన్యపరిమితికి సమానముగ) హంసపాది, పొన్నగంటి, గలిజేరు, రెండువిధములగు (యెరుపు తెలుపు పూలుగల) చిత్రమూలము, గుంటగలగర, విష్ణుక్రాంత, పిల్లితేగలు, సర్పాక్షి, నల్లదింటెన, బోడతరము, సహదేవి, కరకతాడియుసిరికెలు, వీనినెల్ల ముక్కలుగ నరికి దంచి పైధాన్యాదులును నీముక్కలును భాండమునందువైచి యాభాండముఖమును మూకుడు చక్కగమూసి సంప్రదాయానుసారము చీరజేసి పులియునంతవరకు నాభాండమును జాగ్రతగ నుంచవలయును. పులిసిన యాజలము ధాన్యామ్లమనబడును. ఇది స్వేదనాది రస సంస్కారములయందు మిగుల నుపయుక్తమైనది.

భావప్రకాశాదులయందు పైఁజెప్పబడిన ధాన్యామ్లాదులకు పరస్పరమీషద్భేదము చెప్పబడియున్నది. వానివాని యుపయోగభేదమునుబట్టి అట్టిభేదము లేర్పడియుండవచ్చును. ఈభేదము * ఆయుర్వేదపరిభాష అర్కప్రకాశికల యందు బాగుగ వివరింపబడియున్నవి.

## —॥ మర్దనము. ॥—

సీ॥ కరిధూపము త్రికటుకంబు బెల్లము పసుపు
  [1]తెల్లనావాల్ పులిచల్లయిటికె।
పొడి యుప్పు పెరుగు గొంగడి [2]చింపి యుమ్మెత్త
  చిత్రమూలపు వేరుచెక్క జేర్చి।
పాదరసంబున పదియారుభాగము
  లొక్కొక్కటియు నిడి చొక్కముగను।
కలి బోసి మూన్నాళ్లు గట్టిగ మర్దించ
  కంచుకదోషము కడకు బోయి।
నిర్మలంబగు కాంతితో నిలుచు రసము
గాన మర్దన విధి జేయ గడగ వలయు।
వినుము మలవహ్నివిషదోషవిధియు నీవు
మహితగుణధుర్య యాత్రేయ మానివర్య॥     ౩౩॥

వ్యా॥ కరిధూపము, శొంఠి, పిప్పలి, మిరియములు, బెల్లము, పసుపు, తెల్లావాలు, పుల్లనిచల్ల, ఇటికెపొడుము, ఉప్పు, పెరుగు, గొంగటిముక్కలు,

---

* ఆయుర్వేదాశ్రమగ్రంథమాల మూడవగుచ్ఛము ४౧ - ४౨ పేజీల యందును ౭ గుచ్ఛము ౫౦ పేజియందును జూడనగును.

(ఖ) 1. ఆవాలు తెల్లనావాలు నిటికె.     (క) 2. పాత.

ఉమ్మెత్త, చిత్రమూలపు వేరునైపట్టి, వీనినన్నిటిని రసంబునకు పదు నారవభాగము పరిమితి గలుగునటుల ప్రతివస్తువునకూర్చి కాంజికమును బోసి ఒక్కొకవస్తువుతో నొక్కొకసారిగ నూరుచు మూడుదినంబులు మర్దనముచేయుటయే మర్దనసంస్కార మనబడును. ఈసంస్కారంబుచే రసం బునకు కంచుకదోషంబు లడగి నిర్మలమై స్వచ్ఛమగుకాంతి కలిగినదగును. కావున నీసంస్కారము తప్పక చేయందగినది. ఇక మలవహ్ని విషసంబంధ ములగు దోషంబులు నివర్తించుపద్ధతి నెరింగించెద.

ఇచ్చట సంస్కృతమునకన్న తెనుగున నొకపాఠమున రెండువిధములగు నావలనియు మరియొకపాఠమున పులిమజ్జిగ యనియు జెప్పి భేదించియున్నది.

మర్దనసంస్కారముయొక్క లక్షణము తంత్రాంతరముల నిట్లు గానం బడియెడు. "ఉదితైరౌషధైః స్సార్థం సర్వామ్లైః కాంజికైరపి। పేషణం మర్ద నాఖ్యం స్యాత్ బహిర్మలవినాశనమ్॥" రసమందలిగల కంచుకాది దోష ములు దొలగుటకై రసతంత్రములయందు విహితములగు నౌషధులను అమ్ల వర్గపు రసములచేతను కాంజికముచేతను చేర్చి అందు పాదరసంబును జేర్చిమర్దిం చుట మర్దనసంస్కారం బనబడును.

— మూర్ఛనము. —

గీ॥ ఇలను మలవహ్నివిషదోషముల నణంప
దలచి కలబంద త్రిఫలచిత్రకము లెల్ల।
గలిపి యేడు దినంబులు [1]కదియ నూర
మూర్ఛవిధి యంద్రు సూతంబు మూర్ఛ [2]బోవు॥ ౩౮॥

వ్యా॥ "మర్దనాదిష్టభేషజైర్నష్టపిష్టిత్వకారకమ్। తన్మూర్ఛనం హి వఙ్గాది భుజకఞ్చుకనాశనమ్" విహితములగు నౌషధములతో జేర్చినూరి రసం

(ఖ) 1. నూరనదియు. 2. నందు.

బునకు నష్టపిష్టిత్వమును కలుగజేయుట మూర్ఛనమనబడును. దీనిచే రసంబున వంగాదిసంబంధముచే గలుగుదోషంబులు నివర్తించును. అను రసతంత్రము లయందుదాహృతమగు లక్షణము ననుసరించి మలము, అగ్ని, విషము అను వానిసంబంధమువలన రసంబునకు కలిగినదోషంబుల నణచుటకై కలబంద, కరక తాడిఉసిరికెలు, చిత్రమూలము అనువానితో కలిపి యేడుదినంబులు రసమునునూరిన మూర్ఛన సంస్కారమగును. దీనిచే రసంబునందలి దోషంబుల డగి చాంచల్యముడిగి రసము మూర్ఛనందును.

"స్వరూపస్య వినాశేన పిష్టత్వాపాదనం హి యత్। విద్వద్భిర్నిర్దిత స్సోతః నష్టపిష్టిస్స ఉచ్యతే॥" రసశాస్త్రకోవిదులగు వారాయాయౌషధము లతో రసంబునునూరి దానిశక్తి యుడుగునట్లుచేసి జయించి దానిస్వరూపం బునకు నాశంబును కలిగించి పిష్టాకారంబుగజేయుట నష్టపిష్టి యనబడును.

రసార్ణవమున మూర్ఛనము మర్దనసంస్కారంబున నంతర్భావమునం దించబడినది. వేరుసంస్కారముగ నెత్తి చెప్పబడలేదు. మరియు రసమునకు విహితమగు నష్టపిష్టి (రసము దాని నిజరూపమును వదలి అందు వేయబడిన మూలికాసముదాయమున తెలియక జేరియుండుట) సంస్కారమును మూర్ఛన సంస్కారమును పైవాక్యములనుండి యొకటియనియే యెరుంగునది.

—॥ ఉత్థాపనము. ॥—

క॥ కదలక సూతము మూర్ఛన్
గదిరిన జలమైన వేడికలితో నైనన్।
బదిలముగ గడుగ మేల్కా-ను
నది యుత్థాపనవిధాన మండ్రు మునీంద్రుల్॥  ౩౫॥

వ్యా॥ పైజెప్పబడినట్లు మూర్ఛనసంస్కారము నాచరించుటచే చాంచ ల్యమునశించి కదలనేరక యుండురసమును వేడినీళ్లతోనైనను వేడికాంజిక ముతోనైనను కడిగిన మరల శక్తివంతమగును. దీనికే యుత్థాపనమని పేరు.

—॥ ఊర్ధ్వపాతనము. ॥—

గీ॥ తామ్రభస్మంబు కలి పారదంబు నూరి
యటికె నిడి మంటవేయగ నదియు మీఁది ।
ఘటము బట్టును నాగవంగములు బోవు
దాని మును లెల్ల నూర్ధ్వపాతన మటంద్రు॥ ౩౬॥

వ్యా॥ "ఉక్తౌషధై ర్మర్దితపారదస్య యన్త్రస్థిత స్యోర్ధ్వ మధ శ్చ తిర్యక్।నిర్యాపణం పాతనసంజ్ఞ ముక్తం వంగాహిసంపర్కజకంచుకఘ్నమ్॥" రస సంబద్ధములైన నాగవంగములయొక్క దోషము నశించుటకై శాస్త్రవిహితములగు నౌషధములతోఁ జేర్చి నూరబడిన రసంబును వానివాని కుచితంబులగు యన్త్రంబులయందుంచి పైకిని క్రిందకును అడ్డముగను ప్రసరించునట్లు చేయుట పాతనమను సంస్కారమగును. ఇయ్యది పై జెప్పబడిన మూఁడువిధములగు రసప్రసారణము ననుసరించి వరుసగ నూర్ధ్వపాతనము తిర్యక్పాతనము నధః పాతనము నని మూఁడువిధంబులై యుండును. అం దూర్ధ్వపాతనవిధానమును జెప్పుచున్నాఁడు:—తామ్రభస్మంబును పాదరసంబును గ్రహించి కాంజికముతోఁ గలిపినూరి పిష్టినిజేసి యాపిష్టిని యొకకుండయం దునిచి పైన కుండను మూసి సంప్రదాయములననుసరించి చీలయిచ్చి యాయంత్రమును పొయ్యిమీఁద నునిచి క్రింద మంటవేసిన నా రసం బెగసి పైకుండకు బట్టును. దీనిచే నాగవంగ సంబంధముచే గల్గు రసదోషంబులు నశించును. దీనినే యూర్ధ్వపాతనమని మునులు చెప్పెదరు.

—॥ తిర్యక్పాతనము. ॥—

గీ॥ ఆరనాళంబుతో సూతకాభ్రకములు
గట్టిగా నూరి కుండలోఁ బెట్టి కుండ ।
నడ్డముగ బెట్టి పెద్దమం టమర వేయ
దనరు తిర్యగభిఖ్య పాతన మనంగ॥ ౩౭॥

వ్యా॥ పాదరసముతో సమముగ * ధాన్యాభ్రకమును వైచి యందు కాంజికంబునఁబోసి నూరవలయును. ఇట్లు సిద్ధముచేయఁబడిన సూతాభ్రక సముదాయపిష్టిని యొక మంచికుండలో నునిచి పైన మరియొకకుండను మూసి సందులేకుండ రెండుకుండల ముఖమునకును చీరజేశి యెండించి రసముగలకుండను పొయ్యిమీద నడ్డముగానుంచి దిగువ గాఢాగ్నిని వేయవలెను. దీనిచే రసము ఎగిరి రెండవకుండఁలోఁబడును. దీనినే తిర్యక్పాతన మందురు.

మరియు "క్షిపే ద్రసం ఘటే దీర్ఘే నతాధో నాళసంయుతే।తన్నాళం నిక్షిపేదన్యఘటకుక్ష్యంతరే ఖలు॥ తత్ర రుద్ధ్వా మృదం సమ్యగ్వదనే ఘటయోరధః।అధస్తా ద్రసకుంభస్య జ్వాలయే త్తీవ్ర పావకమ్॥ ఇతరస్మిన్ ఘటే తోయం నిక్షిపే త్స్వాదు శీతలమ్। తిర్యక్పాతనయంత్రం వై వార్తికై రభిధీయతే॥" పొడవగు నొకకుండకు మధ్యభాగముననుండి క్రిందకు వంగియుండునట్లు నాళము (గొట్టము)ను అమర్చవలయును. ఈనాళము మరియొక కుండలోనికి ప్రవేశపెట్టవలయును. ఇట్లు నిర్మితమైన యంత్రంబున మొదటి పొడవగు కుండయందు సిద్ధముచేయబడిన రసమునుంచి రెండవకుండయందు చల్లని మంచినీటినిపోసి రెండుకుండలకును పైనమూసి రంధ్రముల కన్నిటికిని బాగుగ చీరమన్నులనిచ్చి యెండింపవలయును. పిమ్మట రసభాండమును పొయ్యిపై నమర్చి దానిక్రింద దృఢమగునగ్నినుంచి సంప్రదాయములనెరింగి క్రమముగ మంటబెట్టిన రసమెగసి నాళముగుండ ప్రసరించి ప్రక్కకుండలోన పడును. దీనినే తిర్యక్పాతన యంత్రమని నుడివెదరు.

---

* "చూర్ణాభ్రం శాలిసంయుక్తంవస్త్రబద్ధం హి కాంజికే। నిర్యాతం మర్దనా ద్వస్త్రా ద్ధాన్యాభ్ర మితికథ్యతే" అభ్రకమును మెత్తగ నలియగొట్టి వరిధాన్యముతోఁగలిపి మూటగట్టి యామూట కాంజికముననుంచి నూరబెట్టవలయును. పిమ్మట నామూటను చేతుల్తో నెమ్మదిగా కాంజికము నీటిలో పిసుకుచుండిన వడ్లరాపిడినుండి మూటయందుగల యభ్రకము అతి మృదువుగను బైటవెడలును. అట్టి మెత్తనై యుండునభ్రకము ధాన్యాభ్రక మనంబడును. మరియు దీనినే యభ్రకనవనీతమనియు చెప్పుదురు.

ఇచ్చట పైమూలపద్యమున తిర్యక్పాతనయంత్రమునకై గనుపరచిన లక్షణమునకును తంత్రాంతరముల జూపిన లక్షణమునకును విశేషభేదము గన బడుచున్నది. ఇందు తెనుగుమూలమున గనపరచిన యంత్రమునకూడ రసము లేని రెండవకుండయందు పరిశుద్ధమగు జలము నుంచుటయు సంప్రదాయమై యున్నది. మరియు పై రెండువిధములగు తిర్యక్పాతనయంత్ర ప్రక్రియలును వాడుకలోనుండుట స్పష్టము.

—( అధఃపాతనము. )—

గీ॥ సర్షపము లుప్పు శిగ్రుబీజములు త్రిఫల
పారదముతోడ మెత్తగా నూరి మీఁది।
కుండలో [1]బూసి క్రిందటి కుండ దొరగ
నగ్ని బెట్టి నధఃపాత మంద్రు బుధులు॥ ౩౮॥

వ్యా॥ ఆవాలు, ఉప్పు, మునగవిత్తులు, త్రిఫలములు వీనినెల్ల కాంజికముబోసి పాదరసముతో జేర్చినూరిన నంతయు జేరి ముద్దయగును. ఆనష్టపిష్టిని యొకకుండయందు బూసి దానిని క్రిందకుద్రిప్పి దానిముఖమును మరియొక కుండయొక్క ముఖమున ప్రవేశపెట్టి దృఢముగ సంధిబంధనము జేయవలయును. పిమ్మట సిద్ధమగు నీయంత్రమును క్రిందికుండ మునుగునట్లు బురదతో నింపబడియుండు గోతియందుంచి పైకుండపై సంప్రదాయముల నెరింగి యేరుబిడకల బుటముబెట్టిన రసము క్రిందికుండయందు బ్రసరించును. ఇదియ యధఃపాతన సంస్కారమనబడును.

« ఉపర్యధస్థితస్థాల్యాః క్షిపేదన్యా మధోముఖీమ్ । స్థాలికాం చిపిటీభూతాం తత్ర సంలిప్తపారదామ్ । క్షిప్త్వా తాం పంకిలే గర్తే జ్వాలయేన్మూర్ధ్ని పావకమ్ । అధఃపాతనయంత్రం హి తదేతత్పరికీర్తితమ్॥ » అని రసతంత్రముల « పంకిలెగర్తే » యను విశేషార్థ మధఃపాతనయంత్రలక్షణమున చెప్పబడియున్నది.

---

1 (క) (గ) బెట్టి.

—॥ శోధనము. ॥—

ఉ॥ ఆరయ స్వేదనాది విధులన్నిట సూతము మందవీర్యమౌ।
ధారుణి[1]లోన(ని)శోధనవిధంబౌగ[2]సేయగనుప్పుబోసియా।
పేరుపులోన పారదము బెట్టి జలంబులు జల్లి మూకుడిం।
పారగ మూసి మీఁదలఘువైన పుటంబిడి వండగాదగున్॥

వ్యా॥ దోషమును హరించుటకై స్వేదనము మొదలగు విధుల నాచరించుటచే రసంబునందలి వీర్యముతగ్గును. (అనగా బంగారు చక్కజేయుటకై వినియోగించు పదార్థములు బంగారును శుభ్రపరచినను నాయన్యపదార్థముండువరకును బంగారమెట్లు ప్రకాశింపనోపదో అటులనే యిచటను రసముకూడ మందముగ దెలియునుగాని నిజముగ మందతను బొందదు.) కావున తిరిగి వీర్యము యథాపూర్వమగుస్థితి నందుటకై శోధనసంస్కారము నాచరింపవలయును. అందు ఒకకుండయం దుప్పును పేర్చి యందు పాదరసంబునుంచి నీటిని జల్లి పైన మూకుడు మూసి సంప్రదాయముల నెరింగి లఘుపుటము వేయవలయును. ఇదియ శోధనము.

—॥ నియమనము. ॥—

సీ॥ క్షితి స్వేదనాదులచే జపలాదిగు
    ణము రసమున కధికముగ నగును।
అట్టిచాపల్యంబు హరియింప నియమన
    విధి సేయవలయు ప్రావీణ్య మెసగ।
కల్లుప్పు వేపచెక్కయు క్షీరకాకోళి
    గొడ్డుకాకరగడ్డ గోధుమములు।

1. (ఖ) గాన. 2. (క) సేయుదురు.

నబ్జకందమ్ము సర్పాక్షి యమృతపువల్లి
గూర్చియైనను కలకొాలదినైన ।
మునుపుచెప్పిన రీతిని మూడునాళ్లు
స్వేదనంబును విధిబూని చేసిరేని ।
సప్తకంచుకములను నైసర్గికముల
బాసి పాదరసంబు శుభంబు లొసగు॥ ౮౦॥

వ్యా॥ స్వేదనాది రోధనాంతములగు సంస్కారములచే పారదము దోషవిరహితమై వీర్యముగలిగినదియగును. దానితోబాటుగ దానికి చాపల్యముకూడ నధికమగును. అదినివర్తించుటకై నియమన సంస్కారము నాచరింప వలయును. అందుకొరకు రాతియుప్పు, వేపచెక్క, క్షీరకాకోళి, గొడ్డుకాకరదుంప, గోధుమలు, తామరదుంప, సర్పాక్షి, తిప్పతీగ, వీనినన్నిటినిగాని దొరకినంతవరకుగాని సమభాగములుగ జేర్చి స్వేదన సంస్కారంబున జెప్పబడినచొప్పున స్వేదనయంత్రంబుననునిచి ఆరనాళముతో మూడుదినంబులు స్వేదనముచేసిన నియమన సంస్కారమగును. ఈసంస్కారముచే సప్తకంచుకములు నైసర్గికదోషములు మొదలగు దోషములన్నియు నశించి పాదరసము శుద్ధమై సేవించువారలకు రోగంబుల నశింపంజేసి యారోగ్యంబును ఆయుర్వృద్ధిని గలుగజేయును.

—( దీపనము. )—

సీ॥ పటుపంచకంబు నభ్రకము త్రిక్షారస
ర్షప వహ్ని శిగ్రుబీజములు గొడ్డు
కాకర పాతాళగరుడ భూనాగ[1]ముల్
క్షీరకాకోళియు చెరుకు[2] జిలుగు ।

(క) 1. ముష్కరకకాకాశియు, 2. వెలుగు.

శంఖపుష్పియు కాసి [1]సంబునుదింటెన
కలబంద పిప్పళ్ళు కరక నేల।
తాడి [2]కలియును పారదంబు మిరియంబును
నమ్లవర్గము చేర్చి యమరనూరి।
రసము [3]వండిన కుండలో పోసగనుంచి
డోలయంత్రాన మూడుదినాలు వండ।
దీప్నవిధి యనబడును తద్దివ్యరసము
కాంతితోడుత నభ్రిక గ్రాసమడుగు॥  ౪౧॥

వ్యా॥ ఈసంస్కారంబున పంచలవణంబులు (సైంధవము, సౌవర్చలము, చూలిక లేక బిడ, సాముద్రము, కాచము) ధాన్యాభ్రికము, క్షారత్రయము (టంకణక్షారము (వెలిగారము), యవక్షారము, సర్జకాక్షారము), ఆవాలు, చిత్రమూలము, మునగవిత్తులు, గొడ్డుకాకరదుంప, పాతాళగరుడి, యెఱ్ఱులు (వానపాములు), క్షీరకాకోళి, చెరుకు, జీలుగ, తెల్లగంటెన, కాసీసము, దింటెన, కలబంద, పిప్పళ్ళు, కరక్కాయలు, నేలతాడి, తక్కలి, మిరియములు వీనినన్నిటిని గాని దొరకినంతవరకుగాని పాదరసముతో సమముగ జేర్చి అమ్లవర్గంబున ("అమ్లవేతస జంబీర లుంగామ్ల చణకామ్లకమ్। నారంగం తింతిడీకంచ చాంగేర్యమ్లగణోత్తమాః॥" పుల్లప్రబ్బలి, నిమ్మ, మాదీఫలము, సెనగపులుసు, నారింజ, చింత, పులిచింత, ఇదియమ్లవర్గము) చెప్పబడినవాని రసంబులంబోసినూరి డోలాయంత్రంబునందుంచి మూడుదినములు వండిన దీపనసంస్కారమగును. ఇట్టిసంస్కారముచే రసము దీపితమై కాంతిగలిగి యభ్రికముయొక్క జారణమునకు సిద్ధమైయుండును.

---

(క) 1. సంబుగించినయును.  2. తక్కలిపార.
(ఖ) 3. వండెడు.

—॥ పారదశుద్ధికి ప్రకారాంతరము. ॥—

క॥ కలబంద రసము పసుపును
కలియగ మర్దించి సూతకము పాతనచే।
లలితముగ వండ దోషం
బులబాసి శుభంబులొసగు భూతలమందున్॥ ౭౨॥

వ్యా॥ కలబందయొక్క రసమును పసుపును సమముగ చేర్చి అందు పాదరసమువైచి నూరి పిష్టిజేసి యాపిష్టిని పాతనయంత్రంబునందుంచి వండిన రసమందలి దోషములు నశించును. మరియు నాపాదరసము సర్వశుభముల నొసగజాలియుండును.

—॥ ఇంగిలీకమునుండి రసము దీయువిధానము. ॥—

సీ॥ ఇంగిలీకంబున నిమిడియుండు రసంబు
దీసెడు మార్గంబు దెలియవినుము।
లోహంపు ఖల్వంబు లోన నింగిలికంబు
నొకసేరు మాత్రంబు నుంచిమరియు।
వారిజపాకు [1]ద్రవంబున నొకజాము
జంబీర రసమున జాము నూరి।
యదిబిళ్ళవలె జేసి యటికలోనిడి క్రింద
నగ్ని [2]బెట్టించియు నందుమీద।
ఘటము మీదట నొకపేడ కుదురుగట్టి
జలము లోగి బోయుచును నాల్గుజాలువండ।

(క) 1. రసం. 2. బెట్టియు నూర్ధ్వయమందునున్న.

తోడనే బుట్టు రసము నిర్దోషమగుచు
రోగముల బాపి జనులకా రోగ్యమొసగు॥ ౪౩॥

వ్యా॥ ఇంగిలీకమునుండి రసంబు నాకర్షించు పద్ధతి నిచ్చట చెప్పుచున్నాడు. ఒక సేరు పరిమాణముగల యింగిలీకమును లోహపు ఖల్వమునవైచి వారిజ (బాడిద) పాకు రసమునుబోసి యొకజామును, నిమ్మపండ్ల రసంబును బోసి యొకజామును బాగుగమర్దించి బిళ్ళజేసి దానినొకకుండయందుంచి పైన కుండనుమూసి చీలనిచ్చి యెండించి క్రిందికుండను ప్రొయ్యిపైనమర్చి మంటవేయుచు పైకుండపై పేడతో చుట్టు కట్టవలె నీరునిలుచుట కుపయుక్తంబగునటుల కట్టి యందు చల్లనినీటిని బోయుచుండవలయును. అట్లు నాలుగు జాములవరకు జేసిన క్రిందికుండలోని యింగిలీకమునం దిమిడియుండు రసమెగసి పైకుండకుబట్టును. అద్దానినిదీసి యౌషధములయం దుపయోగించుకొనవచ్చును.

ఇంగిలీకమునంగల పాదరసము గంధకముచే జారితమైనది యగుటంజేసి యందుండి దీయబడు రసముదోషరహితమై యుండును. కావున నయ్యది రోగములనన్నింటిని నశింపంజేసి యారోగ్యము నొసంగజాలియుండును. దీనినే బాలరసమని లోకమున నుడివెదరు.

ఇచ్చట నూర్ధ్వపాతనయన్త్రమునుండి రసమునుదీయు పద్ధతినిమాత్రము జెప్పియున్నను లోకమున నధఃపాతన తిర్యక్పాతనయన్త్రముల సహాయముచే గూడ రసాకర్షణము జేయుట వాడుకలోనున్నది. మఱియు కొందరు విద్యాధరయన్త్ర సాహాయ్యముచేగూడ పాదరసమును దీసెదరు.

—( రససిన్దూరము. )—

క॥ సిన్దూరలక్షణంబును
బన్ధురగతి నాన్ధ్రకావ్యపద్ధతితోడన్ ।
సన్ధులు దెలియగ బల్కెద
నన్ధునకును దివ్యదృష్టి యచ్చినరీతిన్॥ ౪౪॥

వ్యా॥ రససిన్దూరమును జేయుపద్ధతులును వానిలక్షణములును మున్నగువానిని గ్రుడ్డివానికి కనులచూపు కలిగినట్లు సులభముగ దెలియులాగున వివరించెదను.

సీ॥ ఏడు పైపూతలనిచ్చిన కుప్పెలో
పల గన్ధకము సమభాగరసము ।
[1]గట్టిబట్టనుగట్టి గన్ధకమునబెట్టి
కుప్పెవాతను శ్వేతకుక్కుటంపు ।
రక్తంబు వెలిగార యుక్తంబుగానూరి
[2]యారిచి వాలుకాయన్త్రమునను ।
చతురత నెనిమిదిజాము లగ్నినిబెట్టి
[3]మూతిబూసిన మన్ను మొదలదీసి ।
సాజశీతలమైన విశ్వాసమొనర
వల్లమాత్రంబు సేవించువారలకును ।
విష్ణుచక్రంబు నసురుల విధముబోలి
రోగములబాపి జనుల కారోగ్యమొసగు॥ ౭౫॥

వ్యా॥ రసగన్ధకముల సమభాగములుగ జేర్చి నూరి యాపిష్టిని దృఢమగు వస్త్రమునగట్టి యేడుసార్లు చీరమట్టిబూసి యెండించబడిన *కుప్పె (మూస)లో బెట్టి దానికి క్రిందను మీదను గన్ధకచూర్ణమునుబోసిగప్పి వెలిగారమును తెల్లకోడినెత్తురును కలిపినూరి దానిని యామూసయందునిచి పెంకుతో మూసమూతినిమూసి చీరజేసి యెండించవలెను. ఇట్లు సిద్ధము చేయబడిన

(క) 1. గప్పిబట్టినిబట్టి గట్టికుండనెబెట్టి. 2. యిగిరిచి.

(ఖ) 3. ముడిబల్చినను మంటకడకుదీసి.

* కుప్పెయను శబ్దమునకు ప్రకరణము ననుసరించి "మూస" యని యర్థముజేయుట యుక్తము.

మూసను జాగ్రతగ వాలుకాయన్త్రమునందునిచి యెనిమిదిజాములకాలము సంప్రదాయానుసారముగ క్రమాగ్నులచే వండిన సిందూరమగును. పక్వమైన పిదప స్వాంగశీతలమున మూతిని జాగ్రతగదీసి యారససిన్దూరమును మెలకువతో గ్రహించి భద్రపరచవలెను. దానిని *వల్లపరిమితముగు (మూడుగురిగింజల) ప్రమాణముగ నుపయోగించినచో జక్రాయుధ మసురులం దునుమాడునట్లు రోగంబులనెల్లహరించి యారోగ్యసంపద నొసంగును.

—॥ ప్రకారాన్తరముగ రససిన్దూరవిధానము. ॥—

ఉ॥ పారదగన్ధకంబు లొకభాగము నాల్గవభాగ మూ నవా ।
సారము కుప్పెబెట్టి పదిజాములు వండిన కెంపుసొంపుతో ।
ధారుణి బుట్టు సిన్దుర ముదారత నడ్డిగయొత్తు నిచ్చినన్ ।
ఘోరున రోగపుంజములు బోవ హరించు నమోఘవీర్యమై॥

వ్యా॥ పాదరసగంధము లొక్కొక్కభాగంబును నాల్గవపాలు నవాసారంబును కలిపినూరి యాకజ్జలిని పైజెప్పినచొప్పున నిర్మితమగు కుప్పెలోబెట్టి వాలుకాయన్త్రంబున పూర్వోక్తప్రకార మునిచి పదిజాములు వండినయెడ రసము కెంపువంటిరంగుగల్గి సిందూరమగును. ఈసిందూరమును స్వాంగశీతలమునగ్రహించి * యడ్డిగ (రెండుగురిగింజల) యెత్తు చొప్పున పరిమాణమును గల్పించి యుపయోగించినచో సకలరోగములను హరింపజాలియుండును.

—॥ మరియొకసిందూరవిధానము, ॥—

ఉ॥ చొక్కపు మూడుభాగములు సూతముసీసము గన్ధకంబును।
క్కొక్కొకపాలు గూర్చుకొని యోపికతో దుతనూరి కుప్పెలో।
జక్కగ బెట్టి మంట పదిజాములు వైచిన రక్తవర్ణముగ్ ।
మిక్కిలి గల్గి రోగముల మీరి హరించు నమోఘవీర్యమై॥

* ఇది మధ్యమవయస్కుల కిచ్చు పరిమితి. దీనిని వయస్సును బలమును నెరింగి పరిమితి నుపయోగించునది.

వ్యా॥ మూడుభాగములు శుద్ధరసంబును శుద్ధములగు గంధకసీసము లొకొక్కభాగంబును జేర్చి బాగుగనూరి పైజెప్పినచొప్పున కుప్పెలోబెట్టి వాలుకాయన్త్రమున పదిజాములు వండినయెడ రసము సిందూరమగును. దానిని స్వాంగశీతలమునగ్రహించి పరిమితుల నెరింగి యుపయోగించినచో రోగముల హరించును.

—॥ రససిందూరమున కనుపానములు. ॥—

సీ॥ ఇవ్విధంబున ఫలియించు సిన్దూరంబు
 ననుభవింపగవలె నడ్డిగెత్తు ।
వన్దనంబులతోడ వైద్యుని[1]బూజించి
 శుభముహూర్తంబున శుద్ధితోడ ।
జ్వరితునకును జీలకరయును పిప్పళ్లు
 బలుసన్నులకును వావిలిరసంబు ।
*రక్తపైత్యములకు శర్కర [2]ద్రాక్షయు
 బహుకాసములకు పిప్పలియు దేనె ।
క్షయరోగములకు[3] నాజ్యంబు లవంగంబు
 వట్టితృష్ణలకును వట్టివేళ్లు ।
నరుచికి మాతులుంగాది రసంబును
 ఛర్దులకును పేల సత్తుతోడ ।
గూర్చివైద్యులు ననుపాన గుణములెరిగి
యగణితములైన రోగంబు లందుయుక్తి ।
బలముచేనిచ్చినను రోగములు హరించు
హరుని సంబంధమైన రసౌషధములు॥ ౭౮॥

(ఖ) 1. బిలిపించి. 2. ద్విక్షార. (క) 3. నాజ్యలవంబు బెంపారు.
* రక్తపిత్తమున శర్కరయును ద్రాక్షయు, అని యుండుట యుక్తము.

వ్యా॥ మంచి శుభముహూర్తమున పరిశుద్ధుడై యిష్టదైవమున్నగు దేవతలకు వందనాదులఁజేసి వైద్యునిఁబూజించి పైఁజెప్పబడిన పద్ధతులననుసరించి సిద్ధముచేయబడిన రససిందూరమును తడవ కడ్డిగ (రెండుగురిగింజల) యెత్తు చొప్పున పరిమాణమేర్పరచి యుపయోగింపదగును. అందు జ్వరమున జీలకఱ్ఱయు పిప్పళ్లును, జన్నులకు (సన్నిపాతము లేక సంధులు) వావిలాకురసంబును, రక్తపిత్తమున చక్కెరయు ద్రాక్షపండును, కాసమున పిప్పళ్లును, తేనెయు, క్షయవ్యాధులయందు నెయ్యియు లవంగంబులును, దప్పికి వట్టివేళ్లును, అరోచకమున మాదీఫలము మున్నగు పండ్లరసంబును, వాంతులకు వరిపేలాలపిండియు ననుపానముగఁజేర్చి యుపయోగింపందగును.

మఱియు నీ యీశ్వరసంబంధమైన రససిందూరమును వైద్యుఁడు తన యుక్తిబలముచే తగుననుపానముల గల్పించి రోగుల కుపయోగపఱచినయెడ రోగముల నన్నింటిని హరించును.

మరియు దీనికి మూలమగు సంస్కృతమున నింతియేగాక యింకను కొన్ని రోగములఁజేర్చి యనుపానములు చూపబడియున్నవి. తెనుగున నయ్యవి వైద్యబుద్ధిచే నూహింపతగినవిగా చెప్పబడినవి. ఎట్లనిన?

“మదాత్యయేనింబునీరైః సితాయుక్తైఃప్రదాపయేత్ । నారికేళజలేనైవ మూర్ఛాయాంచ మదేషు చ॥ అపస్మారేచ సన్న్యాసే భృఙ్గనీరేణదాపయేత్। శుంఠ్యాజీరకజాతీభిః విషూచ్యాం చ విశేషతః॥ ధాన్యనాగరనిర్యూహైరజీర్ణే పక్వభేదనే।చాంగేర్యా గ్రహణీదోషే సామే సంభృష్టపథ్యయా॥ అథవా భృష్టశుణ్ఠ్యా వా సశూలెసప్రవాహికే। మందాగ్నౌ చార్ద్రకద్రావైః శోఫే ప్లీహేచ హృద్రుజి । ధాత్రీఫలేన మేహేషు కృచ్ఛ్రేగోక్షురవారిణా॥ హిఙ్గువ్యోషయవక్షారైః ఆనాహేగుల్మశూలయోః । అయోమలకపాయేణ పాణ్డురోగేషు కామిలే। చిఞ్చానింబశలాకాభ్యాం తీక్ష్ణక్షీరేణపీనసే ॥ వాసచీభిశ్చక్రమర్దైః కుష్ఠేషుఖదిరేణవా। మాషయూషేణవా తేషు తైలేవా లశునే

నవా॥ ఆస్యస్ఫోటేచద్గ నేన వాతాగ్రే కోకిలాక్షజైః । దన్తధావనసారేణ దన్తరోగేషు యోజయేత్ ॥ ఐలేయజైస్సాంకరణే హిధ్మాశ్వాసే కుళుత్థజైః। కదళీక్షురసైరేవ శుక్రవృద్ధిః ప్రజాయతే । మేధావృద్ధికరం పుంసాం కాన్తిశ్రీబలవర్ధకమ్॥ ఆయుఃప్రవర్ధనంచైవ వలీపలితనాశనమ్ । సన్తతాభ్యాసయోగేన జీవేద్వర్షశతం నరః॥ " మదాత్యయ రోగంబులయందు చక్కెర చేర్చిన నిమ్మపండ్లపులుసుతో నీయవలయును. మూర్ఛలయందును, మదరోగములయందును, టెంకాయనీటితో నీయవలయును. అపస్మారమునందును, సన్యాసరోగమునందును గుంటకలగర రసముతోడ నీయవలయును. విషూచియందు శొంఠితోడను జీలకఱ్ఱ జాజికాయలతోడను చేర్చి యీయవలయును. అజీర్ణవ్యాధులయందు దనియములయొక్కయు, శొంఠియొక్కయు కషాయముతో నీయవలయును. గ్రహణి రోగములయందు పులిచింతాకు కషాయముతోడను, ఆమాతిసారమునందు వేయించబడిన కరక్కాయతోడను, శూలతో గూడిన ప్రవాహిక గ్రహణియందు కాల్చినశుంఠితోడను చేర్చి యీయదగును. అగ్నిమాంద్యము, నంజు, ప్లీహరోగము, హృదయరోగము వీనియందు అల్లపుస్వరసముతో నీయవలయును. మేహవ్యాధులయందు ఉశిరికతోడను మూత్రకృఛ్రమునందు పల్లేరుకషాయముతోడను ఆనాహ (మలమూత్రములబంధించి కడుపుబ్బరముజేయు) వ్యాధియందు ఇంగువతోడను, గుల్మవ్యాధియందు త్రికటుకములతోడను, శూలవ్యాధియందు యవక్షారముతోడను నీయదగును. పాండురోగమునందు ఇనుపచిట్టెపు కషాయముతోడను, కామిలయందు చింతయొక్కయు వేపయొక్కయు ఈనెల కషాయముతోడను, పీనసవ్యాధియందు గుమ్మపాలతోడను, కుష్ఠవ్యాధియందు బావంచివిత్తులతోగాని తగిరిశవిత్తులతోడగాని చంద్రతోడగానిచేర్చియు, వాతవ్యాధులయందు మినపకట్టుతోగాని, నూనెతోగాని, ఉల్లితోగాని చేర్చియు, నోటిపూతకు చందనముతోడను, వాతరక్తమున గొబ్బి లేక గాలిమిడికషాయముతోడను, దంతరోగములయందు చంద్రచేవ కషాయముతోడను సేవించవలయును. ఆవరణవాతమున కూతురు

బుడమ కషాయముతోడను, ఎక్కిళ్లయందును కడుపుబ్బరమందును ఉలవ కట్టుతోడను పుచ్చుకొనవలయు. అరటిపండ్లతోడను చెఱకురసముతోడను బుచ్చుకొనిన శుక్రవృద్ధియు బుద్ధికి బలంబును శరీరమునకు కాంతియుగల్గి బలము ఆయువు మొదలగువానిని వెంపొందించును. ముదిమితనముచేగలుగు ముడతలు నెఱయుట మొదలగునవి నశించును. మఱియు నీసిందూరమును పరిమాణనియమ మేర్పరచుకొని ప్రతిదినమును సేవించుచుండిన సర్వరోగములు నశించి శతాయుష్యము కలుగును అని చెప్పబడియున్నది.

## —౹ రసకర్పూర (భస్మ) ము. ౹—

క॥ రససంభవ ప్రకారము
వెససంస్కారములు నీకు వివరించితి నే।
రసకర్పూర ప్రభావము
పొసగగ వినిపింతు మౌని పుంగవ తెలియన్॥　　౭౯॥

వ్యా॥ ఆత్రేయమునిశ్రేష్ఠుడా? యింతవరకును నీకు రసోత్పత్తియు, రససంస్కారములును, దెలుపబడెను. ఇక రసమును కర్పూరముగజేయు విధానాదుల ప్రభావమును దెలిపెదను.

మ॥ లలిపంచాంగుళధూర్తచిత్రకపుమూలంబుల్ రసంబున్ గలిన్
గలియన్ నూరియుబిళ్ళచేసి యెదుటన్ గాల్పారగానిచ్చియు।
మ్ములనాబిళ్ళనుకుండలోపలను సాముద్రంబుపైబెట్టియిం।
పలరన్ వండిన రెండుజాములకు భస్మంబౌను శంఖాకృతిన్॥

వ్యా॥ ఆముదపువేళ్ళు, ఉమ్మెత్తవేళ్ళు, చిత్రమూలపువేళ్ళు, వీని యొక్క పైపొప్పరను పాదరసముతోచేర్చి కాంజికముతోనూరి బిళ్ళవలెజేసి గాలిపాటున నీడనెండించవలయును. పిమ్మట మొకకుండలో నుప్పువేర్చి యాబిళ్ళను వీలుగ నందుపైబెట్టి పైన కుండనుమూసి సందులేకుండ చక్కగ చీరజేసి యెండించి రెండుజాములువండిన శంఖమువలె తెల్లనగు భస్మమగును.

అయ్యది పైకుండ లోభాగమునంతయు తెల్లగ పువ్వువలె ఆవరించియుండును. దీనినే «భాండవ» «రసభాండవ» «ఇంగిలీకభాండవ» మనియు దేశీయ వైద్యులు వచించెదరు.

—॥ మరియొకవిధము. ॥—

గీ॥ పారదము పటికయు సైంధవంబు గదియ
పూర్వభాగాభివృద్ధిగా బూన్చి కలిని।
మెండుగానూరి రెండుజాల్ వండ నూర్ధ్వ
పాతనంబున సూతంబు భస్మమగును॥ ౫౧॥

వ్యా॥ ఒకభాగము పాదరసంబును, రెండుభాగములు పటికయు, నాల్గుభాగములు సైంధవలవణంబును జేర్చి కాంజికముననూరి యానష్టపిష్టి నొక కుండయందు అడుగునబూసి పైన మరియొకకుండను బోర్లించి చీరజేసి యెండించి రెండుజాములకాలము నూర్ధ్వపాతనయంత్రమున వండినచో రసము తెల్లగ భస్మమగును.

దీనికి సంస్కృతమగు మూలమున రసభస్మవిధానము మరియొకవిధ మునగూడ కనుపరచబడినది. ఎట్లన:—

«దేవదారుం హరిక్రాంతా మారనాళేన పేషయేత్।తద్ద్రవైస్సప్తధా సూతం కుర్యాన్మర్దితముద్ధృతం। తంసూతం కర్పరే దద్యాత్ సంలిప్తేత్పాత యంత్రకే। చుల్ల్యోపరిపచేద్దేవం భస్మస్యాల్లవణోపమమ్।» దేవదారువును విష్ణుక్రాంతమును కాంజికమున నూరి యాద్రవముతో నేడుసారులు రసము నెత్తుచు నూరి యాద్రవమును పాతనయంత్రమునబూసి వండిన రసము భస్మ మగును. అయ్యది ఉప్పువలె తెల్లనైయుండును.

—॥ రసభస్మసేవనాప్రకారము. ॥—

సీ॥ ప్రత్యేకమును సూతభస్మంబు నోమంబు
వెల్లుల్లి మహిషాక్షి తెల్లకాచు।
నిష్కమొక్కొక్కటి నన్నిటియెత్తు బెల్లంబు

కలియ మర్దనజేసి కడకు దీసి ।
ఏడుదినంబుల కెనయ పద్నాలుగు
మాత్రలుగాజేసి మాపు రేపు ।
దిగమ్రింగి తొమ్మిదవదినము మజ్జనమాడి
మరియేమిముట్టక మండలంబు ।
కందిపప్పన్నమును రొట్టె కాక నీళ్ళు
చప్పిడిగజేసి బైటసంచారముడిగి ।
యుండు జనులకు రోగంబు లుండవెరచు
దేహములు కాంతిగలిగియు లోహములుగ॥ గీ. ౨॥

వ్యా॥ రసభస్మము, ఓమము, వెల్లుల్లి (తెల్లగడ్డలు), మైసాక్షి, తెల్లనికామ, ఇవియన్నియు నొక్కొకటి నిష్కము (ఇరువదియెనిమిది గురిగింజల) పరిమాణముగ గ్రహించి నూరి వీనిమొత్తపు పరిమాణమునకుసరిగ (అనగా నైదు నిష్కముల పరిమాణముగల) బెల్లమునుచేర్చి బాగుగ కలియనూరి యెత్తి సమానములుగ పదునాలుగు మాత్రలజేసి ప్రతిదినమున నుదయము సాయంకాలము నొక్కొక్కమాత్రచొప్పున నేడుదినములు సేవింపవలయును. పిమ్మట నొకదినమువిడిచి తొమ్మిదవదినమున నభ్యంగనమును జేసికొని నలుబది దినములవరకు కందిపప్పు అన్నము రొట్టె కాచిననీరునుతప్ప నితరమేమియు భుజింపక కఠినపథ్యము నవలంబించి యెండయందును గాలిలోను సంచారమువిడిచి జాగ్రతగనుండవలయును. ఇట్టి * "కుటీప్రవేశము" అను రసాయన నియమము గలిగియుండువారలకు రోగములన్నియునశించి శరీరము లోహముతోసమానమై బలమును కాంతియుగలిగి యొప్పుచుండును.

—॥ రససేవనచే నివర్తించు వ్యాధులు. ॥—

మ॥ గళరోగంబులు వాతముల్ వ్రణములున్ గండంబులుం గుల్మముల్ । ప్రళయంబైన సవాఫిరంగులును శోఫశ్వాసలున్

* చరక-రసాయన చికిత్స జూడుమనది.

కాసలుఁ । తలపఁ మిక్కిలి దంతబాధలను శీతంబాదిగా
మాన్పి ని । ర్మలమా కాంతిని జేయు పాదరస భస్మంబౌను
మానీశ్వరా॥ ౯౩॥

వ్యా॥ పాదరస భస్మము గలగండాది రోగంబులను వాతరోగంబులను వ్రణములను గండమాలలను గుల్మవ్యాధులను మిగుల నభివృద్ధంబులైన సవాయి ఫిరంగరోగములను నంజులను శ్వాసవ్యాధులను కాసవ్యాధులను దంతబాధలను శీతలరోగంబులను నశింపంజేసి దేహమునకు మంచికాంతి నొసంగంజాలినదై యుండును.

— ఆపథ్యదోషంబులు, వాని ప్రతిరోధము. —

*సీ॥ అపరబుద్ధిని నరుం డపపథ్య మొనరింప
 సూతంబు కోపంబుచేత గెరలి ।
వాతంబు బుట్టించు వాంతులు వెడలించు
 [1]మొగి కాళ్ళుచేతులు మోర్లుబోవు ।
పరుగులబెట్టించు భ్రమయించు చిత్తంబు
 దేహంబు పగిలి విదాహ మొదవు ।
అటుగాన గంధకం బమర తమ్మలపాకు
 గుమ్మడినీళ్ళును నిమ్మకాయ ।

1. (గ) మోకాళ్లు.

* ఇచ్చట పై గీర - పద్యముచేత పాదరససేవనమునం దవపథ్యముం జేసిన వాతప్రధానములగు వ్యాధులు సర్వాఙ్గములయందును వ్యాపించునని తెలియుచున్నదిగాన అవి నివర్తించుటకై "సర్వాఙ్గేషువికారేషు స్వేదనం హిత

జీరకము గూడపాలయు చేంతరాసి
తీగ మువ్వాంచిరసమును తియ్యపెరుగు ।
నన్నమును బెట్టి పేడయు క్రమ్మరవేయ
రసము విరుగును రోగముల్ విసికిబోవు॥ ౯౪॥

వ్యా॥ రసభక్షణమును చేసిన మనుజుఁ డజ్ఞానముచే నపథ్యసేవనము నాచరించిన నాదోషంబున వాతరోగంబులను కలుగఁజేయును. వాంతులు వెడలును. మోకాళ్ళయందును మోచేతులయందును మోర్లుగట్టును. మతి చలించును. ఒడలు తెలియక యిటునటు పరువులు వెట్టునట్లు చేయును. శరీర మంతయు పగులును. విశేషముగ తాపముకలుగును. ఇట్టి దోషంబులు కలిగెనేని రసదోషంబులను శమింపఁజేయు గంధకము, తమలపాకులు గుమ్మడికాయనీరు, నిమ్మకాయ, జీలకఱ్ఱ, గూడపాల, చేంతరాశి, మువ్వాంచి (ముయ్యాకుపొన్న) రసము, అను నీవిరుగుడు మందులలో యథాయోగముగ నిచ్చి తియ్యనిపెరుగుతో కలిపిన యన్నము దినిపించి పేడను చక్కఁగ నుడికించి యొకబట్టలోనుంచి శరీరమునకు కాపుకాయవలెను. లేక పేడను నీటిలో బురదవలె గలిపి ఆవిరివచ్చునట్లు కాచి యాయావిరి శరీరమునకు బట్టవలెను. మరియు కొందరిమతమున పేడరసమును లోనికికూడ నిచ్చుచున్నట్లు దెలియుచున్నది. ఈప్రక్రియలను సంప్రదాయములనెరింగి యుపయోగించుచు రసవికారదోషములను శమింపజేయుచు మహాఫలమును గనపరచుట లోకవిదితము.

గీ॥ మందులను మానకుండిన సందుదెలిసి ।
చక్క దినిపించి మిక్కిలి యుక్కనైన ।

---

ముచ్యతే” అను చరకోక్తి ననుసరించి స్వేదనపద్ధతి చెప్పబడినది. “అందును పేడయుక్క్రమరవేయ” అని విశేషవిధిగ జెప్పియుండుటవలన “గోఖరోష్ట్రవరాహాశ్వ శకృద్భిః........శ్లైష్మికాన్ స్వేదయేత్పూర్వై ర్వాతి

బదిలముగనుంచి చప్పిడి కుడుచుపరచి।
మాన్పదగుదాని శాస్త్రసమ్మతిగ బుధులు॥ ౫౫॥

వ్యా॥ పైజెప్పబడిన విరుగుడుమందుల నుపయోగించినను రసముచే గల్గినబాధలు నివర్తించకుండునెడ నట్టి రసహరముల దినిపించి చప్పిడిపథ్యము బెట్టి గాఢముగ నావిరితోఁగూడిన గదిలోనునిచి యట్టిబాధల నివర్తింపనగును.

ఇచ్చట “ప్రత్యేకమునుసూత........అనుపద్యము మొదలుజేసి నాల్గుపద్యములకు సంస్కృతమూలము గానరాదు. ఈనాల్గుపద్యములలోని విషయములను ఈగ్రన్థకర్త తనయనుభవమును అక్కాలపు సంప్రదాయము లనుబట్టి యీగ్రంథమున జేర్చినట్లూహింపదగియున్నది.

## —॥ రసబంధనము. ॥—

సీ॥ సూతంబు బద్ధమారీతి సీకెరిగింతు
నవని శ్వేతాఖ్యంబు లైనగుంజ।

---

కాఽ సముపాచరేత్” అనియు; “తత్ర వస్త్రాన్తరితై రవస్త్రాన్తరితై ర్వాపిణ్డై ర్యథోక్తై రుపస్వేదనం సఙ్కరస్వేదః” అనియు చరకమున జెప్పినప్రకారము పేడముద్ద నుడికించి దానిచేసంకరస్వేదనము జేయవలెననియు దెలిసెడిని.

మఱియు పైజెప్పిన ఔషధములసేవించి సంకరస్వేదముచేసినను దోషము నివర్తించనిచో లోనికి గాలిచొరక మిక్కుటమగు నుక్కకల్గియుండు నింటిలోనునిచి స్వేదనము జేయవలెనని “చక్కదినిపించి మిక్కిలియుక్కనైన। బదిలముగనుంచి” యను ౫౫ పద్యముచే దెలుపబడియె. ఈస్వేదన ప్రకారము “వ్యాయామ ఉష్ణసదనం గురుప్రావరణం క్షుధా। బహుపానం భయక్రోధా వుపనాహాఽఽహవాఽఽతపాః। స్వేదయన్తి దశైతాని నరమగ్నిగుణాదృతే। ఇత్యుక్తోద్వివిధస్స్వేదః సంయుక్తోఽగ్నిగుణైర్నచ॥ ఏకాఙ్గసర్వాఙ్గగతఃస్నిగ్ధో రూక్షస్తథైవచ।” అను గ్రన్థముచే చరకమున వివరింపబడినది. ఈ విషయమును నింతకన్న విస్తరముగ చరకమున జూచునది.

దింటెనమోదుఁగ దేవదా*రిక్షువు
నర్ణవజిల్లేడు నిర్ణయముగ ।
అంకోల కట్టాకార్కములన పదిగల
[1]వీచెట్ల పూవుల విత్తులమరి ।
[2]కేసరముల సరిజూచి వేర్వేరుగా
[3]బొడిచేసి తత్త్వగంబువులచేత ।
నూరించి మరి యజా క్షీరంబుచేనూరి
యాముద్ద సూర్యపుటాగ్నిచేత ।
తైలంబుతులమెత్తు తగదీసి సూతంబు
పలమెత్తు మూసలోపలను బెట్టి ।
తైలంబు క్రిందమీఁదటనుంచి మానిమై
శుభముహూర్తమునందు శుద్ధిచేసి ।
యొకముహూర్తము నగ్నిలో నునిచివండ
పారదంబు నమోఘమై బద్ధమగును ।
దానిమహిమంబు లెన్నఁగా స్థాణుకైన
నలవిగాకుండు మానికులాగ్రగణ్య॥ ౫౬॥

— ఆశ్వాసాంతము. —

మాలిని॥ అగణితమణిభూషా వ్యాప్తదాసానుపోషా ।
జగదభినవవేషా చండసర్వాఘశోషా ।

---

* ఇచ్చట ఇక్షుశబ్దప్రయోగము చింత్యము.

(క) 1. చెట్లపూవులవిత్తులమరికేస. 2. రముసరిజూచి వేర్వేరుసగా బొడిజేసి. 3. తత్స్వమంబులచేత తగనమర్చి.

ఖగరమణతురంగా కౌస్తుభోద్దీపితాంగా ।
నిగమగిరినృసింహా నిత్యకల్యాణరంహా॥ ౫౭॥

గద్య॥ ఇది శ్రీమద్వైద్యవిద్యావినోద శ్రీవత్సగోత్రానుమోద వేదాన్తాచార్యపుత్ర లక్ష్మీనృసింహ ప్రసాదలబ్ధ కవితా చాతుర్య ముడుంబ వేంకటాచార్య విరచితంబైన రసప్రదీపికయను వైద్యశాస్త్రంబునందు పారదోత్పత్తియు తత్పరిభావంబును ద్వాదశదోషనిర్ణయంబును తచ్ఛుద్ధిప్రకారంబును దరదాంతర్గత రససంభవ ప్రకారంబును సిందూరభేదంబులును తత్పాకప్రమాణంబును రసభస్మప్రకారంబును తత్సేవావిధానంబును రసఘుటికా బంధనంబు నన్నది ప్రథమాశ్వాసము సమాప్తము.



వ్యా॥ ఇక రసము బద్ధమగు పద్ధతిని వివరించెద.—గురిగింజ, దింటెన, మోదుగ, దేవదారువు, చెరకు, గలిజేరు, జిల్లేడు, ఉమ్మెత్త, వాకుడు, అరక (కోలపాల), అను నీపది చెట్లయొక్క పువ్వులను కేసరములను తెల్లగ నుండువానినిగ గమనించి వానివిత్తులనుగ్రహించి ప్రత్యేకముగ పొడిచేసి పిదప నాయాచూర్ణములను వానివాని పట్టలరసమున వేర్వేరుగనూరి వానినన్నిటి నొకటిగ ముద్దజేసి యాముద్దను మరల మేకపాలతోనూరి యాముద్దను సూర్యపుటమున (ఎండకాకను) బెట్టి తైలమును దీయునది. అట్టి తైలమును తులమెత్తును ఒకపలము పాదరసంబును మూసలోబెట్టి పాదరసమునకు క్రిందను మీదను పైజెప్పిన తైలమునుబోసి మూసకు చీరమంటినిబూసి యెండించి యామూసనుఅగ్నిలోనుంచి సంప్రదాయముల నెరింగి యొకముహూర్తకాలము

పుటముబెట్టినచో పాదరసముబద్ధమై క్రియాభాగములయందు ఫలప్రదమైయుండును. బద్ధమైన యారసముయొక్క మహిమనువర్ణింప నీశ్వరునకైన నలవికాదు.

మరియు "బన్ధనమనుభూయాయముక్తిదో భవతి" "బద్ధః ఖేచరతాంకుర్యాత్" ఇవి మున్నగు గ్రన్థాన్తరవాక్యములచే బద్ధమైనరసము జరామరణరాహిత్యమునుగల్గించి దేహమును లోహతుల్యముగజేసి యోగసిద్ధినిగూడ కలుగజేసి యాకాశగమనాది శక్తినిగల్గించి తుదకు ముక్తిని గల్గించునని రసప్రభావము దెలియుచున్నయది.

మరియు రసబంధములు అనేకవిధములుగ తన్త్రాన్తరములలో గానవచ్చుచున్నవి. అందు ఇచ్చట జెప్పబడిన రసబంధము మూర్తిబంధమని జెప్పదగియున్నది, "యో దివ్యమూలికాభిశ్చ కృతోఽత్యగ్నిసహో రసః। వినాఽభ్రిజారణాత్సస్యా న్మూర్తిబద్ధో మహారసః। అయం హి జార్యమాణస్తు నాగ్నినాక్షీయతే రసః। యోజితస్సర్వయోగేషు నిరౌపమ్యఫలప్రదః॥" అని మూర్తిబంధలక్షణము గనబడుచున్నది. అభ్రికజారణము జేయక కేవలము దివ్యములగు మూలికల సంబంధమాత్రముచేతనే రసమును అగ్నితాపమునకు సహించునటుల చేయబడు బంధము మూర్తిబంధ మనబడుననియు, ఇత్తెరంగున బద్ధమైన రసము జారణకాలములయందు కొంచెమైన తగ్గక ఔషధయోగములయందు జేర్చునపుడు అసదృశమగు ఫలమును జేయుననియు తాత్పర్యము,

సంస్కృతమూలమున రసబంధనమున కనంతరమున శోధితరసగుణములిట్లు చెప్పబడినవి. "పారదః క్రిమికుష్ఠఘ్నశ్చక్షుష్యో బలవర్ధనః। దీపనః పాచనో వృష్య స్త్రిదోషఘ్నో రసాయనః॥ పారదస్సకలరోగనాశనః షడ్రసో నిఖిలయోగవాహకః। పఞ్చభూతమయ ఇత్యుదాహృతః కేన తద్గుణగణో విగణ్యతే॥" పారదము క్రిములను కుష్ఠవ్యాధిని నశింపజేయును, నేత్రములకు హితమైనది. బలమును వృద్ధినందించును. అగ్నిదీప్తినికలుగజేయును. పాచనముచేయును. వాజీకరము. వాతపిత్తకఫంబు లనుదోషంబులహరించును. వలీపలితాది జరాదోషంబుల నశింపజేయును. సమస్తరోగముల నశింపంజేయును,

ఆరువిధములగు మధురాది రసములను కలిగియుండును. దేనియందుజేర్చిన నా వస్తువుయొక్క గుణమును పెంపొందించును. పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మకంబులగు పంచభూతంబులయొక్కయు అంశంబులంగలిగియుండును. కావున నిట్టి రసముయొక్క గుణమెవ్వరిచే లెక్కింపబడగలిగియుండును అని కనుబడుచున్నది. ఆభాగ మాంధ్రీకరణంబున నగుపడదు.

ఇతి శ్రీమన్మహీశూర మహారాజధానీ మధ్యవిద్యోతమాన సర్వతోభద్ర దివ్య
రత్న సింహాసనాధీశ్వర శ్రీమద్రాజాధిరాజేత్యాది బిరుదావళీ విరాజమాన
శ్రీశ్రీకృష్ణ రాజసార్వభౌమ సంస్థానాస్థానాయుర్వేద విద్వద్వైద్య
ప్రకాణ్డ శ్రీమద్రాజకీయ సంస్కృత మహాపాఠశాలాయుర్వేద
మహోపాధ్యాయ అగరం. పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసే
వాసమాసాదితాయుర్వేదవిద్యా సత్సంప్రదాయ గౌతమగోత్ర
విరాజమాన దీవ్యన్వవాయ శ్రీకృష్ణమాచార్యపౌత్ర కోదండ
రామాధ్వరి దౌహిత్ర రామకృష్ణార్య రాజ్యలక్ష్మ్యమ్బా
తనూభవ సకల సహృదయ విధేయ శ్రీమత్పంచమజార్జి
చక్రవర్తి ప్రదత్త "వైద్యరత్న" బిరుదావళీ విరాజ
మాన "ఆయుర్వేదమార్తాండ" భిషఙ్మణి,
పండిత గోపాలాచార్య విరచితంబైన
"ప్రభ" యను రసప్రదీపికాన్ధ్ర
వ్యాఖ్యానమున ప్రథమాశ్వాసము
సమాప్తము.

# ద్వితీయాశ్వాసము.

మొదటి యాశ్వాసంబున పాదరసంబును దానిలక్షణంబులును దాని సంస్కారంబులును మొదలగు పాదరసవిషయముల నన్నిటిని జెప్పి యీ యాశ్వాసమున మహారసములు ఉపరసములు సాధారణరసంబులను వానిలక్షణంబులును వానియుపయోగంబులును మొదలగువానిని చెప్పుచున్నాడు.

క॥ శ్రీలక్ష్మీముఖ పద్మవి
లోల సుధాసాంద్ర చారులోచన సకల।
క్ష్మాలోల విమలసద్గుణ
శీలా వేదాద్రినారసిమ్హానృపాలా॥ ౧॥

వ॥ అవధరింపు మశ్వినులు ధన్వంతరికి జెప్పిన తెరంగున నగస్త్యుం డాత్రేయున కిట్లనియె॥ ౨॥

వ్యా॥ స్పష్టము.

—॥ అభ్రికగంధకముల యుత్పత్తి. ॥—

..............................................3॥

..............................................౪॥

..............................................౫॥

* ఇచ్చట 3-౪-౫-సంఖ్యలుగల పద్యములు మూడును అభ్రికగంధకములయుత్పత్తిని బోధించు నర్థముతో గ్రంథమున జెప్పబడినవి. ఆపద్యములు వ్రీడాజనకంబులగుటం జేసి యియ్యెడ విడువంబడియె. ఆ మూడు పద్యములచేత అభ్రికగంధకములు రెండును మహారసములకును ఉపరసములకును సాధారణరసములకును ప్రధానకారణములని స్పష్టమగుచున్నది.

—॥ మహారసములు ॥—

గీ॥ ఘనతపోనిధి యభ్రవైక్రాన్తమాక్షి
కములు విమలాఖ్యమును శైలజమును సస్య ।
కంబు చపలాహ్వయము రసకంబు రస మ
హారసంబులు మౌనికులాగ్రగణ్య॥ ౬॥

వ్యా॥ తపోనిధియగు నోయాత్రేయమునివర! అభ్రకము వైక్రాంతము మాక్షికము విమలము శిలాజతువు తుత్థము చపలము కఫరియను నీయెనిమిదియు మహారసంబు లనబడును.

—॥ అభ్రకము, దానిభేదములు. ॥—

సీ। అం దభ్రకంబు శ్వేతాదివర్ణములచే
నాల్గువిధంబుల నమరుచుండు ।
మహీ పినాకము నాగమణ్డూకవజ్రంబు
లను నవి గాఢాగ్నియందు గాచ ।
పొరలెత్తి హీనమై పోవు పినాకంబు
నాగంబు [1]రోజు పెన్నాగు రీతి ।
వడి కప్పవలె గంతులిడును మణ్డూకంబు
వజ్రంబు [2]స్వచ్ఛభావమున నుండు ।
ఘనపినాకంబు మల మరికట్టి చంపు
నలస కుష్ఠువుజేయు నాగాభ్రకంబు ।
శస్త్రములచేతనైన నసాధ్యమైన
నశ్మరిని జేయు మండుకా [3]ఖ్యాభ్రకంబు॥ ౬॥

(క) 1. నాపెనునాగు. 2. వజ్రంబుభాతి. (గ) 3. భ్రకముభువిని.

వ్యా॥ అందభ్రకము తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు, ననువర్ణంబుల భేదముచేత నాలుగువిధములై క్రమముగ పినాకము నాగము మండూకము వజ్రము నను పేరులచే నొప్పుచుండును. అందు పినాకాభ్రకమును నిప్పులయం దుంచి కాచినయెడల పొరలులేచి నశించిపోవును. నాగాభ్రకమును నిప్పుల యందూదిన పెద్దపామువలె బుసలగొట్టును. మండూకాభ్రకమును కాల్చిన నొకచో నిలువక కప్పవలె దుముకులాడును. వజ్రాభ్రకమును నిప్పులయందుం చితిమేని పైజెప్పబడిన వికారముల నేనినిబొందక వజ్రమువలెస్వచ్ఛమై కాంతి గలిగియుండును. అందు పినాకాభ్రకమును ఔషధములయం దుపయోగించి సేవించినచో మలబద్ధమును కలుగజేసి మృత్యువును కలుగజేయును. నాగా భ్రకమును సేవించిన కుష్ఠవ్యాధి సంభవించును. మండూకమను పేరునొప్పు నభ్రకమును సేవించినచో శస్త్రకర్మల జేసినను సాధ్యముకాని యశ్మరీ రోగమును పుట్టించును.

—। వజ్రాభ్రకము ।—

క॥ మునిపుంగవ వజ్రాభ్రక
మనుదినముఁ సేవ జేయు నట్టిజనంబుల్ ।
ఘనరోగంబుల బాయుచు
మనుదురు దేహములు లోహమయములుగాఁగ ॥ ౭॥

వ్యా॥ ఆత్రేయముని శ్రేష్ఠుడా! శాస్త్రములయందు చెప్పబడినచొప్పున సంస్కరింపబడిన వజ్రాభ్రకమును విధివిహితమగు ప్రమాణము నేర్పరచుకొని సేవించుచుండిన నట్టిమనుష్యులకు మహారోగంబులన్నియు నశించి దేహములు లోహములవలె దృఢములై వారు చిరకాలము జీవించెదరు.

ఇచ్చట "చతుర్విధం వరం వ్యోమ యద్యప్యుక్తం రసాయనే। తథాపి కృష్ణవర్ణాభం కోటికోటి గుణాధికమ్॥ స్నిగ్ధం పృథుదళం వర్ణసంయుక్తం భారతోఽధికమ్ । సుఖనిర్మోచ్యపత్రం చ తదభ్రం శస్తమీరితమ్॥" అను

దీనికి మూలమగు సంస్కృతముచే శ్వేత రక్త పీత కృష్ణవర్ణ భేదంబులచే నభ్రకము నాల్గువిధములనియు; నందు శ్వేతవర్ణంబగు నభ్రకము రజతయోగంబులయందును రక్తవర్ణంబగునది రసాదిరంజనంబులయందును పీతమగునది పీత (స్వర్ణకరణ) కృత్యంబులయందును నుపయోగింపందగినవనియు; నాలుగువిధంబులగు నభ్రకంబులును రసాయనంబులయం దుపయోగింపదగినవని శాస్త్రంబులయందు చెప్పబడియున్నను రసాయనంబులయందు కృష్ణవర్ణంబగు నభ్రకంబు చేర్చుకొనిన తక్కినదానికంటె ననేకభాగములధికమగు గుణంబుల నిచ్చుననియు; నునుపైగొప్ప రేకులుగలిగి మంచిరంగుకలిగి బరువుగలిగి రేకులను సులభముగ వేరుపరచదగియుండు నభ్రకము ప్రశస్తమనియు నాంధ్రమునకంటె విశేషము తెలియబడుచున్నది.

—॥ ధాన్యాభ్రకము, అభ్రకశోధనము, మారణము. ॥—

సీ॥ వజ్రాభ్రకము కృష్ణవర్ణంబు మెత్తగా
పొడిజేసి [1]కలిలోన బోసి వస్త్రు ।
కలిపి గొంగటను చేకొలదిని వడబోసి
పదునార్చి జిల్లేడుపాలచేత ।
[2]నూరుచు బిళ్ళ గాల్పారిచి యాక్రింద
పైని జిల్లెడాకు పరిచి యేదు ।
గజపుటా లిడి వటక్వాథంబుచే మూడు
పుటముల నభ్రంబు పొలుపు మిగులు ।
మరియొకవిధంబు వినుము కుమారిరసము

1. (ఖ) నీళ్ళలో. 2. (క) బిళ్ళగార్పారిన జిల్లెడాకులచేత। గజపుటంబులు నేడు కడునమర్చి । వటక్వాథమున మూడు పుటములు వేయగ నభ్రంబు శుద్ధమై యమరుచుండు.

మేకనెత్తురు గంగరావాకు దుగ్ధ।
త్రయము వటశృంగముల *నృమూత్రమున నూరు
పుటము లేసిన మృతినొంది పొలుపుగనును.    ౮॥

వ్యా॥ నల్లనివర్ణము కలిగియుండు వజ్రాభ్రకమును మెత్తగా నలియగొట్టి కాంజికములోబోసి నాన్చి అందు వరిధాన్యముకలిపి గొంగటియందుగట్టి బాగుగా పెనవేసి మెలియబెట్టుచు నలిపిన క్రింద మెత్తనైన యభ్రకపుపొడి రాలును. ఇదియ ధాన్యాభ్రకమనబడును. దీనిని తడియార్చి జిల్లేడుపాలు పోసినూరి బిళ్ళగాజేసి యాబిళ్ళను నీడనెండించి బిళ్ళకుపైభాగమునను క్రింది భాగమునను జిల్లేడాకులుపరిచియమర్చి మూకుటిలోబెట్టి పైనమూకుడుమూసి చీరజేసి యెండించి సంప్రదాయముల ననుసరించి గజపుటము వేయునది. ఇత్తెరంగున జిల్లెడుపాలచే నూరుచునేడు గజపుటములు వేయవలయును. పిమ్మట మఱ్ఱియూడల కషాయంబునుబోసి నూరుచు బిళ్ళజేసి మూడు గజపుటము లిడవలయును. ఇట్లుజేసిన యభ్రకము శుద్ధమైన భస్మమగును. మరియుం కలబందరసము మేకనెత్తురు గంగరావియాకు క్షీరత్రయము (ఆవులు, ఎనుములు, మేకలు అనునీ మూడిటిపాలు) మఱ్ఱిమొగ్గలు మనుష్యమూత్రము వీనితో నూరుచు నూరుగజపుటంబులుబెట్టిన అభ్రకము నిశ్చంద్రికముగ భస్మమగును.

—( అభ్రకభస్మము ప్రకారాంతరము )—

అగస్త్యసంప్రదాయమున ధాన్యాభ్రకమును కుక్కపొగాకు రసముచే నూరి బిళ్లజేసియెండించి శరావసంపుటంబుననునిచి చీరచేసి యెండించి పుటమును వేయునది. ఈరీతి పదిపుటములు వేసిన నిశ్చంద్రికముగా భస్మమగును.ఇయ్యది మధుమేహములయందమోఘమగు గుణమునిచ్చును. నాయనుభవమున విశేషముగ వాడుకయైయున్నది.

---

*ఇచ్చట గ్రంథకర్త తనస్వానుభవమును అప్పటి సంప్రదాయజ్ఞుల జ్ఞానగరిమను జూపుటకై పూర్వరసతంత్రంబులంగానని నూతనవిలక్షణ ప్రయోగమగు నృమూత్రసంయోగముచే నభ్రకమారణమును విశదపరిచినాడు.

—॥ అభ్రకమున కనుపానములు, దానిచేనివర్తించు వ్యాధులు. ॥—

చ॥ ఘృతమును శొంఠి పిప్పలి మిరెంబులతోడుత నభ్రకంబు।
సంతతమునుచిన్న మెత్తుగొన దారుణమౌ కఫవాతపిత్తసం।
యుతగ్రహణీక్షయంబు లవియుక్తప్రమేహ గుదాంకురంబు
గతముగ జేసిదీపనము గల్గజేయు నమోఘవీర్యమై॥ [౧౬॥

వ్యా॥ నేయియు, శొంఠి,పిప్పలి, మిరియంబులును అనుపానముగ నేర్ప రచి తడవకొక చిన్న మెత్తు (నాలుగు గురిగింజలయెత్తు) మోతాదుగ నేర్పరచి పైజెప్పబడినతెరంగున భస్మము చేయబడిన యభ్రకమును సేవించిన అత్యధిక మగు కఫవాతపిత్తము లను దోషత్రయముయొక్క ప్రకోపముచే నేర్పడిన గ్రహణులు క్షయవ్యాధులు క్రూరమగు ప్రమేహములు మూలవ్యాధులు వీని నన్నిటిని నివర్తింపజేసి మంచి దీపనశక్తి నిచ్చును.

మఱియు ననుపానభేదములనెఱింగి యుపయోగించిన మేహవ్యాధులు నివర్తించును.

—॥ అభ్రకసత్వపాతనవిధానము. ॥—

ఇందుజెప్పంబడని యభ్రకసత్వపాతన ద్రావణప్రకారముల తన్త్రాన్తరములనున్న వానిని పాఠకులబోధకై సులభమగు కొన్నిటినిందు వ్రాసినాడ.

శ్రీరసరత్నసముచ్చయము.—(౧). వజ్రాభ్రకమునకు నాల్గవపాలు వెలిగారమును జేర్చి నేలతాటిగడ్డల రసమునుబోసి మెత్తగనూరి చిన్నచిన్న ఉండలుజేసి యెండించి సత్వపాతనమూషయందుంచి యద్దాని కోష్ఠియంత్రము (కొలిమి) న నునిచి పైనను క్రిందను బొగ్గులుబెట్టి గాఢాగ్నినియూదిన చో నభ్రకమునుండి సత్వము వెడలును.

(౨) ధాన్యాభ్రకముతో వెలిగారమును జేర్చి యందు కసివెందరసము తుంగగడ్డల కషాయము దనియాలకషాయము అడ్డసరము తెల్లగలిజేరు పొన్నగంటి కాకర హంసపాది అను వీని యాకులరసములలో ప్రతియొకదానిని

ప్రత్యేకముగ జేర్చి నూరి బిళ్ల జేసి యెండ నెండించునది. ఇత్తెరంగున వరుసగా నన్నిరసములను జేర్చి నూరినపిదప ఒకపలము గోధూమచూర్ణమును అభ్రకమున కెనిమిదవపాలు క్షుద్రమత్స్యము (చిన్న చేప)లును వెలిగారమును జేర్చి పంచాజము (మేకలపాలు నెయ్యి పెరుగు పేడ మూత్రము)ను పంచగవ్యమును పంచమాహిషము(గేదెపాలు నెయ్యి పెరుగు పేడ మూత్రము) ను ఒక్కొకదానిని కలిపినూరి యెండబెట్టుచు వరుసగ నన్నిటితో ప్రత్యేకమునూరునది. పిమ్మట నాపిష్టమునుదీసి విషముష్టిగింజలకన్న కొంచెము పెద్దవిగనుండునట్లు ఉండలు జేసి ఎండించి యాయుండలను కోష్ఠియంత్రమునబెట్టి గాఢాగ్నిని యూదినచో పైయౌషధములతో జేరియుండిన యభ్రక సత్వము క్రిందిపాత్రలోనికి దిగును, అందు మూసలో పైభాగముననుండు కిట్టము (చిట్టము) ను గ్రహించి చూర్ణము జేసి యందుండు అభ్రకపురవలను (నలుసులను) దీసికొనునది. మరల నాకిట్టచూర్ణమున వెలిగారమును కొంచెముగ జేర్చి యావుపేడనుకలిపి నూరి మునుపటివలె నుండలు జేసి పైజెప్పినరీతిగ కోష్ఠియంత్రముననునిచి బొగ్గులయొక్క గాఢాగ్ని చేనూదునది. పైజెప్పినప్రకారము యభ్రకమునకు వస్తువులను జేర్చి సత్వము వెడలువరకును రెండుమూడు తడవలు గాఢాగ్నిని కోష్ఠియంత్రముచే సత్వము వెడలించునది. పిదప మరల నాకిట్టమునుదీసి పొడి జేసి యందుండి సత్వమును దీయునది. పిమ్మట నాసత్వరూపమునందిన కణములనన్నిటిని శోధనీయగణద్రవ్యములజేర్చి యమ్లకాంజికమున (పులిగంజిలో) కలిపి యుడికించిన యాసత్వరూపమునందిన యౌషధము శుద్ధమై రసప్రక్రియలయందును రసాయనయోగములయందును జేర్చుటకు దగియుండును.

మఱియు రసార్ణవము:— వెన్నవలె మృదువైన ధాన్యాభ్రకచూర్ణము ముప్పదిపలములును చిన్న చేపలు రెండుపలంబులును నువ్వులపిండి (తెలికపిండి) యొకపలంబును గురిగింజలచూర్ణము మూడుపలములును అభ్రకమునకు నాల్గవపాలు వెలిగారంబునుగ్రహించి వీనినన్నిటిని ఒకటిగ జేర్చి యందు కొంచెము గోధుమపిండిని కూడకలిపి పంచగవ్యమున (గోమూత్రము గోమయము గోక్షీరము గోఘృతము గోదధి) భావనజేసి యుండలు జేసి యెండించి సత్వపాతన

మూషయందుంచి కోష్ఠికాయంత్రమున (కొలిమిలో) బెట్టి రెండుతిత్తుల దగిలించి గాఢాగ్నియగునట్లూదినచో నభ్రకమునుండి సత్త్వము వెడలును. ఇత్తెరంగుననే తక్కిన మహారసాదులనుకూడ తీవ్రాగ్నిలో కోష్ఠయంత్రమునబెట్టి యూదినయెడ వానినుండి సత్త్వము వెడలును. ఈ సత్త్వపాతనప్రకారము ఆనన్దకన్దము మొదలగు గ్రన్థములయందు ననేకభంగుల గనబడుచున్నది.

## —॥ అభ్రకద్రుతి. ॥—

రసేన్ద్రభాస్కరము:— ధాన్యాభ్రకమును అగసియాకు రసమున చక్కగ మర్దనముజేసి ముద్దజేసి కందగెడ్డయందు తొరటజేసి యందు పైముద్దనుబెట్టి దాని నొకకుండలోనునిచి మూతమూసి సందులులేకుండ చీరమట్టిచేబిగించి యెండబెట్టి ఆవుపేడచేతను ఆవుమూత్రముచేతను ఊరియుండు ఆవులను కట్టివేయు ప్రదేశమున రెండుమూరలలోతు గుంటత్రవ్వి యందు పైయా పథభాండమునునిచి మట్టిచే బూడ్చునది. ఒకమాసము కడచినపిమ్మట త్రవ్వి యాభాండమును వెలికిందీసి పైమూతను జాగ్రతగ విప్పవలెను. అందుండు అభ్రకము ద్రవించి పాదరసమునుబోలి తెల్లనై నీటివలె తేటగానుండును.

రసార్ణవము:—(౧) క్రొత్తకుండలో నగ్నిజారమును వేసి దానిపై ధాన్యాభ్రకము నునిచిపైన నగ్నిజారమునుకప్పి యాభాండమును కోష్ఠియంత్రమునబెట్టి తోలుతిత్తులతో నూదినచో ముత్యములబోలె స్వచ్ఛముగ నభ్రకము ద్రవించును.

(౨) ధాన్యాభ్రకమును కాంజికమునందు పలుమారు భావనజేసి దానిని నీరుప్రబ్బలి క్షారోదకము నుంచబడిన భాండమున నునిచి యాభాండమును మూకుటిచేమూసి చీరజేసి యెండించి యాభాండమును కొంతకాలము భూస్థాపితము జేసిన నభ్రకము ద్రవించును.

(3) వజ్రాభ్రకమును మిక్కిలి సన్ననిపొరలుగ విడదీసి అగసియాకు రసమున నేడుదినములు నానబెట్టి పిమ్మట మ్రానిపసుపును మిరియములను చాగగెడ్డరసముననూరి యారేకులకు బూసియెండబెట్టి పిమ్మట

సౌవర్చలలవణమును నల్లేరు రసముననూరి పైయభ్రికపు రేకులకుబూసి యా రేకులను మూసటిలోనుంచి పైనమూవడుమూసి కొలిమిలోబెట్టి యూదినచో నభ్రికము జలమువలె ద్రవరూపమునందును.

—॥ వైక్రాంతలక్షణము. ॥—

క॥ విను * వైక్రాంతము పక్షము
లెనిమిది కోణంబు లారు నెనిమిది యంచుల్ ।
దనరగ నష్టవిధంబుల
ఘనవర్ణము గలిగి బరువుగలదై యుండున్ ॥   ౧౦॥

వ్యా॥ వైక్రాంతమున కెనిమిదిపలకలును ఆరుమూలలును ఎనిమిదియంచులునుండును. ఇది చట్టుమగురంగును బరువునుగలిగి యుండును.

మఱియు దీని సంస్కృతమూలమున "శ్వేతోర క్తశ్చ పీతశ్చ నీలః పారావతచ్ఛవిః । శ్యామలఃకృష్ణవర్ణశ్చ కర్బురశ్చాష్టధా హి సః" అనియుండుటవలన నీవైక్రాన్తము తెలుపు ఎఱుపు పసుపు నీలము పావురాయివన్నె మేఘవర్ణము నలుపు కర్బురము (చిత్రవర్ణము) అను రంగులయొక్క భేదములచే నెనిమిదివిధములనుండునని తెలియుచున్నది.

—॥ వైక్రాంతశుద్ధి, భస్మము, దాని యుపయోగము. ॥—

సీ॥ ఉలవకట్టున దినం బుడికించి కొలిమిలో
కాచి మూత్రములోన ద్రోచిమఱియు ।
నిమ్మపులుసున గంధకమ్మున నెనిమిది

---

* ప్రకృతముపయోగించునది యారు పలకలును ఆరుఅంచులుగలదిగను న్నయది. అనేకప్రదేశముల దీనినే వైక్రాంతముగ నుపయోగించెదరు. ఇయ్యది గుంటూరు మండలమున కారంపూడియందు విశేషముగదొరకును. ఇయ్యది గూడ గ్రంథమునజెప్పిన గుణములను అనుభవమున గలిగియున్నది.

పుటముల భస్మమై పొలుపుమిగులు ।
వజ్రంబునకు సాటి వచ్చువైక్రాంతంబు
నిడవచ్చు వజ్రంబు నిడెడుచోట ।
ననుపానయుక్తిని దినమువైక్రాంతంబు
పూటకు వల్లంబు బుచ్చుకొనిన ।
నాయురారోగ్యకరము వీర్యాభివృద్ధి
గలిగి రోగంబులెల్లను తొలగద్రోసి ।
యరుచి నణగించు క్షయముల నపహరించు
పీడలను బాపి జనులకు బ్రీతి జేయు॥ ౧౧॥

వ్యా॥ వైక్రాంతమును ఉలవలకషాయంబునం దొకదిన ముడికించి కొలిమిలోబెట్టి కాల్చి గోమూత్రమునందుముంచిన శుద్ధమగును. తరువాత గంధకమునుచేర్చి నిమ్మకాయలరసముతో మర్దించుచు నెనిమిది పుటములు వేసిన వైక్రాంతము భస్మమగును. వైక్రాన్తము వజ్రముతో సమానమగు పనినిచేయును. కావున వజ్రము నుపయోగించు చోటులలోనెల్ల దీని నుపయోగింపవచ్చును. మరియు ఉచితమగు ననుపానమును చేర్చి పూటకు చిన్న మెత్తుచొప్పున ప్రతిదినమును ఈవైక్రాంతభస్మమును సేవించిన రోగంబుల నన్నిటిని పోగొట్టి ఆరోగ్యమునుకలిగించి వీర్యవృద్ధినిచేసి దీర్ఘాయుష్యము నిచ్చును. అరుచినిపోగొట్టును. క్షయవ్యాధుల నశింపజేయును. సమస్తబాధలను తొలగించును. ఇట్టి భస్మము జనులకు సర్వవిధముల సంతసమునొనగూర్చును.

మఱియు నీభస్మమును నేను క్రూరమగు మధుమేహరోగులకును క్షయరోగులకును పలువుర కుపయోగించితిని. అనేకవిధముల చక్కనిగుణమును దెలిసికొంటిని.

—॥ వైక్రాన్తసత్వపాతనము. ॥—

రసరత్నసముచ్చయము:— మొక్కపుచెట్టు మొరళి మోదుగ అను నీచెట్లనుండి క్షారములదీసి దానిని క్షారోదకకల్పనా ప్రకారముగ కషాయము జేసి యాక్షారోదకమునందును గోమూత్రమునందును శుద్ధిజేసిన వైక్రాన్తమును తొలుత భావనజేసి దానిని మెత్తగ చూర్ణముజేసి భద్రముజేయునది, పిదప అడవికందగడ్డ పసుపు త్రిఫలములు అనువానిని జేర్చి కల్కముజేసి యాకల్కమును నవాసారమును వెలిగారమును లక్కను చూర్ణముజేసి యాచూర్ణములను తొలుత భావనజేసిన వైక్రాన్తచూర్ణమును ఒకటిగ జేర్చి మేషశృంగి (దుష్టుపాకు) రసముచేనూరి ముద్దజేసి యాముద్దను మూసలోబెట్టి కోష్ఠియంత్రమున గాఢాగ్నిలోబెట్టి యూదిన వైక్రాన్తసత్వము ఆమూసలోనే పడును. అట్టి సత్వరూపమైన చూర్ణమును పైజెప్పినప్రకారము నూరి మాత్రలజేసి యెండించి యామాత్రలను పైజెప్పిన యన్త్రమునబెట్టి మరల నొకగడియకాల మూదినచో శుభ్రమగు సత్వమేర్పడును.

రసార్ణవము:— శుద్ధిజేసిన వైక్రాన్తమును పొడిజేసి అడవికందగడ్డ జెముడు రసములను వెవ్వేరుగనూరి అందు ఎనుమువెన్నను తేనెను జేర్చి ముద్దజేసి యా ముద్దను మూసలోబెట్టి చీలజేసి కోష్ఠియంత్రముననునిచి యూదిన యెడ వైక్రాన్తమునుండి ఇంద్రగోపపు పురుగువలె నెఱ్ఱనైనసత్వము వెడలును.

—॥ వైక్రాన్తద్రుతి. ॥—

శుద్ధిజేసిన వైక్రాన్తమును చూర్ణముజేసి యందు సైన్ధవలవణమును పాదరసమును జేర్చి మొగిలిచండ్లరసమున స్వేదనము జేసినచో వైక్రాన్తము రసమువలె ద్రవరూపము నొందును.

—॥ మాక్షికము, శుద్ధి, భస్మము. ॥—

సీ॥ ధర మాక్షికము ద్వివిధం బగు హేమమా
క్షికమును తారమాక్షిక మనంగ।

హేమమాక్షిక మర్ధహేమాభమై యొప్పు
తారమాక్షికము రజతప్రభంబు।
రంభాద్రవం బమ్లరసము కుళుత్థకో
ద్రవకటుత్రయ నృమూత్రములు గూర్చి।
కందలోపల మాక్షికము బెట్టి డోలయం
త్రంబున వండ దోషంబు లణగు।
నాముదము చేత నాల్గు పుటాలు దీర్చి
మాతులుంగరసంబున మాక్షికంబు।
సైంధవము లెస్స మర్దించి [1]సరవి లోహ
పాత్రమున నుంచ పరిశుద్ధభస్మ మగును॥ ౧౨॥

వ్యా॥ మాక్షికము హేమ మాక్షికమనియు, తార మాక్షికమనియు రెండుతెరంగులనుండును. అందు హేమమాక్షికము సగము వన్నెబంగారు కలెనుండును. తారమాక్షికము వెండివంటి కాంతికలదై యుండును. (అందు హేమమాక్షికము గుణాధికము). ఈమాక్షికమును కండగడ్డలోనునిచి అరటి దుంపరసము అమ్లవర్గముల రసములు ఉలవలు ఆళ్ళు శొంఠి పిప్పలి మిరియములు అనునీద్రవ్యముల క్వాథము నరమూత్రము అనునీద్రవములలో నెద్దానియందైన డోలయందుంచి వండిన దోషములబాసి శుద్ధమగును. దాని నాముదముతోనూరి నాలుగుపుటములువైచి మాదీఫలముల రసంబున నామాక్షికమును సైన్ధవలవణమునువైచి బాగుగనూరి లోహపాత్రయందునిచి పైనమూసి పుటము బెట్టిన పరిశుద్ధముగ భస్మమగును.

## —॥ మాక్షికభస్మగుణము. ॥—

క॥ నిరతము మాక్షికభస్మము
సరసత సేవింప రుజ విషా[2]దు లణంగున్।

---

1. (క) సకల. 2. దములణగున్.

ధరగల రసాయనాగ్రే
సరమై రసమునకు ప్రాణసమమై యుండున్॥ ౧౩॥

వ్యా॥ మాక్షికభస్మమును తగు పరిమాణమున ప్రతిదినము సేవించుచుండిన రోగములును విషదోషంబులును నశించును. మరియు నిది భూమియందుండు సర్వరసాయనంబులలో నుత్తమమై రసధాతువునకు ప్రాణమువలె బలమునుచేయునదియై యొప్పుచుండును.

—॥ మాక్షికసత్త్వపాతనము. ॥—

రసరత్నసముచ్చయము:— శుద్ధిజేసిన స్వర్ణమాక్షికమును చూర్ణముజేసి దానికి ముప్పదియవపాలు శుద్ధిజేసిన సీసమును జేర్చి క్షారగణమున జెప్పిన ముష్కకాదిక్షారోదకములచేతను అమ్లవర్గమున జెప్పిన యమ్లరసములచేతను చక్కగ మర్దనముజేసి పిదప ముద్దజేసి యెండించి దానిని మూసలోబెట్టి పైన మూత మూయక యామూసను కొలిమిలోనునిచి యూదినచో నందుండి సత్త్వము వెడలును. ఆసత్త్వమును గ్రహించి పైజెప్పినప్రకారము మరల క్షారాదిద్రవములచే నేడుమార్లు మర్దనముజేయుచు నేడుమార్లు కొలిమిలోబెట్టి యూదినచో సీసముచే సంక్రమించినదోషము నివర్తించి శుద్ధమగును.

మఱియు మాక్షికమును తేనె ఆముదము గోమూత్రము గోఘృతము అరటిదుంపరసము అను నీద్రవములయందు మాటిమాటికి భావనజేసి మూసలోబెట్టి యగ్నిలోనునిచి యూదినచో నందుండి బంగరుచూర్ణమువంటి మృదువైన సత్త్వము వెడలును.

—॥ మాక్షిక ద్రుతి. ॥—

గురిగింజలను వెలిగారమును పొడిచేసి యందు ఆముదమును తేనెను కలిపి అందు స్వర్ణమాక్షికసత్త్వమునుజేర్చి కొలిమిలోనునిచి యూదిన మాక్షికము ద్రవించును.

—॥ విమల లక్షణము ॥—

క॥ విను విమలము త్రివిధంబై
కనుపట్టును హేమతారకాంస్యాభముగా।
దనరుచు వర్తులమై మెరు
పును నంచులు గలిగి కోణములతో నొప్పున్॥ ౧౪॥

వ్యా॥ విమలము బంగారువన్నెగలదిగను వెండిరంగుగలదిగను కంచువలె నుండునదిగను మూడువిధములనుండును. అయ్యది గుండ్రనై మెరపుగలిగి అంచులును పలకలును గలిగియుండును.

—॥ విమలము శుద్ధి, భస్మము. ॥—

గీ॥ వరుసతోడుత విమలము వావిలాకు
రసమునను జామువండిన బొసగుశుద్ధి।
గంధకము నిమ్మపులుసును కలియనూరి
పది పుటంబులు దీర్చిన భస్మ మగును॥ ౧౫॥

వ్యా॥ విమలమును వావిలాకురసంబునవైచి యొక జాము వండిన శుద్ధమగును. దీని గంధకముతో గలిపి నిమ్మపండ్లరసముబోసి మెత్తగ నూరుచు పది పుటములుబెట్టిన భస్మమగును.

ఇచ్చో దీనిసంస్కృతమున విమలముయొక్క శోధకద్రవ్యములలో నడ్డసరమును గలిజేరును మారకద్రవ్యములలో గోమూత్రమును నధికముగ జెప్పబడియున్నవి.

—॥ విమలభస్మప్రయోగము, దానినివర్తించువ్యాధులు.॥—

చ॥ అమర కటు[1] త్రయత్రిఫల లాదట చూర్ణము జేసి నేతితో,
విమలము చిన్నమెత్తును ప్రవీణత గొన్నను పాండుపైత్యవి।

1. (క) త్రయంబుత్రిఫలంబుల.

భ్రిమశ్వాయధుజ్వరక్షయ లపారత వాతప్రమేహకుష్ఠముల్।
కొమరుగమాన్పిమానవులకుఁ బలమిచ్చునమోఘవీర్యమై॥

వ్యా॥ తగు పరిమాణంబున త్రిఫలంబులును త్రికటుకంబులును చూర్ణము చేసి యందు చిన్న మెత్తు పరిమితిగల విమలభస్మమును చేర్చి నేతితో కలిపి ప్రతిదినమును సేవింపుచుండిన పాండువులు పిత్తభ్రిమలు నంజులు జ్వరము క్షయవ్యాధులు వాతములు ప్రమేహములు కుష్ఠవ్యాధులు వీనినన్నిటిని అపారమగుశక్తితో నశింపజేసి నిరంఘాటమగు శక్తిగలిగి మనుష్యులకు మంచిబలమును కలుగజేయును.

—॥ విమలసత్వపాతనము. ॥—

రసరత్న సముచ్చయము:—(౧) శుద్ధిచేయబడిన విమలమును వెలిగారమునుకలిపి చూర్ణముచేసి యందు అర్ధసరపాకుభస్మమును కలిపి నిమ్మపండ్లరసమునుబోసి నూరి మూసకు లోభాగమునబూసి యెండించి మూతిమూసి చీరమన్ను జేసి కొలిమిలో నారుప్రస్థములు పరిమితిగల బొగ్గులనుబోసి రగిలించి యందు పైజెప్పిన మూసనునిచి యూదినచో చంద్రునివలె స్వచ్ఛమగు సత్వము విమలమునుండి వెడలును.

(౨) మఱియు విమలమును కాంక్షి కాసీసము వెలిగారము అను నీమూటితో జేర్చి మునగపువ్వులరసమునందును అరటిదుంపలరసమునందును అడవికందరసమునను భావనజేసి మొక్కపుక్షారమును కూడకలిపి మూసలోనునిచి మూతిమూసి కోష్ఠియంత్రమునబెట్టి యూదినచో విమలసత్వము వెడలును,

—॥ శిలాజతు శుద్ధిభస్మము. ॥—

సీ॥ విను శిలాజతు రెండువిధములై విలసిల్లు
　　బలువైన యెండచే బర్వతములు।
పగిలి నిర్యాసంబు ప్రభవింప గోమూత్ర

*కర్పూరకాఖ్యల గణన కెక్కి। 
గోమూత్రకాఖ్యము గుణములను ప్పగ్గి
నిడిన నిర్ధూమమై చెడకయుండు।
జల మంటకుండిన శిలజంబు భృఙ్గగో
మూత్రత్రిఫలరసమునను నూరి।
యినుపమూకుటిలో నుంచ నెనరు శుద్ధి
గంధతాళకమణిశిలల్ కలయ మాదీ।
ఫలరసంబున నూరి యేర్పడగ నష్ట
పుటము లిడినను భస్మమా కుటిలమెడలి॥ ౧౭॥

వ్యా॥ గ్రీష్మకాలంబునందలి తీక్ష్ణమగు నెండచే లోహగర్భంబులగు కొండరాళ్ళపగిలి యందు నిర్యాసము (జిగురు) బయలు వెడల నదియ శిలాజిత్త నబడును. ఇది గోమూత్రకమనియు కర్పూరకమనియు రెండు పేరుల నొప్పారు చుండును. అందు గోమూత్రక మనబడునది కొంచమునల్లనై యగ్ని యందుంచిన

* ప్రకృతమున మనదేశమున కర్పూరశిలాజిత్తని యుపయోగించు తెల్లటిరాయి వైలక్షణములంబట్టిచూచిన కాదనుట స్పష్టము. ఆర్యవైద్యులకిది కర్పూరశిలాజిత్తు కాదనిదెలిసియు దీనియందు శీతవీర్యంబును మూత్రాశయ దోషములను కొన్నింటిని శమింపజేయు శక్తియు గలదగుటచేతను నిజమైన కర్పూరశిలాజితు యీదేశమున దుర్లభమగుటచేతను దీనినే తత్థానమున నుపయోగించెదరు. ఈ కర్పూరశిలాజితువు ఉత్తరహిందూస్థానమందలి రాజపుత్రస్థానమున సలక్షణముగనుండునది దొరుకును, కొందరు శిలాజతు సామాన్య ప్రయోగమునకూడ నీరాతి భస్మమునే వినియోగించెదరు గాన నిందుకు ప్రమాణమెద్దియు గానము. మొదటిదగు గోమూత్రశిలాజిత్తు నెల్లరెరింగియె యున్నారు.

పొంగ్రమ్మక చెడిపోక స్థిరముగనుండును. జలమునవైచినను దాని కంటక శుద్ధముగ నుండును. ఇట్లు పరీక్షించబడిన శిలాజతువునుదెచ్చి గుంటగలగరాకురసము గోమూత్రము త్రిఫలములరసము వీనియందువైచినారి యొకయినుపబాణలియందుంచిన శుద్ధమగును. అట్టిశుద్ధమగు శిలాజతువును గంధకమును తాళకమును మణిశిలయు వేసికలిపి మాదీఫలముల రసంబునుబోసి బాగుగ మర్దించుచు నెనిమిది పుటములువేసిన భస్మమగును.

### —॥ శిలాజతువుయొక్క ఉపయోగము. ॥—

మ॥ దిన[1]మయ్యడ్డిగయెత్తు శైలజము ప్రీతిం బుచ్చుకొన్నట్టివా ।
రనయంబుల్ క్షయపాండుమేహగుదజంబా ద్యగ్నిమాన్ద్యం
బులన్ । ఘనకృచ్ఛ్రోదరగుల్మశూలలును రక్తగ్రంథులు
న్మాన్చి మే। లొనరున్ దుష్టియు పుష్టియున్ బలము నాయు
ష్యంబు నిచ్చున్ గృపన్॥ ౧౮॥

వ్యా॥ పై జెప్పబడినయట్లు భస్మముచేయబడిన శుద్ధమగు శిలాజిత్తు ప్రతిదినమును అడ్డిగయెత్తుచొప్పున పుచ్చుకొనువారలకు క్షయవ్యాధులును పాండువ్యాధులును మేహవ్యాధులును మూలవ్యాధులును అగ్నిమాంద్యంబులును మూత్రకృఛ్రిములును మహోదరములును గుల్మములును శూలవ్యాధులును రక్తగ్రంథులును నశించి మనస్తుష్టిని ఇంద్రియపుష్టిని దేహబలమును కలుగజేసి చిరకాలమువరకు నాయువును వృద్ధినందించును.

ఇచ్చట దీనిసంస్కృతమూలమున భేదముకలదు ఎట్లన:—“ భస్మీభూతశిలోద్భవంసమతులం కాన్తంచవైక్రాన్తకం యుక్తంచ త్రిఫలాంకటుత్రయఘృతైః వల్లేనతుల్యంభజేత్... రసోపరసనూతేంద్ర రత్నలోహేషుయే గుణాః । నివసన్తిశిలాధాతౌ జరామృత్యుజిగీషయా ॥ ” శిలాధాతువును

1. (ఖ) మున్న.

సేవించునపుడు వల్ల పరిమితముగ శిలాజతువును దానితోకూడ సమానముగ కాంతమును వైక్రాంతమును త్రిఫలములను త్రికటుకములనుచేర్చి నేతితో పుచ్చుకొనవలయుననియు, సమస్తఖనిజములయందును గల గుణములన్నియు మనుష్యులకు జరామరణములు కలుగకుండ జేయుటకై శిలాజిత్తునందు చేరియున్నవనియు విశేషము చెప్పబడియున్నది.

—॥ శిలాజతు సత్వపాతము. ॥—

శ్రీరసరత్న సముచ్చయమున :—గోమూత్రశిలాజతువును ద్రావణవర్గపతితములగు ద్రవ్యములతోజేర్చి అమ్లవర్గపు పదార్థరసములతో కలిపి చక్కగ మర్దనముజేసి మూసలోబెట్టి చీలచేసి బొగ్గులచే నిండియుండు కోష్ఠియంత్రమునబెట్టి యూదినచో శిలాజతువునుండి సత్వము వెడలును.

—॥ కర్పూరశిలాజతులక్షణము దానిశోధనము. ॥—

తెల్లనై యిసుకవలె విడివిడిగ నుండునది కర్పూరశిలాజిత్తు దానిని ఏలకుల కషాయముచేనూరి పుటముబెట్టినచో శుద్ధినందును.

—॥ మైలతుత్థము. ॥—

సీ॥ ధరణి మయూరతుత్థము మైలతుత్థము
సస్యకంబన నొక్కసంజ్ఞ నుండు ।
మైలతుత్థంబు శ్యామలవర్ణమై యుండు
మాయూరకణ్ఠాభ మగుచు [1]నెగడి ।
తామ్రగర్భంబునై తగ మృదువై యున్న
సస్యకంబది దధి సరగ నూరి ।
నిప్పుటటిగా జేసి నీరార్చి యగ్నిపై

1. (క) నొకటి.

లోష్టయంత్రము నేడుమార్లుగాచ ।
నమలహా నది యౌషధమందుబెట్ట
విసము నిరసించు శూలల కస రణంచు ।
అమ్లపిత్తంబు హృద్గద లణచి కుష్ఠ
శ్వాసకాకల బోకార్చు సంయమీంద్ర॥[1] ౧౯॥

వ్యా॥ మయూరతుత్థము, మైలతుత్థము, సస్యకము, అను నీమూడు పేరు లొకక్కవస్తువునే జెప్పును. (ఈమూడును మైలతుత్థము పేరులనుట).ఇది శ్యామలమగు కాంతి కలిగియుండును. నెమలిమెడవంటి మంచిరంగుగలిగి లోపల తామ్ర మిమిడియుండును. మంచి మెత్తని మైలతుత్థమును సంపాదించి పెరుగునుబోసి మెత్తగా మర్దించి బిళ్ళచేసి యెండించి మూకుటిలోనుంచి పైనమూకుడుమూసి సంప్రదాయము ననుసరించి చీరజేసి యెండించి యేడుపుటములుబెట్టిన పరిశుద్ధమగు నౌషధమగును. అద్దానిని సేవించిన విషదోషంబులు శమించును. సమస్తశూలలను రూపుమాన్పును. అమ్లపిత్తము, హృదయరోగములు, కుష్ఠవ్యాధులు, శ్వాసము, కాసము వీనినన్నిటిని పోగొట్టును.

"పిష్ట్వా వికాసవత్తుత్థం సక్షౌద్రం టంకణాన్వితమ్ । త్రిదినం పుటితం శుద్ధం వాంతిభ్రాంతివివర్జితమ్ । లికుచద్రవగంధాశ్మ టంకణేన సమన్వితమ్ । నిరుద్ధం మూషికామధ్యే మ్రియతే కౌక్కుటైః పుటైః॥ నిశ్శేషదోషవిషహృత్ గదశూలహారీ కుష్ఠాస్రపిత్తకఫబంధహరం పరం చ । శ్వాసాపహం వమనరేక కరం జ్వరఘ్నం శ్విత్రాపహం గదితమత్ర మయూరతుత్థమ్॥" అను నీసంస్కృతమూలమును బట్టిజూడ మైలతుత్థముయొక్క శోధన మారణముల విషయమై ఆంధ్రసంస్కృతములకు పరస్పరము మిగుల భేదమగుపడుచున్నది. కాంతివంతమగు మయూరతుత్థమును తేనెతోడను టంకణముతోడను చేర్చినూరి మూడుదినములు పుటమువైచిన వాంతికరత్వాది దోషంబులునశించి శుద్ధమగు

1. (ఖ) (గ) ప్రతులలో నీపద్యము లేదు.

ననియు, అద్దానిని గంధకమును టంకణమునుకలిపి నిమ్మకాయలరసముతోనూరి మూసయందుంచి మూసికుక్కుటపుటంబు బెట్టిన భస్మమగుననియు సంస్కృతముచే దెలియుచున్నది. ఆంధ్రమున నీశ్రైలియేమియు నగుపడదు.

—౹ తుత్థభస్మము. ౹—

౪రసరత్న సముచ్చయము:—శుద్ధిచేసిన మైలుతుత్తమునను గంధకమును వెలిగారమునుకలిపి నిమ్మపండ్లరసముననూరి మూసలో బెట్టి చీలజేసి కుక్కుటపుటము బెట్టిన భస్మముగ నగును.

—౹ తుత్థ సత్వపాతనము ౹—

౪(1) శుద్ధిజేసిన తుత్థమునను నాల్గవపాలు వెలిగారమునుకలిపి చూర్ణముజేసి కానుగనూనెలో నొకదినము నానబెట్టి మరుసటిదినమున వెలికిందీసి మూసలో బెట్టి కోష్ఠియంత్రముననునిచి యూదినచో నింద్రగోపపు పురుగులవలె నెఱ్ఱనైన సత్వము వెడలును.

(2) తుత్థమును కొంచెముగ వెలిగారమును జేర్చి నిమ్మపండ్లరసముననూరి యాపిష్టమును మూసలో నునిచి చీలజేసి కొలిమిలో బెట్టి యూదినచో ఎఱ్ఱనిరంగుకలిగిన సత్వము వెడలును,

—౹ చపలము ౹—

సీ॥ చపలంబు [1]పటికంపు చాయ [2]నారంచుల
బరువును మెరుపు నేర్పడగ నుండు।
నది మూసలో బెట్టి పొదిగి సున్నపురాళ్ళ
పుటమేసి జలములు పోసి తివియ।
పరిశుద్ధమై [3]రసబంధము గావించు

(ఘ) 1. పటుకెంపు. 2, నుండునుమరి.
3. (క) రసభస్మము. (ఘ) రసబద్ధము.

ననుపానవశమున జనులు గొన్న ।
ప్రబలంబులౌ వాతపైత్యకఫాదిదో
షములచే బుట్టుదోషము లణంచు ।
అధికవీర్యాభివృద్ధియై యాకలిచ్చు
క్రియలుసమకూర్చు జనులకు ప్రియమొనర్చు ।
చపలనుహిమంబు జెప్పగా జాల నింక
మహితగుణసాంద్ర యాత్రేయమౌనివర్య॥ ౨౦॥

వ్యా॥ *చపలము స్ఫటికమువంటి కాంతిగలిగి ఆరంచులతో నొప్పుచు బరువును మెరుగును కలిగియుండును. అట్టిదానినిదెచ్చి మూసలోనుంచి పై మూసి సున్నపురాళ్ళ నడుమనుంచి పుటముబెట్టి నీళ్ళుబోసిన శుద్ధమగును.

* చపలమున కీ గ్రంథమున కనుపరచిన లక్షణములకును ప్రకృతము దేశీయావైద్యులచే నుపయోగించబడు "చపలము" అను రాతికిని విశేషభేదము గన్పట్టుచున్నది. ప్రకృతము వాడుకలోనుండు రాయి అడుగుభాగమున సమముగలేక పైభాగమున నాలుగంచులతో జేరి పలకలుగలదై నాలుగువైపుల నుండు అంచులు జేరి శిఖరాకారముగ కొంచెమెత్తుగనుండును. మరియు నిది విశేషము తెలుపులేక కొంచెము మలినముతోగూడిన తెలుపువర్ణమును గలిగి యుండును. అధికభారములేక అరంగుళము మొదలు ఒకటి ఒకటిన్నర యంగుళము పొడుగు గలిగియుండును. ఈరాతిని నిప్పులమీదనుంచిన భస్మమువలె తెల్లనగునుగానిరసతన్త్రములజెప్పిన చపలమువలె నతిశీఘ్రముగ తగరముబోలె కరుగనేరదు. ఇది విశేషముగ నీప్రాంతమందు దొరకుచుండుటచేతను నిజమైన చపలమీప్రాంతమున దుర్లభమగుటచేతను నీకృత్రిమపురాతిని చపలస్థానమున నుపయోగించుచుండునట్లు తెలియుచున్నది. ఈరాతియందు నిజముగు చపలమునకుంగల గుణంబులెవ్వియు లేకయున్నను దీనినే చపలస్థానమున దేశీయ వైద్యు లుపయోగించుటకు కారణ మూహింపజాలను.

ఇట్టి చపలము రసబంధనము చేయును. దీని నాయారోగభేదంబుల ననుసరించి యనుపానములను జేర్చి సేవించిన వాతపైత్యకఫంబులు ప్రకోపించుటచే నేర్పడు రోగంబులన్నియు నివర్తించును. మరియు మంచి వృష్యమై ఆకలిని పుట్టించి పనులయందుత్సాహము గలిగించి జనుల కన్నివిధముల హితమును కలుగజేయును. కావున సోమనిచంద్రా! చపలముయొక్క గుణము లివియని వర్ణింపశక్యముకాదు.

మరియు చపలము గౌర (పసుపురంగు), శ్వేత (తెలుపు), అరుణ (ఎరుపు), కృష్ణ (నలుపు) వర్ణభేదములచే నాల్గువిధములనుండును. అందు బంగరువలె గౌరవర్ణంబును వెండివలె శ్వేతవర్ణంబునైన చపలము విశేషముగ రసబంధనమున నుపయోగింపదగును. తక్కిన ఎరుపు నలుపురంగు కల్గినది హీనబలమై నిప్పుసెగ తగలినమాత్రముచేతనే లక్కవలె నీరుగ కరగును. ఇయ్యది ఔషధయోగాదులయం దంతగ పనిచేయజాలదు. అని రసరత్నసముచ్చయమున విశేషముగ చెప్పబడినది.

—◆ చపలసత్వపాతనము. ◆—

ర్రసరత్నసముచ్చయము :—శుద్ధిచేయబడిన చపలమును చూర్ణముజేసి *ఉపవిషములను విషములను జేర్చి ధాన్యామ్లమును కలిపినూరి ముద్దజేసి విద్యుక్తప్రకారము కోష్ఠియంత్రమునబెట్టి యూదినచో నందుండి సత్వము వెడలును.

—◆ రసకము (కఫరి.) ◆—

సీ॥ ♦రసకనామంబున పొసగును కఫరి దు
ర్దర కార లేల్ల భేదములచేత।

---

* వివరమును మా ఆయుర్వేదాశ్రమగ్రంథమాలయందలి మూడవగుచ్ఛమగు ఆయుర్వేదపరిభాష ౧౧౭ పేజిలో జూచునది.

♦ప్రకృతము దేశీయవైద్యులు రెండువిధములగు కఫరిని యుపయోగించుచున్నారు. అందు మొదటిది కొంచము ఎరుపుతోగూడిన బూడిదెవర్ణము

దళయుక్తమగును దుర్దరము నిర్దళమౌను
కారవేల్లకమును కఫరియొప్ప ।
పంచగవ్యము నిమ్మపండ్లరసంబు[1]ను
కాంజికనరమూత్ర కములుగూర్చి ।
[2]యత్నంబునను డోలయంత్రాగ్ని చే[3]వండ
కడమదినుసులు కఫరికాంజి[4]తోడ ।

---

గలిగి భారముగలదిమై సుమారు నాలుగంగుళముల పొడగును రెండంగుళముల లావును గలిగిన చుట్టలుగానుండును. వీనియందు తళతళలాడు సన్నని నలుసులు కనబడును. దీనిని సత్తు అనులోహము దొరకు గనులయందలి మట్టినినూరి యీ రీతి చుట్టలుగ నుత్తరహిందూస్థానమున జేయుదురు.

రెండవది యిండ్లలో గోడలు మొదలగు వానికి జేయు పాలగచ్చు మాసిపోయి యూడిపోయిన పిదపనుండు బిళ్లవలె నుండును. ఈరెండువిధములలో మొదటిదానినే చిరకాలముగ దేశీయవైద్యులు ఔషధములయందుపయోగించుచుండిరి. రెండవదియగు తెల్లబిళ్లను కొద్దికాలముగ నుపయోగించుచున్నారు.

ఈరెంటిని రసాయనశాస్త్రవిశారదుడగు నామిత్రునివలన పరీక్షింపజేయించితిని. అందు మొదటిదియగు చుట్టలుగ నుండుదానియందే కఫరియందుండతగిన "సత్తు" అనులోహము సూక్ష్మాంశముగ గలదనియు రెండవదానియందు కొన్ని క్షారమిశ్రపదార్థముల కూడిక గలదనియు, అందు సత్తు లోహముయొక్క భాగమేమాత్రము లేదనియు దెలిపిరి. ప్రకృతము వాడుకలోనున్న రెండువిధములగు కఫరికిని గ్రంథస్థలక్షణములు లేకున్నను చుట్టలవలె నుండుదానియందు నిజలోహభాగముండుటచేత దీని నుపయోగించుటయే యుత్తమము.

(ఖ) 1. కాంజికనరమూత్రమాక్షికలు గూర్చి. 2. యంత్రంబులనా. 3. వండి. 4. తోచ.

నేడుమారులకును శుద్ధి యొసగు నదియు
సూతలోహంబులకు మేలు జూపుచుండు।
నేత్రరోగంబులకు నీడ పాత్ర మగును
వాతకఫ మేహజ్వర యక్ష్మఘాత లణచు॥ ౨౧॥

వ్యా॥ కఫరి రసకమను పేరున నొప్పారుచుండును. (దీనినే పాలతుత్థమని దేశీయవైద్యులు జెప్పెదరు). అయ్యది దుర్దరము కారవేల్లమునని రెండు విధములనుండును. అందు దుర్దరకఫరికి రేకులుగలవు. కారవేల్లకమునకు రేకులుండవు. ఈ కఫరిని పంచగవ్యములు, (గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము,) నిమ్మపండ్లరసము, కాంజికము, నరమూత్రము వీనినన్నిటితోఁ జేర్చి డోలయంత్రంబుననుంచి వండవలయును. ఇట్లు కఫరిని కాంజికమును తక్కిన దినుసులును గూర్చి ప్రయత్నముతో నేడుమారులు స్వేదనము చేసిన శుద్ధమగును. ఇయ్యది రసమునకును లోహములకును రంజన సంస్కారమున మిగులనుపయోగించును. నేత్రరోగంబుల బరిమార్చును. వాతరోగములు కఫరోగములు మేహరోగములు జ్వరములు రాజయక్ష్మ వీనిబాధ లణగించును.

“రసకో ద్వివిధః ప్రోక్తః దుర్దరః కారవేల్లకః। సదళో దుర్దరః ప్రోక్తః నిర్దళః కారవేల్లకః॥ సత్వపాతే శుభః పూర్వో ద్వితీయశ్చౌషధాదిషు॥ నరమూత్రే చ గోమూత్రే సప్తాహం కర్పరే పచేత్। డోలాయంత్రే తతః శుద్ధం సర్వరోగేషు యోజయేత్॥ కర్పరో వహ్నిసంతప్తః సప్తవార నిమజ్జనాత్। నింబూఫలరసస్యాంతః నిర్మలత్వం ప్రపద్యతే॥ రసకః సర్వమేహఘ్నః కఫపైత్యవినాశనః। నేత్రరోగక్రిమిఘ్నశ్చ లోహపారదరంజనః॥” అనుని సంస్కృతమూలముచే రసకశోధక ద్రవ్యములలో నరమూత్రమును గోమూత్రమునుమాత్రమే చెప్పబడినవి. మరియు ద్వివిధములగు రసకములలో దుర్దరము సత్వపాతనమునకును కారవేల్ల మౌషధయోజనమునకును నుపయోగించుననియు

కఫరిని నిప్పులయందునగాచి నిమ్మపండ్లరసమున నేడుమార్లుముంచిన శుద్ధమగు నని మరియొకశోధనపద్ధతియు విశేషముగ జెప్పబడియున్నది.

—॥ కఫరిభస్మవిధానము. ॥—

౪ రసరత్నసముచ్చయము :—పైజెప్పినప్రకారము సిద్ధమైన కఫరిసత్త్వమును తాళకముతోగూర్చి యొక లోహకల్వములో నునిచి యినుపగుదియచే మర్దనము జేసినచో భస్మమగును.

—॥ రసకసత్వపాతనవిధానము. ॥—

పసుపు త్రిఫలములు హారిదళము సైంధవలవణము కరిదూపము వెలిగారము జీడిగింజలు అను నీద్రవ్యములను ఒక్కొకటి రసకమునకు (కఫరి) నాల్గవపాలుండునట్లుచేర్చి అందు కఫరిని కలిచేతను అమ్లవర్గ రసములచేతను నూరి మూస లోభాగమున బూసి యెండించి మూసనుమూసి చీరచేసి కోష్ఠియంత్రమున బెట్టి యూదునది. అట్లూదుసమయమున నల్లని తెల్లని రంగుల తోకూడియు మంటలెగయుచున్నచో కఫరి కరగుచున్నదని తెలిసి యా సమయమున సందంశము (పటకారు) చే మూసను గట్టిగపట్టుకొని తలక్రిందుగ త్రిప్పి మూసపగులకుండునట్లు మూసపై మెల్లగ తట్టుచున్నయెడ అందుండి సత్వము తెల్లగ తగరముతో సమానమగు కాన్తికలిగి క్రిందబడును. అట్టిసత్వమునుగ్రహించి మరల పైజెప్పినవిధముగ మర్దించి మూసలోబెట్టి యూదునది. ఇత్తెరంగున మూడునాల్గుసార్లు ఊదినచో కఫరినుండి సత్వమంతయు శుద్ధముగ వెడలును.

(2) మఱియు లక్కజెముడు ఆవాలు కరకకాయ పసుపు మద్ది వెలిగారము వీనినన్నింటిని చూర్ణముచేసి రసకమును అందుచేర్చి యాసముదాయమును ఆవుపాలయందును ఆవునేతియందును ఉడికించి వృంతాకమూసలో బెట్టి చీరజేసి యెండించి కోష్ఠియంత్రమునబెట్టి యూదునది. ఇత్తెరంగున ననేకపర్యాయములు మాటిమాటికినియూది మూసను వెలికిందీసి రాతిమీద

మూసను తలక్రిందుగా తట్టినచో రసకమునుండి సత్వము శుభ్రముగ వంగము (తగరము) వంటి కాన్తిగల్గి వెడలును.

(౩) పైజెప్పిన ద్రవ్యములను రసకమును చూర్ణముజేసి యథోక్తముగ నావుపాలయందును నేతియందును ఉడికించి మూసలోబెట్టియుంచుకొని కోష్ఠియంత్రమున (కొలిమిలో) నడమ నీళ్లతో నిండియుండు నొక మంటిపిడతనుపాతి దానిపై నొక మట్టిమూకుడుకు నడమ రంధ్రముజేసి మూసియుంచునది. పిమ్మట ఔషధముచే నిండియుండు మూసను పైజెప్పిన మూకుడుపై తలక్రిందుగనుంచి మూసపైన బొగ్గులుబోసి నిప్పుబెట్టి యూదునది అట్లూదుచున్నచో మూసలోని యౌషధముద్రవించి దానిసత్వము నీళ్లపిడతపై మూసిన మూకుటిలోబడి దానినడమనుండు రంధ్రమునుండి పిడతలోని నీళ్లలో బడును. ఆసత్వము శుద్ధమైయుండును.

క॥ మునివర మహారసంబుల
విన్పించితి శుద్ధిగుణప్రవీణత్వములన్ ।
విను మిక నుపరసవిధముల
ననఘా నామదికి దోచిన క్లైరిగింతున్ ॥ ౧౨॥

వ్యా॥ ఆత్రేయమునీంద్రా ! ఇంతవరకును నీకు మహారసంబులును వానిశుద్ధులును వానియుపయోగంబుల నేర్పులును తెలిపితిని. ఇక నుపరసములనుగురించి నాయెరింగినంతవట్టు తెలియజెప్పెద నాలకింపుము.

— ఉపరసములు. —

గీ॥ గంధగైరిక కాసీస కాంక్షికములు
హరిదళ మణిశిల తాళకాద్యంజనములు ।
నెనర కంకుష్ఠకముతోడ * నుర్వితోమ్మి
దుపరసంబు లనంగ మహోపకారా॥ ౧౩॥

* సాధుపాఠము - నుర్వియెన్మిదుపరసంబు.

వ్యా॥ గంధకము, గైరికము, కాసీసము, కాంక్షికము, హారిదళము, మణిశిల, తాళకము, అంజనము, కంకుష్ఠము, అని యుపరసములు తొమ్మిది విధములనుండును.

ఇచ్చటదీనికి సంస్కృతమూలమున "గంధాశ్మగైరికాసీస కాంక్షీతాళ శిలాంజనమ్ । కంకుష్ఠంచేత్యుపరసాశ్చాష్టౌపారదకర్మణి" అనియుండుటవలన నెనిమిదియుపరసములని దెలియుచున్నది. ఆంధ్రమున హారిదళము నధికముగ జేర్చి యుపరసంబులు తొమ్మిదిగ పరిగణింపబడియున్నవి. కాని వివరణమునఁజూడ హారిదళము తాళకభేదముగ చెప్పబడియున్నది. ఒకప్రతియందుమాత్రము "హారిదళ మణిశిల తాళకములు" అని రెండవపాదము మార్పబడియున్నది. కాని యది యునంత యుపయుక్తముకాదు, ఏలనన ? ఏకవస్తువాచకములుగనుండు హారిదళ తాళకములు వేరువేరుగ పరిగణింపబడుటయు అంజనము విడువబడుటయు అందుచేనెనిమిది యుపరసంబులుమాత్ర మేర్పడుచుండ " తొమ్మిది " యని నిర్ధారణచేయుటయు నసమంజసములైయున్నవి. కావున సంస్కృతము ననుసరించియుండుటకును విరోధములు పరిహరింపబడుటకును నీపద్యము రెండవపాదమును "హారిదళంబును మణిశిలయంజనములు" అనియు మూడవపాదము చివర "నుర్వినెన్మి" దనియు మార్చుకొనుటయు మంచిదని తోచుచున్నది.

—( గంధకము. )—

సీ॥ విను గంధకము నాల్గువిధములౌ శ్వేతాది
  వర్ణభేదములచే వసుధలోన ।
శ్వేతంబు బలపంబు రీతి [1]నుండునులోహ
  మారణక్రియలకు కారణంబు ।
రక్తవర్ణంబది [2]రక్తికి రసవాద
  విద్యలకెల్లను హృద్యమగును ।

1. (క) (ఖ) నీకెరిగింతు. 2. (క) రక్త.

అతిదుర్లభంబు నీలాఖ్యంబు[1] రుగ్జరా
మృత్యుబాధ లణంచు సత్యముగను।
పచ్చనై చిల్కరెక్కల పగిది నుండు
గంధకం బమృతశిలయన గణన కెక్కి।
శుద్ధు లొనరిన కార్యసంసిద్ధి జేయు
ముదిమి దొలగించు మృత్యువు మదమడంచు॥ ౨౮॥

వ్యా॥ గంధకము తెలుపు ఎరుపు నలుపు పసుపునను రంగులభేదమును బట్టి నాలుగువిధములుగ నుండును. అందు తెల్లనిది బలపపుకణికెలవలె నుండును. అది లోహములను భస్మములుగజేయు కృత్యంబులయం దుపయోగింపబడును. ఎఱ్ఱని గంధకము రంజనములకు రసవాదములయందు నుపయోగింపబడును. నల్లనిగంధకము మిగుల శ్రేష్ఠమైనది. ఇద్దానిని సేవించు జనులకు రోగంబులును ముదిమియు అకాలమృత్యువును తొలగును. ఇది మిగుల దుర్లభమైనది. చిలుకరెక్కలవలె పచ్చగనుండు గంధకము "అమరశిల" యను పేరున సుప్రసిద్ధమై యలరారుచు తగుశుద్ధుల నొనరించిన పిమ్మట నౌషధములయందు చేర్చుకొనుట కనువుగనుండును. దీనిని సేవించువారలకు అకాలంబున కలుగు జరామరణంబులు తొలంగును.

## —॥ గంధకశోధకద్రవ్యములు. ॥—

క॥ కలబంద మొగలిచన్నులు
కలగర మరి యడ్డసరము గలిజేరును నే।
ల్ములకయు ఘృతక్షౌద్రంబులు
కలి పాలను శుద్ధి బొందు గంధకము భువిన్॥ ౨౯॥

1. (క) (ఖ) (ఘ) బరుచిజ్జరా,

వ్యా॥ కలబంద, మొగలిచన్నులు, గుంటకలగర, అడ్డసరము, తెల్లగలిజేరు, నేలములక, నేయి, తేనె, కాంజికము, పాలు, ఇవియన్నియు గంధకమును శుద్ధముగజేయు ద్రవ్యములు. ఇయ్యవి సంస్కృతమూలమున లేకుండుటచే గ్రంథకర్త తనస్వానుభవములను గనపరచిన ట్లూహింపవలెను.

—॥ గంధకశోధనవిధానము. ॥—

గీ॥ భాండమున రస మిడి మీఁద బట్ట గట్టి
గంధకము బోసి మూకుడు గదియ మూసి ।
పుడమిలో నుంచి మీఁదట పుటము నిడిన
కుండలో జారు బంగారుగుండ్లరీతి॥　　౨౬॥

వ్యా॥ గంధకమును శుద్ధిని చేయదలచినపుడు ఒకకుండలో శుద్ధి చేయుట కుపయోగించు పైజెప్పంబడిన కలబందరసము మొదలగు ద్రవద్రవ్యములనుంచి కుండపై బట్టచే వాసెనగట్టి అందు చూర్ణముచేయబడిన గంధకమునుబోసి పైన మూకుడుమూసి చీరమంటినిచ్చి చక్కగ నెండించి కుండను మెడవరకు భూమిలో పాతవలయు. పిమ్మట పైనమూసియుండు మూకుటిపై పుటముబెట్టిన గంధకమంతయు కరగి గుడ్డసందులనుండిజారి క్రిందిరసములో బంగరుగుండ్లవలె జారిపడును. అది శుద్ధమగు గంధకమై యేర్పడును.

ఇచ్చట దీని సంస్కృతమూలమున కొంచెము భేదమగబడుచున్నది. "స్థాల్యాం దుగ్ధం వినిక్షిప్య ముఖే వస్త్రం నిబధ్య చ । గంధకంతత్ర నిక్షిప్య చూర్ణితం సికతాకృతి । ఛాదయే త్పృథుదీర్ఘేణ ఖర్పరేణైవ గంధకమ్ । జ్వాలయేత్ ఖర్పరస్యోర్ధ్వం వనచ్ఛాణైః తథోపలైః । దుగ్ధే నిపతితో గంధః క్షాళితశ్శుద్ధి మేష్యతి । గంధకస్తు కుబేరాక్షీతైలేన చిరమర్దితమ్।మందం ప్రకటమాషాయాం ధ్మాతం తచ్ఛుద్ధిమేష్యతి॥" ఈగ్రంథముచేత గంధకశోధనమున కుపయోగింపబడిన విధానంబున స్వీకరింపబడిన ద్రవద్రవ్యముల పాలు మాత్రము చెప్పబడియున్నది. తెనుగున కొన్ని ద్రవద్రవ్యములు గంధకశోధక

ములుగ జెప్పబడినవి. మరియు తీగ్రానుగ్తైలమున గంధకమును జేర్చి సంప్రదాయములనెరింగి చక్కగ మర్దించి విశాలమగు మూసయందుంచి నిప్పులపై మెల్లగ నూదిన శుద్ధమగునని మరియొకవిశేషము చెప్పబడియున్నది. ఇది పరికించ గ్రంథకర్త తనయనుభవమునంగల విశేషఫలదాయకములగు సులభప్రక్రియలను నిరూపించియున్నాడని దెలిసెడిని.

—॥ శుద్ధిచేయని గంధకమున గల్గుదోషములు. ॥—

క॥ గంధకము శుద్ధిసేయక
ముందుగ సేవింప తేజమును బలిమియు నా।
నందము జెరుచును రుజములు
గ్రందుకొనున్ పైత్యదాహకంపము లోదవున్॥ ౧౨॥

వ్యా॥ గంధకమును శుద్ధిచేయకయే సేవించిన వికాసమును బలమును ఉత్సాహమును నశింపజేయును, పైత్యము, శరీరమందు మంటలు, వణకు మొదలగు వ్యాధులంగలిగించును.

—॥ గంధకసేవ. ॥—

సీ॥ త్రిఫలచూర్ణము నేయి తేనె లవంగముల్
గలిపి వైద్యులయుక్తిబలముచేత।
పార్వతీ పుష్పసంభవమైనగంధము
సేవజేసిన కార్యసిద్ధియగును।
దృష్టిపుష్టి బలంబు దీర్ఘాయువును వీర్య
బలమును దీపనపాచనములు।
కలిగించు కుష్ఠముల్ దొలగించు క్షయపాండు
[1]పరిణామశూలల పరిహరించు।

1. (క) (గ) (ఘ) గ్రహణ్యామశూలలకడకుదోలు

చర్మదళములు గజ్జి విసర్పిదద్రు
రోగముల బాపి జనుల కారోగ్య మొసగు।
[1]గంధకము మేన బూయంగ కాయశుద్ధి
కలిగి రోగమయంబెత్తి కాంతినొసగు॥ ౨౮॥

వ్యా॥ త్రిఫలములచూర్ణము, నేయి, తేనె, లవంగములు మొదలగు నను పానద్రవ్యములను వైద్యులు తమతమ యనుభవము ననుసరించి నిర్ణయించి శుద్ధ గంధకమును సేవింపజేసిరేని రోగనాశనరూపమగు కార్యము తప్పక సిద్ధించును. మరియు దృష్టిపాటవమును దేహబలమును దీర్ఘాయుష్యమును వీర్య పటుత్వమును దీపనమును పాచనమును కలిగించును. కుష్ఠవ్యాధుల బోగొట్టును. క్షయమును పాండువును పరిణామశూలలను దొలగించును. చర్మదళములు గజ్జి విసర్పి దద్రురులు మొదలగు చర్మవ్యాధుల నిర్మూలము గావించును. మరియు గంధకమును దేహమునబూసిన కాయముశుద్ధమై చర్మరోగంబులన్నియుం బోయి దేహమునకు మంచి కాంతికల్గును.

## —॥ గంధకద్రుతి. ॥—

శ్రీ రసరత్నసముచ్చయము :—శుద్ధిజేసిన గంధకమున పదునారవపాలు త్రికటుకముల చూర్ణమును గలిపి రెంటిని మెత్తగనూరి ఒకమూరెడునిడివియుం వెడల్పునుగల యొకగుడ్డపై నాచూర్ణమునుచల్లి యాగుడ్డను చాపవలె చుట్టి చుట్టి సన్నని దారముచే బిగియగట్టి యొకజాముపరకు మంచినూనెలో నానబెట్టి పిమ్మట నావత్తినిదీసి సందంశము (పటకారు) చే నడమపట్టుకొని యావత్తికొనను వెలిగించి చేతబట్టుకొనినయెడ వత్తిలోనుండు గంధకముకరిగి బొట్లు బొట్లుగపడును. దానిని శుభ్రమగు పింగాణిగిన్నెలో గ్రహించి యుంచునది.

1. (గ) గంధకద్రుతి మెయిబూయు కాయశుద్ధి కలిగి లోహమయం బయి కాంతినొసగు. (ఘ) గంధకద్రుతి తామ్రంబు కనకమగును పరమ యోగులకెల్లను కారణంబు.

దీనినే గంధకతైలమనికూడ వాడుదురు. ఇయ్యది గంధకగుణంబులన్నిటినిం గలిగియున్నది.

—॥ గైరికము. ॥—

సీ॥ గైరికంబులు రెండు గణుతింప స్వర్ణగై
    రికము పాషాణగైరిక మనంగ।
పాషాణగైరిక బహుదోషములకెల్ల
    కుదురౌను కొంచెపు గుణముగల్గి।
స్వర్ణగైరిక శుద్ధస్వర్ణాభమై తుద
    [1]మొదలెఱ్ఱనై మెరుగొందవుచుండు।
పరిశుద్ధమౌనావు పాలతో భావనల్
    చేసి సేవించిన శీతమిచ్చు।
నొగరుతీపియునై యుండు దగనణంచు
గరళముల రక్తపైత్య హిక్కలనణంచు।
ప్రదరముల [2]బాపి రుజముల పరిహరించు
గానగైరికమున కెన్నగలదె సాటి॥ ౨౯॥

వ్యా॥ స్వర్ణగైరికమనియు పాషాణగైరికమనియు గైరికము రెండువిధములనుండును. అందు పాషాణగైరికమున నల్పముగ గుణంబులును మెండుగ దోషంబులునుండును. స్వర్ణగైరికము పరిశుద్ధమగు బంగారువంటి కాంతిగల్గి మొదటను చివరను ఎఱ్ఱనై కాంతికలిగి ప్రకాశించుచుండును. అద్దానిని మంచి యావుపాలయందు భావితముగజేసిన శుద్ధమగును. అట్టిగైరికమును సేవించు

1. (క) నెఱ్ఱనై మెరుగుల నెఱపుచుండు. (గ) మొదలెఱ్ఱనై మెరయు మోదమలర. 2. (ఖ) (గ) వాంతి.

వారలకు దేహమునకు చలవను కలిగించును. ఒగరు తీయనయాను రుచులను కలిగియుండును. మరియు విషదోషములబోకార్చును. రక్తపిత్తవ్యాధులను హిక్కలను నశింపజేయును. ప్రదరరోగంబుల బోగొట్టును. విసర్పము మొదలగు రోగముల బోగొట్టును. కావున నీరోగముల గైరికముతో సమముగునది వేరొండు లేదు.

### —॥ గైరికసత్వము. ॥—

రసరత్నసముచ్చయము:—శుద్ధిజేసిన గైరికము స్వాభావికముననే సత్వరూపమై యుండునని నందికేశులమతంబున గానంబడియెడు. గైరికములను క్షారములతో జేర్చి యమ్లవర్గరసములతో భావనజేసి యారసములనే స్వేదనవిధిచే పక్వము జేసినచో సత్వమును విడమనని కొందరు వచించెదరు.

### —॥ అన్నభేది. ॥—

సీ॥ కాసీసమును పుష్పకాసీసమన రెండు
  విధములై యుం డన్నభేది [1]యదియు।
నిమ్మపులుసు నుంచి కమ్మని వేసిళ్ళ
  గడిగిన శుద్ధమౌ కాసిసంబు।
ఉప్పునై పుల్లనై యొగరునై బరువునై
  పొగవర్ణమై పాండుభూములందు।
పుష్పకాసీసంబు బుట్టును సేవింప
  నత్యుష్ణమగు విషం బపహరించు।
అన్న మరగించు శూలల [2]నపహరించు
వాతకఫకుష్ఠజ్వర [3]యక్ష్మ ఘూతలణచు।

1. (ఖ) (గ) యెపుడు. 2. (ఖ) హతమణంచు. 3. (ఘ) క్షయ.

ఘనరుజ లణంచు కేశరంజన మొనర్చు
అఖిలజనులకు నామోది యన్నభేది॥ ౨౦॥

వ్యా॥ అన్నభేది వాలుకా కాసీసము, పుష్పకాసీసమునని రెండు విధములనుండును. అందు కాసీసమును నిమ్మపండ్ల రసమున నాన్చి సరియగు వేడిగల నీళ్ళతో గడిగిన శుద్ధమగును. పుష్పకాసీసము పాండువర్ణముగల భూములయందు బుట్టును. అది పులుసును ఉప్పును ఒగరును కలిసిన రుచి గలిగి బరువుగలదై ధూమ్రమగు రంగుగలిగి యుండును. ఇద్దానిని సేవించిన మిగులతీక్ష్ణమగు విషదోషముల హరించును. ఆహారపదార్థములఁ జీర్ణములుగ జేయును. శూలలనఁ పోగొట్టును. వాతము కఫము కుష్ఠము జ్వరము క్షయము వీనికి సంబంధించిన బాధలను తొలగించును. ఇంకి నితరములగు గొప్పవ్యాధులను పోగొట్టును. వెండ్రుకలకు రంగునిచ్చును. కావున నందరకును నీయన్నభేది సంతోషదాయకమైనది.

## కాసీససిందూరము.

(1) శుద్ధి జేసిన యన్నభేదిని ఖల్వముననుంచి వేపాకురసమును కొంచముకొంచముగబోయుచు రెండుమూడుదినములు చక్కగ మర్దించవలెను. పిదప బిళ్ల జేసి నీడనెండించి మూకుటిలోనుంచి పైన మూకుడుమూసి చీరజేసి యెండించి యుచితముగ పుటము వేయవలెను. స్వాంగశీతలమున గ్రహించి పై చీరమట్టిని చక్కగవిప్పి యందు మామిడిచిగురువలెనుండు సిందూరమును మెలకువుగ దీసుకొని మంచి గాజుసీసాలో భద్రపరుచునది.

(2) శుద్ధిజేసిన యన్నభేదిని కుక్కపొగాకురసమున పైజెప్పిన రీతిని మర్దించి పుటంబిడిన చక్కని సిందూరమగును.

(3) నిమ్మపండ్లపులుసునను పైజెప్పినరీతి మర్దించి పుటము వేసిన సిందూరమగును. ఈమూడువిధములగు సిందూరములును పై 30-వ పద్యమున గనపరచిన వ్యాధులను దునుముటయేగాక పాండురోగములను బోగొట్టును,

మరియు గర్భిణీస్త్రీలకును సుకుమారులకును సంభవించు పాండువ్యాధులయం దునుకూడ నెట్టివిరోధమునుజేయక సౌమ్యముగ రోగమును నివర్తిజేసి రక్తవృద్ధినిజేయును.

—( కాసీససిందూరము ప్రకారాంతరము. )—

(1) శుద్ధిజేసిన యన్నభేది మంచి నాలుగువంటుల సూరేకారమును సమముగగ్రహించి ఖల్వమునను నించి నిమ్మపండ్లపులుసును కొంచము కొంచముగ వేయుచు రెండుమూడుదినములు చక్కగ మర్దించి పైజెప్పినరీతిగ పుటము వేయవలెను. చక్కని చిగురుటాకులంబోలిన సిందూరమగును.

(2) శుద్ధిజేసిన యన్నభేది యొకభాగము, మంచిసూరేకారము రెండు భాగములు, లేక మూడుభాగములుగానిజేర్చి నిమ్మకాయపులుసున పూర్వము జెప్పినవిధముగ నూరి బిళ్లజేసి యెండించి పుటము వేయవలెను. ఈ రెండురకముల సిందూరమును నంజు, జలోదరము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, నీవ్యాధులయందు వ్యాధిబలమును దెలిసికొని అర్ధయవ (అరగ్రేను) పరిమితి నుండి నాలుగుయవలపరిమితివరకు యుక్తానపానముగ నుపయోగించవలెను. ఇందు రెండవదియగుసిందూరమును నాలవవంతు యవపరిమితిమొదలుకొని ఒకటి లేక రెండుయవలపరిమితికన్న నుపయోగింపంజనదు. ఈ రెండువిధముల సిందూరమును ననుపానములేకయే యుపయోగించకూడదు. మరియు సుకుమారులకును గర్భిణీస్త్రీలకును పైవ్యాధులయందు నెంతమాత్ర ముపయోగించకూడదు. ఈ సిందూరము గాలితగిలిన ద్రవించిపోవుస్వభావము గలదిగాన మంచి గాజుకార్కుగల సీసాయందు భద్రపరచవలెను. అన్నభేదిని గురించిన యీయైదువిధములగు ప్రక్రియలును స్వానుభవమున ననేకులకుపయోగించి గుణములగాంచియుంటిని.

—( కాంక్షి. )—

సీ॥ మునినాథ సౌరాష్ట్ర మనెడి దేశమునందు
గని ద్రవ్య మృత్తిక కాంక్షి యండ్రు।

[1]ఆ కాంక్షియును తువరికాఖ్యము పటికయు
నన రెండువిధములై దనరుచుండు।
[2]పటికము చులకనై స్ఫటికరీతినియుండు
తువరి తామ్రప్రభద్యుతి వహించు।
కలిని మర్దించి శుష్కము జేయశుచియగును
దేహంబు లోహంబు తీరుజేయు।
నొగరు పులుసును మధురమై యుండునెపుడు
గరళముల ద్రుంచు నేత్రరోగము లణంచు।
వాతపైత్యాదిదోషముల్ వ్రణవికార
ములను హరియించు నదిగొన్న మునివరేణ్య॥ ౩౦॥

వ్యా॥ ఆత్రేయమునిచంద్రుడా! సౌరాష్ట్రమను దేశమందుండు గను లలో ద్రవ్యగా దొరకు మృత్తికాభేదమునకు కాంక్షియని పేరు. అదితువరికము పటికమునని రెండువిధములం గలిగియుండును. అందు పటికము స్ఫటికమువలె తెల్లగనుండి తేలికగనుండును, తువరి రాగి తునకయొక్క కాంతిని బొందియుండును. ఈకాంక్షి నికాంజికముబోసినూరి యెండబెట్టిన శుద్ధమగును. ఇది ఒగరు గను పులుసుగను తీయగను నుండును. దీనిని సేవించిన విషదోషములబోగొట్టును. నేత్రవ్యాధుల నణంచును. వాతపైత్యకఫంబులకు సంబంధించిన రోగములను వ్రణములను తొలగించును. శరీరమును లోహమువలె దృఢముగ జేయును.

---

1. (గ) ఆకాంక్షితువరికాఖ్యము పటికయురెండుతెరగులై భువిలోన బరగుచుండు. (ఘ) ఆకాంక్షియును కఫరికాఖ్యము స్ఫటికము ననరెండు విధములై దనరుచుండు.

2. (ఘ) స్ఫటికము చులకనై పటికరీతినియుండు కఫరి తామ్రప్రభ ద్యుతివహించు. (గ) పటికయు చులకనై స్ఫటికరీతినియుండు తువరి తామ్రచ్ఛదద్యుతివహించు.

ఇచ్చట “సా శుద్ధ్యాత్తామ్రవర్ణాభం లోహేచామ్లేన మేళితా। తువరీ కాంజికే స్విన్నా ఘర్మే శుష్కా విశుధ్యతి। యేన శుద్ధ్యతి కాసీసం సౌరాష్ట్రీం తేన భావయేత్॥” అనని సంస్కృతమున తువరిని యమ్లరసముతో మిళితము జేసి లోహపాత్రయందునిచి కాంజికముయొక్క యావిరిచే నుడికించి యెండ నెండించిన శుద్ధమగుననియు, కాసీసమునకు జెప్పిన శోధనద్రవ్యములచే సౌరాష్ట్రి మృత్తికను భావన చేయనగుననియు విశేషముగ పడుచున్నది. కాంజికమున మర్దించి యెండ నెండించినమాత్రముననే శుద్ధమగునని యీగ్రంథకర్త నిరూపించియున్నాడు.

## —॥ కాంక్షి సత్వపాతనము. ॥—

§ (౧) రసరత్న సముచ్చయము :—శుద్ధి చేయబడిన తువరిని క్షారములను అమ్లరసములనుకలిపి మర్దనము జేసి మూసలోనునిచి యంత్రమున బెట్టి యూదిన యెడ దాని సత్వము వెడలును.

(౨) మఱియు తువరిని గోపిత్తము (ద్రవముగనుండు పచ్చిగోరోచనము) న నూరుసార్లు భావన జేసి కోష్ఠియంత్రమున బెట్టి యూదినచో సత్వము వెడలును.

## —॥ తాళకము. ॥—

సీ॥ తాళకంబు ద్వివిధంబగు పత్రతా
    ళకమును పిండతాళకమనంగ ।
పత్రతాళక మొప్పు బంగారు రేకుల
    పగిదిని మెరుపును బరువుగలిగి ।
తగనుండు మరిపిండతాళక నిష్పత్ర
    మగుచు సద్గుణహీన మగుచునుండు ।
కారవల్లీ శిలాక్షార కూశ్మాండ ర

సంబులచే శుద్ధిసంభవించు ।
తాళకపు బిళ్ళనెండించి దానిమీద
క్రింద మోదుగుక్షారంబు పొందుపరచి ।
రెండుదినములు వండిన కుండలోన
భస్మమౌ ధూమహీనమై భవ్యచరితా ॥ 3౭॥

వ్యా॥ తాళకము పత్రతాళకమనియు పిండతాళకమనియు (దీనినే హరిదళమని వాడుదురు) రెండువిధంబుల నుండును. అందు పత్రతాళకము బంగరు రేకులవలె రేకులుగలిగి మెరయుచు బరువుగలిగియుండును. పిండతాళకము దళములులేనిదై అంతగ మంచిగుణము నీయజాలనిదిగ నుండును. తాళకము కాకర గుమ్మడి అనువాని రసంబులతోడను సున్నపురాతి తేటనీటితోడను ప్రత్యేకప్రత్యేకముగ డోలాయంత్రమున సంప్రదాయముల నెరింగి స్వేదనము జేసిన శుద్ధమగును. ఇట్లు శుద్ధిచేయబడిన తాళకముయొక్క బిళ్ళను ఎండబెట్టి దానికి పైనను క్రిందను మోదుగక్షారమునుపొదిగి కుండలో నునిచి రెండు దినములు క్రమాగ్నులవండిన భస్మమగును. అయ్యది నిప్పులవైచిన యగ్నిబద్ధమై పొగరాజకయుండును.

ఇచ్చట "శుద్ధంస్యాత్తాళకంస్విన్నం కూష్మాండసలిలే తథా । చూర్ణోదకే పృథక్ తైలే భస్మీభూతం న దోషకృత్॥" అను దీని సంస్కృతమూలమున తాళకమును పరిశుద్ధము జేయుందగు గుమ్మడికాయరసము సున్నపునీరు తైలము అను స్వేదనద్రవ్యములలో తైలమునువిడిచి కాకరాకురసము నుపయోగించి యున్నాడు. పాషాణసామాన్యముల శోధనములలో కాకరాకును విశేషముగ నందరు తంత్రకారులు నంగీకరించి ప్రయోగసరళిని గనపరచియున్నారు. ఈ గ్రంథకర్తయుకూడ పాషాణజాతిలోజేరిన తాళకశోధనమున తైలమునకన్న కాకరయే శ్రేష్ఠమని గ్రహించెను. కాకర పాషాణదోషముల నిర్మూలము జేయుట సర్వజనవిదితము గాన నిందు గ్రంథవిస్తరమగునని విడనాడితి.

—॥ తాళకసేవచేగల్గు గుణములు. ॥—

క॥ హారిదళము సేవజేసిన
నరులకు విషకుష్ఠభూత నాశకమగుచున్ ।
జ్వరవాత పైత్యకఫముల
తరుణులపుష్పము హరించు తాళకముభువిన్॥ 33॥

వ్యా॥ శుద్ధిచేసిన హారిదళము(తాళకము)యొక్క భస్మమును సేవించువారలకు విషదోషములును కుష్ఠవ్యాధులును భూతవికారములు (మానసికరోగములు) ను నశించును. జ్వరమును వాతపైత్యకఫంబుల వికారములను హరించును. స్త్రీలయొక్క రజస్సును నశింపజేయును.

—॥ తాళకసత్వము. ॥—

§ (౧) రసరత్నసముచ్చయము:—శుద్ధిజేసిన హారిదళమును ఉలవకషాయము మజ్జిగ ఎనుమునెయ్యి తేనె అను నీద్రవములలో నానబెట్టి యొకమట్టిపిడతలోబెట్టి యొకమూకుటికి నడుమ రంధ్రముజేసి దానిచేమూసి సందులేకుండ చీలజేసి మూతనడుమనుండు రంధ్రమును పేడచేమూసి సంప్రదాయములనెరింగి క్రింద క్రమాగ్నులచే మంటవేయునది. ఈప్రకారము ఒకజాముకాలము మంటవేసి పిమ్మట మూతయొక్క రంధ్రమునకు బెట్టినపేడ నూడదీసి యుంచునది. ఆరంధ్రమునుండి తెల్లనిపొగ మెల్లగవెడలు సమయముజూచి మంట నార్చునది. స్వాంగశీతలమైన పిదప నాపిడతను వెలికిందీసి దానవంటియుండు తెల్లని సత్వమును మెలకువతో దీయునది.

(౨) శుద్ధిచేసిన తాళకము నొకపలమాత్రము గ్రహించి జిల్లేడుపాలు బోయుచు నొకదినమంతయు మర్దనము జేసి యొకపలమాత్రము తైలమునుకలిపి మూసమొదలగువానియందుంచి సంప్రదాయముల నెరింగి కోష్ఠియంత్రమున బెట్టి యేడుజాములకాలమూది స్వాంగశీతలమయినవెనుక కొలిమిలో క్రింద తెల్లనై వ్యాపించియుండు సత్వమును గ్రహించునది.

(3) తాలకమును గుజ్జము, గొజ్జె, వీనియొక్క జొల్లుచేతను ప్రత్యేకముగ జేర్చి మిక్కిలిశ్రద్ధతో రెండు దినములు మెత్తగనూరి యాచూర్ణమున ద్రావణవర్గమున జెప్పిన ద్రవ్యములగలిపి గాజుకుప్పెలో బెట్టి యాకుప్పెకు మూడు వరుసలు చీరమట్టినిబూసి యెఱ్ఱనియెండ నెండించి యుంచునది. పిమ్మట కోష్ఠికాయంత్రమున నడుమద్వారముండునట్లుజేసి యాబిలమున కుప్పె సగమువరకు నిమిడియుండునట్లు ఇమిడించి యగ్నినిడి పండ్రెండుజాములకాలము మంట జేయునది. స్వాంగశీతలమైన వెనుక కుప్పెను వెలికిందీసి యాకుప్పెయొక్క కంఠప్రదేశమున తెల్లగ నావరించియుండు సత్వమును గ్రహించునది.

(४) మరియు అర్ధపలము తాళకమును తెల్లగానుండు గట్టిబట్టతో మూటగట్టి మూటపైభాగమున గంధకమును నీళ్లలో మెత్తగనూరి మూడుసార్లు పూయుచు నెండనెండించునది. పిమ్మట మూడుపలముల రాగిని కరిగించి యందు పైజెప్పిన తాళకపుమూట నుంచి తోడనే బూడిదెచే తామ్రసముదాయమును మూయునది. చల్లారినపిదప వెలికిందీసి రాగిరేకును నావరించి తెల్లనగు తాళకసత్వముండును. అనంతరము తామ్రపు బిళ్లనుండి సత్వమును మాత్రము గ్రహించునది.

పైజెప్పినిన తాళకసత్వము తాళకమందలి గుణములను గలిగియుండునదెగాక క్షయమును, శ్వాసకాసమును, క్రూరమగు కఫవ్యాధులనుగూడ నివర్తిజేయును. ఇయ్యది యొకయవపరిమితిలో నెనిమిదవభాగము మొదలు ఒక యవపరిమితివరకు ననుపానముల నెరింగి మిక్కిలి మెలకువతో నుపయోగించవలెను. ఇది సుకుమారులకును గర్భిణులకును బహుజాగ్రతగ నుపయోగించవలెను.

## — తాళకసిందూరము. —

౧. శుద్ధిజేసిన పత్రతాళకము నొక పలము గ్రహించి దిగువను పైనను మంచి దళసరియగు కాకిబంగారు లేక శ్వేతాభ్రికపు రేకులనుంచి సన్ననిదారముతో బిగియునట్లు కట్టి దానిపైన రెండుమూడువరుసలు చీర జేసియెండించి సంప్రదాయముల నెరింగి కుక్కుటపుటము వేయునది. స్వాంగ

శీతలమున నైచీరను జాగ్రతగవదలించి యభ్రకపురేకులనడుమ నెఱ్ఱగ బిళ్ళవలె నుండు తాళకమును గ్రహించునది. దీనినే తాళక సిందూరమని వాడెదరు. ఇది యెఱ్ఱనై మాణిక్యమువలె నుండుటచేత మాణిక్యరసమనియు వంగదేశీయులు వచించెదరు.

౨. శుద్ధమగు తాళకపురేకులను పైజెప్పినచొప్పున అభ్రకపురేకుల నడుమనుంచి యీసముదాయమును చిన్న పొయ్యిమీద బెట్టి యడుగున స్పిరిటు లాంపునుంచి వెలిగించునది. ఈ దీపపుకాకను అరగంటలో నభ్రకపు రేకులనడుమనుండు తాళకము చక్కగకరిగి యెఱ్ఱగపరిణమించును. పాకము నెరింగి క్రింద దీపమును దీయునది. స్వాంగశీతలమైనవెనుక అభ్రకపురేకుల నడుమనుండు తాళకసిందూరమును గ్రహించి పదిలము జేయవలెను. ఈ రెండువిధములగు ప్రక్రియలలోను మొదటిది యుత్తమము. దీనిని కాటుకవలె మెత్తగనూరి భద్రపరచవలెను. కఫముతోకూడిన శ్వాసకాసములు క్షయము అనువ్యాధులలో తడవకు ఒకయవపరిమితిలో నెనిమిదవభాగము మొదలు ఒక యవపరిమితి దనుక ననుపానములనెరింగి యిచ్చునది. ఇట్లు రోజుకు రెండు తడవలకన్న మించక యియ్యవలెను. 3-4 రోజులమీదట నివ్వకూడదు.

—॥ మణిశిల. ॥—

సీ॥ క్షితిని శ్యామాంగి కణచీరిక ఖండాఖ్య
లన మణిశిలమూట దనరుచుండు।
శ్యామాంగిభేదింప శ్యామ[1]మైయొప్పారు
నతిరక్తమగుచు ఖండాఖ్యదనరు।
తామ్రాభమై కాంతిదనరుచు చులకనై
కణచీరికాఖ్య సద్గుణములొప్పు।

1. (ఖ) లమైయొప్పు.

దినము సేవించిన దేహంబు లోహంబు
గావించు కుష్ఠముల్ కడకు దోలు।
ఆర్ద్రికము గుంటకలగర యగసిరసము
పోయుచును సప్తవారముల్ పొసగ నూరి।
భావనల్ సేయ శుద్ధియౌ భస్మమగును
రసములకునెల్ల నగ్రేసరంబు నగును॥ ౩౪॥

వ్యా॥ శ్యామాంగి, కణచీరిక, ఖండాఖ్యమునని మణిశిల మూడువిధములై యుండును అందు శ్యామాంగియనుదానిని నరికిన శ్యామలమగు వర్ణము కలదిగనుండును. ఖండాఖ్య మనుదానిని నరికిన మిగుల నెఱ్ఱనగు రంగుకలదై యుండును. కణచీరిక యనునది రాగిరంగుగలిగి తేలికగనుండును. ఇయ్యది యనేక మంచిగుణములతో కూడినదిగనుండును. శుద్ధిచేయబడిన మణిశిలను తగు ప్రమాణమున ప్రతిదినమును సేవించువారలకు దేహము లోహమువలె దృఢముగనగును. కుష్ఠవ్యాధులు నశించును. అల్లపురసము, గుంటకలగరాకు రసము, అగసియాకురసము వీనినిబోయుచు బాగుగనూరుచు నేడుమారులు భావనలజేసిన మణిశిల శుద్ధమగును. ఇయ్యది రసాయనంబులలో నుత్తమ రసాయనంబుగ పరిగణితమైనది.

## —॥ మణిశిల సత్వపాతనము. ॥—

౪(౧) రసరత్నసముచ్చయము:—శుద్ధిజేసిన మణిశిలకు ఎనిమిదవపాలు లోహకిట్టమును (ఇనుపచిట్టెమును) జేర్చి దానిలో బెల్లము గుగ్గిలము నెయ్యి చేర్చి మూసలోనునిచి కోష్ఠియంత్రమునబెట్టి గాఢాగ్నిగల్గునట్లూదినచో మన శ్శిలనుండి సత్వము వెడలును.

(౨) భూనాగ (వానపాముల) సత్వము వెలిగారము మంగకాయ అను నీద్రవ్యములను కాకరాకురసముననూరి యాపిష్టమును మూసకు లోభాగ

1. (ఖ) (గ) సరత్వమంది.

మున జక్కఁగఁబూసి యెండించునది. మనశ్శిలను క్షారములతోఁ గూర్చి యమ్ల రసములచేనూరి యామూసలోఁబెట్టి కోష్ఠయంత్రమున నునిచి యూదినచో సత్వము వెడలును.

—( అఞ్జనములు. )—

సీ॥ మునినాథ యఞ్జ[1]నంబులు నైదువిధములై
    తగనుండు నామభేదములచేత ।
సౌవీరమును రసాఞ్జనమును స్రోతోఽఞ్జ
    నంబును పుష్పాఞ్జనంబు మరియు ।
నీలాఞ్జనంబన నెగడుత్తరంబున
    పుట్టబోలికనుండు భూమిపెరిగి ।
ఖండింప గైరికకాంతి సౌవీరంబు
    నతిపీతమైన రసాఞ్జనంబు ।
నల్లనై యున్న నీలాఞ్జనంబటండ్రు
నలుపుతెలుపున స్రోతోఽఞ్జనంబటండ్రు ।
అన్నివిధములనున్న పుష్పాఖ్యమండ్రు
పసుపునను భృంగరసమున పొసగుశుద్ధి॥    3౫॥

వ్యా॥ సౌవీరాంజనము, రసాంజనము, స్రోతోంజనము, పుష్పాంజనము, నీలాంజనమునని అంజనములు పేరులభేదముచే నైదువిధములుగ నుండును. ఇవి యుత్తరదేశంబున పుట్టవలె పైకి పెరిగియుండు భూములయందుండును. అందు సౌవీరాంజనంబును నలియగొట్టిన గైరికధాతువుయొక్క కాంతి వంటి కాంతిని కలిగినదిగ నుండును. రసాంజనమును నలియగొట్టిన మిగుల

1. (ఘు) నము.

పచ్చగనుండును. నలుపుగ నుండునది నీలాంజనము. నలుపును తెలుపునుకలిసి యుండునది స్రోతోంజనము. అన్నివిధములగు రంగులు కలుగునేని పుష్పాంజన మనబడును. ఈయయిదువిధములగు నంజనములను పసుపుతోమర్దించి గుంట గలగరాకురసమున స్వేదనము జేసిన శుద్ధములగును.

—॥ అఞ్జన గుణము. ॥—

గీ॥ అఞ్జనంబులు సేవింప ననుదినంబు
వ్రణములను వాతపైత్యముల్ వక్త్రరుజల।
హిక్కలను శ్వాసకాసల నుక్కణంచు
కాంతినిచ్చును గరళముల్ కరగిపోవు॥ ౩౬॥

వ్యా॥ శాస్త్రవిహితపద్ధతి ననుసరించి శుద్ధిచేయబడిన అంజనములను సేవించువారలకు వ్రణములును వాతపైత్యవ్యాధులును ముఖరోగములును నశించును. హిక్కావ్యాధులు తగ్గును. శ్వాసవ్యాధులును కాసవ్యాధులు శమించును. దేహమునకు కాంతి కలుగును. విషములు నశించును.

—॥ అఞ్జనసత్వపాతనము. ॥—

రసరత్న సముచ్చయము:—స్రోతోఞ్జనముమున్నగు నఞ్జనములు మనశ్శిల సత్వపాతమునకు జెప్పిన ప్రకారము సంస్కారము జేసినచో వానినుండి సత్వము వెడలును.

♦ ఈ యైదువిధములగు నంజనములును దొరకుట దుర్లభమైయున్నది. అందు నీలాంజన సౌవీరాంజనములస్థానమున పాశ్చాత్యద్వీపములనుండి వచ్చు "అంటుమని" యను తళతళలాడు నల్లనయగు వస్తువును దేశీయవైద్యులును, యవనవైద్యులునుకూడ నుపయోగించెదరు. ఇది యంజనవర్గములో జేరినదిగాదని యనేకులమతము. మరియు ౹మానిపసుపున నాలుగురెట్లు మేకపాలను బోసి పరిభాషలనెరింగి కాచి వడియగట్టి శుద్ధమగు నాకషాయమును తిరుగ గట్టిపడువరకు కాచవలెను. ఈగట్టిబడిన రసక్రియనే రసాంజనస్థానమున చిర

కాలమునుండి వినియోగించుచున్నట్లు దెలియుచున్నది. దీనిప్రయోగవిధానము నార్యవైద్యు లుపయోగించిన ప్రక్రియాభాగమును గ్రంథరాజంబుల నంగీకరించినదిజూడ చిరకాలమునుండి యీఖనిజమగు రసాంజనము దుర్లభముగ నున్న ట్లెంచవలసియున్నదో లేక ఖనిజమగు రసాంజనమునకన్న పైప్రూని పసుపు రసక్రియయే అధికగుణదాయకముగ నుండునో నిర్ణయింప నసాధ్యముగ నున్నయది.

—॥ కంకుష్ఠము. ॥—

గీ॥ గజమువలనబుట్టు కంకుష్ఠకంబన
తెలుపు పచ్చదనము గలిగియుండు ।
కారమొగరు చేదుగలిగి రేచనమౌను
మూలప్లీహ గుల్మశూల లణచు॥   ౩౭॥

వ్యా॥ ఇచ్చట దీనిసంస్కృతమున « కేచిద్వద న్తికఙ్కుష్ఠం సద్యోజాతస్యద న్తినః । వర్చశ్చ '' యని గనబడుటచేతను కంకుష్ఠకమనునది యప్పుడు పుట్టిన యేనుగుపిల్లమలమని వ్యవహరించెదరు. అది తెల్లగను పచ్చగను నుండును. కారము ఒగరు చేదు అనురుచులం గలిగియుండును. ఈ కంకుష్ఠము విరేచనములం జేయును, మూలవ్యాధి ప్లీహవ్యాధి గుల్మము శూలవ్యాధి అను నీరోగముల నశింపజేయును.

§ (౧) రసరత్నసముచ్చయము:— « హిమవత్పాదశిఖరే కఙ్కుష్ఠ ముపజాయతే। తత్రైకం నాలికాఖ్యం హి తదన్యద్రేణుకం మతమ్ । శ్యావపీతం లఘుత్యక్త సత్వం నేష్టం హి రేణుకమ్ » ఈగ్రన్థమువలన హిమవత్పర్వతశిఖరమున కంకుష్ఠము బుట్టుననియు అయ్యది నాలికము రేణుకమునని రెండువిధములై అందు రెండవది శ్యావపీతవర్ణములుగల్గి సత్వరహితమగుటం జేసి క్రియోపయోగార్హముకాదనియు విశేషముగ దెలియుచున్నది.

ఈ రెండు మతములును ప్రాచీనకాలమునుండి తంత్రజ్ఞు లంగీకరించి యుండినను అక్కాలమున వాడుకలోనుండుటంజేసి యీవైద్యావతంసుడు అపుడుబుట్టిన యేనుగపిల్ల మలము నే కంకుష్ఠముగ గ్రహించెను.

—॥ కంకుష్ఠశుద్ధి. ॥—

*దీనిసంస్కృతమున "కఙ్కుష్ఠం శుద్ధిమాయాతి త్రిధాశుణ్ఠ్యమ్బుభావితమ్" కంకుష్ఠమును శుంఠీకషాయమున మూడుసార్లు భావనజేసినచో శుద్ధమగునని తెలియుచున్నది. ఈగ్రంథమున నద్దానికి శుద్ధియనవసరమని విడిచి నట్లూహించెదను.

వ॥ ఇవి యుపరసంబులు. మునీంద్రా! సాధారణరసంబు లెరింగించెద॥ ౩౮॥

వ్యా॥ స్పష్టము.

—॥ సాధారణ రసములు. ॥—

గీ॥ గౌరిపాషాణ కంపిల్లకములు వహ్ని
జారనవసార శైలసిన్దూరములును।
దరదము కపర్దికయును మృదారశృంగి
యను రసంబులు సాధారణాఖ్యలంద్రు॥ ౩౯॥

వ్యా॥ గౌరిపాషాణము, కంపిల్లకము, అగ్నిజారము, నవాసారము, గిరిసిందూరము, దరదము, కపర్దికము (గవ్వలు), మృద్దారుశృంగము, అనునివి యెనిమిదియు సాధారణరసములు,

—॥ సాధారణరస సామాన్యశోధనము. ॥—

*రసరత్నసముచ్చయమున:—గౌరీపాషాణముమున్నగు సాధారణరసములన్నియు మాతులుంగ రసమునను అల్లపురసమునను మూడు అహోరాత్రములు భావనజేసి యెండించినచో శుద్ధములగును.

## —( పాషాణము. )—

సీ॥ మునినాథ పాషాణములు రెండు గౌరిపా
షాణంబు నుల్లిపాషాణమనగ ।
తెల్లనై యొప్పారు నుల్లిపాషాణంబు
గౌరిపాషాణంపు కాన్తి [1]పసుపు ।
పాషాణములు శుద్ధిబడిన యమృతంబౌను
నవి శుద్ధిగాకున్న హానిజేయు ।
నుల్లిపాషాణంబు మెల్లన తేనెతో
నొకజాము వండిన నౌనరుశుద్ధి ।
గౌరిపాషాణ శుద్ధి జంబీరరసము
పోసి మర్దించి [2]గుడ్డను పొసగగట్టి ।
[3]నేర్పుతో డుత సున్నపు నీటిలోన
డోలయన్త్రింబునను జామువండ శుద్ధి॥ ౪౦॥

వ్యా॥ గౌరిపాషాణమనియు, ఉల్లిపాషాణమనియు పాషాణములు రెండు తెఱంగులనుండు. అందుల్లిపాషాణము తెల్లగను గౌరిపాషాణము పచ్చగను నుండును. ఈపాషాణములు సరిగ శుద్ధులు చేయబడియె నేని యమృతతుల్యములుగ పనిచేయును. అట్లుకానిచో ప్రాణహానిం గలిగించును. అందుల్లిపాషాణంబును తేనెలో వైచి యొకజాము వండిన శుద్ధమగును. గౌరిపాషాణంబును నిమ్మకాయలరసముబోసి మర్దనము జేసి దానిని గుడ్డయందుగట్టి కుండయందు సున్నపునీటినిబోసి అందు డోలయంత్రంబునవండి స్వేదనము జేసిన శుద్ధమగు

1. (క) రక్త. 2. (ఖ) (గ) బట్టను.

8. (ఖ) (గ) నేర్పుతో డుత సున్నపు నీళ్ళవండ రసమునకు సత్వ మొసగు జ్వరంబు ఉణచు.

ను. పాషాణము రసబంధనకారియై రసమునకు బలకరముగనుండును. జ్వరములను పోగొట్టును.

ఇచ్చట "గౌరీపాషాణకఃపీతో వికటోహతచూర్ణకః" అని దీనిసంస్కృతమూలమున గౌరిపాషాణము ఒకటిగానే గ్రహించబడియున్నది. రసరత్నసముచ్చయమున "స్ఫటికాభశ్శంఖాభః హరిద్రాభస్త్రయస్స్మృతాః" అని మూడువిధములుగను "గౌరీపాషాణకః ప్రోక్తో ద్వివిధః శ్వేతపీతకః" "శ్వేతఃశంఖసదృక్షీతో దాడిమాభఃప్రకీర్తితః। శ్వేతఃకృత్రిమకఃప్రోక్తః పీతః పర్వతసంభవః" అని ఆయుర్వేదప్రకాశమునను జెప్పియుండుటచేతను గౌరిపాషాణము నైజమైనదనియు తక్కినవి కృత్రిమములనియు దెలియుచున్నది. ఈ గ్రంథమునకు మూలమగు సంస్కృత గ్రంథమున నైజమగు గౌరిపాషాణమునుమాత్రమే గ్రహించి మిగిలినవానిని విడిచినట్లెంచవలెనో లేక సంస్కృతమూలమున లేఖకదోషమున "స్ఫటికాభశ్చ" అనునీవాక్యమును విడిచియుండెనో ఊహించజాలను. ఈ గ్రంథకర్త నైజమగు గౌరిపాషాణమును జెప్పుచు తద్భేదములగు శంఖపాషాణము, ఉల్లిపాషాణము, దొడ్డిపాషాణము మొదలగు కృత్రిమములగు పాషాణము లాకాలమునకే ప్రసిద్ధిలోనుండినను వానినన్నిటిని గ్రహించక యాకృత్రిమజాతిలో క్రూరమగు ఉల్లిపాషాణమునుమాత్రము గ్రహించినట్లు దోచుచున్నది.

## —॥ పాషాణసత్వపాతనము. ॥—

శ్రీరసరత్నసముచ్చయము:—గౌరిపాషాణమునకు తాళకమునకు జెప్పిన క్రమముగ సంస్కారముజేసినచో నందుండి సత్వము వెడలును.

## —॥ కంపిల్లకము. ॥—

సీ॥ అమర సౌరాష్ట్రదేశమునందు గనిద్రవ్య
కంపిల్లకము బుట్టు కాంతితోడ ।

[1]పాలయుచు నిటుకరాల్ పాడిరీతి నెట్టనై
కనుపట్టు రుచిచాల కలిగియుండు।
భావసల్ జంబీరఫలరసంబున జేయ
పరిశుద్ధమై నేత్రపటల మణచు।
వాతహిధ్మా ధ్మానవ్రణముల బోకార్చు
పైత్యరోగంబుల పారదోలు।
కడుపు నొప్పుల హరియించు కఫమణంచు
మూలరోగంబులను ద్రుంచు ముదిమి [2]గూల్చు।
నుదరముల గుల్మశూలల మదమణంచు
కఠినజ్వరముల విడిపించు కాంతినిచ్చు॥ ౪౧॥

వ్యా॥ కంపిల్లకము సౌరాష్ట్రదేశమందుండు గనులనుండి త్రవ్వితీయబడును. అది మిగుల కాంతిగలిగి ఇటుకపొడివలె నెఱ్ఱగానుండును. మిగుల రుచికలదిగ నుండును. కంపిల్లకము నిమ్మపండ్లరసమునందు భావనలం జేసినచో పరిశుద్ధమగును. ఇయ్యది నేత్రపటలములను వ్యాధులను, వాతవ్యాధులను, ఎక్కిళ్లను, కడుపుబ్బరమును, వ్రణములను, పిత్తరోగములను పోగొట్టును. కడుపునొప్పులను, కఫసంబంధములగు వ్యాధులను, మూలరోగంబులను పోగొట్టును. అకాలమందు గలుగు ముసలితనమును బోనాడును. మహోదరవ్యాధిని గుల్మములను శూలలను పోగొట్టును. మిగుల కఠినములై యసాధ్యములుగ నుండు జ్వరములను హరించును. దేహమునకు మంచి కాంతికలుగునట్లు చేయును. కరక్కాయకషాయమున డోలాయంత్రమునవండిన కంపిల్లము శుద్ధమగునని బసవరాజీయమునుండి దెలియుచున్నది.

---

1. (క) (ఖ) (గ) పాలుపెనయుచు నిటికెపొడిరీతి నెఱ్ఱనై.
2. (ఖ) (గ) ద్రుంచు.

—॥ నవాసారము. ॥—

సీ॥ విను నవాసారంబు జనియించు రీతి నీ
కెరిగింతు మునివర్య సరసమైన ।
*యొరగొమ్ము చెక్కను నొనరంగభస్మము
గావించి నీళ్ళను గలిపి వండి ।
[1]క్షారముల్ జేసి యాక్షారముల్ పటువుచే
నేఁడుమారులు గూడ వండ ।
పొలుపొందు నదిలోహములకు సూతమునకు
ద్రావణంబును జారణం బొనర్చు ।
పంచగుల్మములణచు శోభల [2]నదల్చు
అర్శ శోషలగెల్చు ప్లీహలదెరల్చు ।
నస్యవిధులకు చాల విన్నాణ మొసగు
సారమైయుండు విను నవాసార మిలను॥ ౨౫॥

తా॥ వరగోగుచెక్కనుకాల్చి భస్మముచేసి యాబూడిదెను క్షారపరిభాషలనెరింగి నీటియందుంచి యానీరిగురునంత వరకు వండవలెను. ఇటులనేడుసారులు వండినపిదప సిద్ధమగు క్షారము నవాసార మనంబడును. ఇట్టినవాసారము లోహంబులకును రసంబునకును ద్రావణసంస్కారమునైనను జారణసంస్కారమునైనను చేయునపుడు మిగుల నుపయోగించును. ఇయ్యది అయిదువిధములగు గుల్మములను, నంజులను, ప్లీహము(జ్వరబల్ల)లను, అర్శోవ్యాధిని,ముఖశోషమును, నశింపజేయును. మరియు రసవాదమునందలి విధానములకు మిగులనుపకరించును. నవాసారము సర్వవిధముల సారవంతమై యొప్పుచుండును.

1. (గ) క్షారముల్ పులుపుచే నేరుపు కడుమించ, 2. (ఖ) నణంచు.
* "వరగోగు" అను పాఠముచితము.

—॥ అగ్నిజారము. ॥—

చ॥ యతివర యగ్నినక్రపుగ్రహంబుల మావి మహాబ్ధిచే బహి
ర్గతమయి యెండచే కరుడుగట్టిన పావకజారమంద్రుడు సం
తతమును సేవ జేసినను దారుణవాతకఫాదిదోషముల్
గతముగ జేయుజారణము కాంతియుసూతముకిచ్చునెప్పుడున్॥

వ్యా॥ మునిశ్రేష్ఠుడా! అగ్నినక్రంబని ప్రసిద్ధిజెందిన సముద్రమున సంచరించు మొసలియొక్క మావి (గర్భస్థజంతువు నావరించియుండు పొరవంటి యొకవిధమగు జరాయువను పేరుగల చర్మము) యాజంతువులచే విడువబడి తరంగంబులయందుబడి కొట్టుకొనివచ్చి గట్టునంబడి యెండి బిగిసిపోవును. దీనికే అగ్నిజారమనిపేరు. దీనిని మితపరిమాణంబున ప్రతిదినంబును సేవించుచుండిన కఠినములగు వాతాదిదోషంబుల ప్రకోప ముపశమించును. మరియు నీయగ్నిజారము రసముయొక్క జారణసంస్కారమునను రంజన సంస్కారమునను మిగుల నుపయోగించును. దీనినే "అంబరు" అని కొందరువచింతురు.

సముద్రమందు బుట్టిన దీనికి క్షారోదక సంబంధ మధికమగుటంజేసి శుద్ధమైయుండునుగాన శుద్ధి యనవసరమని తంత్రకారులమతము.

—॥ గిరిసిందూరము. ॥—

క॥ తతగిరిసిందూరము ప
ర్వతశిలలను బుట్టు రక్తవర్ణం బగుచున్ ।
హితవుగ త్రిదోషముల కు
ద్ధతి దీపనపాచనంబు లలరు మునీన్ద్రా॥  ౭౭॥

వ్యా॥ విస్తీర్ణములైయుండు పర్వతములయందలి రాళ్ళలో గిరిసిందూర ముద్భవించును. అది యెఱ్ఱనిరంగుకలదిగనుండును. దీనిని సరియగు ప్రమాణంబున సేవించిన దేహంబున కావశ్యకంబగురీతి వాతపిత్తకఫంబుల బెంపొందించియుంచును. దీపనపాచనంబుల గలిగించి జఠరాగ్నిని సరిచేయును.

— ఇంగిలీకము. —

సీ॥ [1]దరదంబు విను ద్వివిధంబునై శుకతుండ
హంసపాదాఖ్యల నమరు భువిని।
ఘనజపాకుసుమసంకాశమై బరువునై
హంసపాదంబుండు నంతకంటె।
ప్రకటమై యుండును శుకతుండ చర్మార
మను సంజ్ఞ నతిరక్తమగుచు నెపుడు।
భావనల్మరి నిమ్మపండ్ల రసంబున
నల్లంపురసమున నమరుశుద్ధి।
సర్వదోషజ్వరంబుల సంహరించు
దీపనం బిచ్చు జఠరాగ్ని దృఢము జేయు।
నధికవీర్యాభివృద్ధియౌ నమృతమగుచు
గరళముల ద్రుంచు నింగిలీకంబు భువిని॥ ౪౫॥

వ్యా॥ శుకతుండమనియు హంసపాదమనియు నింగిలీకము రెండువిధములై యుండును. అందు దాసానిపూవువలె నెఱ్ఱనై బరువుగలిగినది హంసపాదంబను నింగిలీకము. శుకతుండమనునది కాంతియందును గుణమునందును శ్రేష్ఠతయందును పైదానిని మించియుండును. దీనికే చర్మారమనియు పేరు కలదు. ఇంగిలీకము నిమ్మపండ్లరసంబునను అల్లపురసంబునను బాగుగ భావనలు గావించిన శుద్ధమగును. ఇద్దానిని సేవించిన సర్వవిధములగు దోషజ్వరంబులను హరించును. అగ్నిదీపనమును కలిగించి జీర్ణశక్తిని దృఢపరచును. వీర్యవృద్ధిని కలుగజేయును. అమృతముబోలె విషదోషములను శమింపజేయును.

---

1. (ఖ) దరదంబు విను ద్వివిధంబులౌ హంసపాదాఖ్యల సోయగంబలరుచుండు

ఇచ్చట నాంధ్రీంబున ద్వివిధంబులగు దరదంబులలో శుకతుండము ప్రకటగుణమనియు హంసపాద మల్పగుణమనియు చెప్పబడినది. సంస్కృతము న దానికి వ్యతిరిక్తముగ ప్రథమ మల్పగుణమనియు ద్వితీయము ప్రకటగుణ మనియు చూపబడినది,

—॥ హింగుళసత్వపాతనము ॥—

శ్రీరసరత్నసముచ్చయము:—హింగుళమును పాతనాయంత్రమున యథోక్తవిధిగ వండినచో నందుండి సూత (రస)మను శుభ్రమగుసత్వము వెడలును.

—॥ గవ్వ. ॥—

సీ॥ భువిని సాగరమందు పొడము వరాటంబు
పచ్చనై తెల్లనై బరువుగలిగి।
పనియేనిచిన్నముల్ పరికింప శ్రేష్ఠంబు
మూడయొత్తుండిన మధ్యమంబు।
ఏడుచిన్నము లడ్డిగెత్తు కనిష్ఠంబు
నుత్తరోత్తరగుణం బుల్లసిల్లు।
కాంజికంబున శుద్ధి గల్గు వరాటంబు
పరిణామశూలల పరిహరించు।
గ్రహణి కఫవాతనేత్రరోగము లణంచు
నధికవీర్యాభివృద్ధియై యాకలిచ్చు।
క్షయములను బాపు కాకయు సంభవించు
మహితగుణసాంద్ర యాత్రేయమానిచంద్ర॥ ౪౬॥

వ్యా॥ వరాటము (గవ్వ) సముద్రంబున జనించును. అది పచ్చగను తెల్లగను బరువుగలదిగను నుండును. అందు పదునైదుచిన్నముల (అరతుల

మెత్తు) తూనికగలిగిన గవ్వ శ్రేష్ఠమైనది. ఒకమాడ (పావుతులము) యెత్తుండుగవ్వ మధ్యమమైనది. ఏమున్నరచిన్నముల (అరపావలా) యెత్తు కలిగియుండునది యాధమమైనది. ఇట్లివి పైపైది క్రింది క్రింది దానికంటె నుత్తమముగనుండును. ఈవరాటంబును కాంజికంబున స్వేదనము జేసిన శుద్ధినందును. ఇట్లు శుద్ధిచేయబడిన వరాటముయొక్క భస్మమును సేవించిన పరిణామశూల లణంగును. గ్రహణులును కఫదోషంబులును వాతదోషంబులును నివర్తించును. నేత్రరోగంబులు శమించును. వీర్యవృద్ధి జేయును. ఆకలిబుట్టించును. క్షయవ్యాధులు తగ్గును. తగునుష్ణమును కలిగించును.

—॥ మృదారుశృంగి. ॥—

సీ॥ జలధితీరమున ఘూర్జరదేశమున పర్వ
 తంబున బుట్టు మృదారుశృంగి ।
పచ్చనై యొక్కింత బరువునై దళయుక్త
 మై మెరుగును కాంతి యలరుచుండు ।
రసబంధనము కేశ రంజనం బొనరించు
 కఫవాత పైత్య హృద్గదము లణచు ।
సర్వవ్రణంబుల గర్వంబు బోకార్చు
 కుష్ఠరోగంబుల గూల జేయు ।
[1]గణుతికెక్కిన యాయార్ద్రికమును మాతు
లుంగరసమున మృద్దారుశృంగి మొదలు ।
గలుగు సాధారణాఖ్యాల గలరసములు
శుద్ధి బొందును కాయసంసిద్ధి జేయు॥ ౮౭॥

1. (క) త్రిదినముల నార్ద్రికరసాన నొదవు శుద్ధి।మాతులుంగరసంబున మరియు వెలసి । శుద్ధి బొందును కాయ సంసిద్ధి జేయు। మహిత గుణసాంద్ర యాత్రేయ మానిచంద్ర॥

వ్యా॥ ఘూర్జరదేశపు సముద్రప్రాంత ప్రదేశములయందుండు అంబుదమను పర్వతమున మృదారుశృంగి యుత్పన్నమగును. ఇయ్యది పచ్చగను బరువుగను రేకులు కలదిగను నుండి మెరుగులు గ్రక్కుచు కాంతిమంతమై యలరారుచుండును. రసబంధనమును జేయును. వెండ్రుకలకు రంగునిచ్చును. త్రిదోషజన్యవ్యాధులను హృదయరోగంబులను పోగొట్టును. వ్రణములను బోగొట్టును. కుష్ఠవ్యాధులను హరించును.

మృదారుశృంగి మొదలగు నీ సాధారణరసంబులనెల్ల అల్లపు రసమునను మాదీఫలరసంబునను వైచి మూడునాళ్లు భావనలుచేసిన శుద్ధములగును. మంచిదేహసిద్ధిని కలిగించును.

ఈయాశ్వాసంబున నింతవరకును నిరూపింపబడిన మహారస ఉపరస సాధారణరసంబుల పరిగణనమునుగురించియు వరుసనుగురించియు విభాగమును గురించియు పూర్వరసగ్రంథంబులయందు భిన్నములగు ప్రక్రియ లగుపడుచున్నవి. ఎట్లన్న ? రసార్ణవమున :— “మాక్షికో విమలశ్శైలః చపలో రసకస్తథా సస్యకో దరదశ్చైవ స్రోతోఽఞ్జనమథాష్టమమ్ । అష్టౌమహారసాశ్చైవ మే తాన్ ప్రథమతశ్శృణు॥ ఏవం మహారసాః ప్రోక్తాః” అని మాక్షికము, విమలము, శిలాజతువు, చపలము, రసకము, మైలతుత్థము, దరదము, సోత్రోంజనము అను నీయెనిమిదియును మహారసంబులనియు ;

“శృణుష్వోపరసాన్ ప్రియే । గంధకస్తాలకశ్శైల స్సౌరాష్ట్రీ ఖగగైరికం । రాజావర్తశ్చకంకుష్ఠం అష్టావుపరసాః స్మృతాః” అని గంధకము, తాళకము, మణిశిల, కాంక్షీకము, అన్నభేది, గైరికము, రాజావర్తము, కంకుష్ఠము, అను నీయెనిమిదియు నుపరసంబులనియు ;

“అభ్రకం కాంతపాషాణం వజ్రం వైక్రాంతకం శృణు” అని అభ్రకము, అయస్కాంతము, వజ్రము, వైక్రాంతము అను నీనాలుగును శక్తరసంబులనియు చెప్పబడియున్నవి.

రసరత్నసముచ్చయమున :— “అభ్రవైక్రాంతమాక్షీక విమలాద్రిజసస్యకమ్ । చపలో రసకశ్చేతి జ్ఞాత్వాష్టౌ సంగ్రహేద్రసాన్॥” అని అభ్రకము,

వైక్రాంతము, మాక్షికము, విమలము, శిలాజతువు, సస్యకము, చపలము, రసకము నను నెనిమిది మహారసంబులును; "గంధాశ్మగైరికాసీస కాంక్షీతాళశిలాఞ్జనం । కంకుష్ఠంచేత్యుపరసాశ్చాష్టౌ పారదకర్మణి॥" అని గంధకము, గైరికము, కాసీసము, కాంక్షి, తాళకము, మణిశిల, అంజనము, కంకుష్ఠము, అను నీయెనిమిదియు నుపరసంబులనియు "కంపిల్లశ్చాపరోగౌరిపాషాణో నవసారకః । కపర్దోవహ్నిజారశ్చగిరిసిందూరహింగులౌ । బోదారశ్శృంగమిత్యష్టౌ సాధారణరసాఃస్మృతాః॥" అని కంపిల్లము, గౌరిపాషాణము, నవాసారము, వరాటిక, అగ్నిజారము, గిరిసిందూరము, ఇంగిలీకము, మృదారుశృంగి, అనునివి యెనిమిదియు సాధారణరసంబులనియు నిరూపించుచు శక్తిరసంబుల జెప్పక అభ్రివైక్రాంతాదులను మహారసాదులయందు చేర్చియు రాజావర్తాదులనెందును పరిగణనము చేయకయు వైప్రక్రియనుండి భేదించుచున్నది.

ఇట్లే శివతత్త్వరత్నాకరమున:—"భూనాగఘనవైక్రాంత విమలాతాప్యతుత్థకాః । ఖర్పరీరాజవర్తశ్చ ఖ్యాతాఅష్టౌమహారసాః॥" అని భూనాగము, అభ్రికము, వైక్రాంతము, విమలము, తాప్యము, తుత్థము, కర్పరి, రాజావర్తమునను నివి యెనిమిదియు మహారసంబులు. "గంధకంకుష్ఠకాసీస శిలాకాంక్షీవరాటికా । గైరికస్తాలకశ్చాష్టౌ ఉపపూర్వారసాఅమీ॥" అని గంధకము, కంకుష్ఠము, కాసీసము, మణిశిల, కాంక్షి, వరాటిక, గైరికము, తాళకము అనునివి యెనిమిదియు నుపరసంబులు.

"గిరిసిందూరబోదారు శృంగిగౌరీశిలాంజనమ్ । కంపిల్లశ్చపలఃప్రోక్తాస్సాధారణరసాఇమే॥" అని గిరిసిందూరము, మృదారుశృంగి, గౌరిపాషాణము, శిలాజతువు, అంజనము, కంపిల్లకము, చపలము అనునివి సాధారణరసంబులు.

"హింగులంసస్యకంచైవ శిలాజత్వగ్నిజారకః । ఏతేశక్తిరసాఃప్రోక్తాశ్చత్వారోరసనాశనే॥" అని ఇంగిలీకము, సస్యకము, శిలాజిత్తు, అగ్నిజారము

ఇవి నాలుగును శక్తిరసములు అను నీవిభాగమునుచూపుచు పైరెండు ప్రక్రియలకును భేదించియున్నది.

ఆనందకందమున. "గంధతాళశిలాతాప్య ఘనహింగుళగైరికాః । చపలాశ్మ జయానాగహరితాళాగ్నిజారకాః । ఖర్పరీశుల్ఖకంకుష్ఠ గిరిసిందూరటంకణాః । కంపిల్లవిషకాసీస గౌరిపాషాణభూఖగాః । బోదారుశ్శృంగ సిందూరస్తువరిశ్చరసాంజనమ్ । నీలాంజనంచసౌవీరం స్రోతోంజనమఫేనకమ్ । పుష్పాంజనంశంఖశుక్తిశంబూకాశ్చవరాటకాః।సాంబ్రాణిచనవక్షారం యవక్షారకుమారికా।సజ్జగుగ్గులులాక్షాశ్చ క్షారాశ్చలవణానిచ।గోరోచనోఽమ్లవేతశ్చ కాచాభ్రఖగవాలుకాః।ఏతేఉపరసాఃఖ్యాతాః రసరాజస్యకర్మణి॥" అని నిరూపించుచు పారదమును రసంబుగను అదిగాక తక్కుంగల పైజెప్పబడిన మహారసోపరససాధారణరసాదులును క్షారంబులును విషంబులును లవణంబులును కాచము ఇసుక మొదలగునవియు ఇవియన్ని చేరియుపరసంబులనియు చెప్పబడియున్నవి.

భావమిశ్రుడును తదనుయాయులగువారును ఇట్లే పారదంబును రసంబుగ నిరూపించి తక్కినవానిలో కొన్నిటినిచేర్చి యుపరసంబులుగ నిరూపించుచు నిట్లు చెప్పియున్నారు:—"గంధోహింగుల మభ్రతాళకశిలాః స్రోతోఽఞ్జనంటంకణం । రాజావర్తకచుంబకౌచ స్ఫటికాశ్శంఖః ఖటీగైరికమ్ । కాసీసంరసకంకపర్ది సికతాబోలాశ్చ కంకుష్ఠకం । సౌరాష్ట్రీచమతా అమీ ఉపరసాః సూతస్యకించిద్గుణైః॥" అను నిదిమొదలగువానియం దిట్లు గనుబడుచున్నది. మరియు నాయుర్వేదప్రకాశమున "అభ్రవైక్రాన్త......" అని యెనిమిది మహారసములజెప్పి పైజెప్పిన "గన్ధోహిఙ్గుళ......" అను శ్లోకముచేతనే ఉపరసములను జెప్పి సాధారణరసములను వేరుగజూపక విడువబడినది.

ఇత్తెరంగున నాయాతన్త్రములయందు పరస్పరభిన్నములగు ప్రక్రియ లగుపడుచున్నవి. వీనికన్నిటికినికారణములు ఆయాద్రవ్యములయొక్క యుపయోగభేదమునఁబట్టి కొన్నిటి నొకవర్గముగ జేర్చి కొందరు వానికి శక్తిగసాది నామంబులిడుటయు మరికొందరట్లుగాక నెుకేగణముగ నిరూపించుటయు మరికొందరు

మహారసాదినామంబుల నిరూపించుటయు ఒకరికాలంబున నెరుగబడనిపదార్థము లుమరియొకరికాలమున తెలుసుకొనబడుటయు అందుతమతమయనుభవమునుబట్టి పూర్వులచే మహారసంబులయందు చేర్పబడియుండునది యుపరసంబుల చేర్పబడుటయు క్తమని కొందరకు పొడకట్టుటయు ననునీ మొదలగునవియై యుండవలయును. కావున పరస్పరమును పూర్వగ్రంథములయందీప్రక్రియలు భిన్న భిన్నములై కనుపట్టుచుండుట దోషావహముకాదు. ఇందు వైరసప్రక్రియయంతయు ప్రాయికముగ శివప్రోక్తముగదా? అట్టిదానియందీప్రక్రియాభేదంబు లేల కలుగవలయును? అని కొందరకు సందియముతోచవచ్చును. మన పూర్వులందరును తాము కనుగొనిన యొక వైజ్ఞానికవిషయమును భగవదుపదిష్టమని చెప్పి తమ యహంకారమును నశింపజేసికొనుచుండుటయు, స్వవిరచితములగు నుత్తమ గ్రంథములు భగవత్ప్రోక్తములుగ జెప్పుచు తమ యభిజ్ఞత్వము నుపసంహరించుకొనుచుండుటయు, జనసంఘమున కాచరణీయములుగ విధించు సాంఘికాచారంబులకు మతసంబంధమును కలుగజేసి దానిచే శీలాది సంస్కరణము చేయుచుండుటయు నందరెరింగినదియే కావున మన మీసందేహము నుంచుకొనవలసిన యగత్యముండదు. పై జెప్పబడిన ప్రక్రియావిభాగముల యందు మనప్రస్తుత గ్రంథమున రసరత్నసముచ్చయ ప్రక్రియ యనుసరింపబడినది. విభాగములును పరిగణనములును కొంచెమును భేదించుచుండలేదు. ఇట్టి భేదములన్నియు విజ్ఞులు పరిశీలింతురుగాకయని గ్రంథవిస్తరభీతిచే నింతటి విరమించుచున్నాడను.

వ॥ ఇంకనహిఫేనంబాదిగాగలుగు ద్రవ్యంబులకు శుద్ధిగుణంబు లెరింగించెద వినుము. ౭౮॥

వ్యా॥ ఇంతవరకు మహారసోపరస సాధారణరసంబులకు శుద్ధిగుణాదులు తెలుపబడినవి. ఇక నల్లమందు, వత్సనాభి, పెలిగారము, విషముష్టి, నేపాళము, గుగ్గిలము ననువాని శుద్ధియు గుణంబులును మొదలగువానిని వివరించెదను.

—॥ నల్లమందు. ॥—

సీ॥ పశ్చిమంబున [1]పొత్తు ఫలముల బుట్టును
విను మఫేనము రెండువిధము లగుచు।
స్వేద [2]పిండము ఫలభేద [3]పిండము లన
స్వేదపిండం బతిశ్రేష్ఠ మగును।
బలురక్క సాకులోపల నఫేనంబుంచి
డోలయంత్రంబున పాల వండి।
కడకు దీసియు నీళ్ళ గడిగిన శుచి యౌను
యోగంబులందు ప్రయోగ మొనరు।
శ్వాసదుర్నామ క్రిమిగుల్మకాస లణచు
దీపనము పాచనము చేయు తాప మణచు।
క్షయములను ద్రుంచు గ్రహణుల జక్క జేయు
నిలుపు బలుపును పుట్టించు నిద్ర మాన్పు॥ ౭౯॥

తా॥ నల్లమందు పశ్చిమదేశమున పోస్తుకాయల పండ్లనుండి సిద్ధము చేయబడును. ఇది స్వేదపిండము ఫలభేదపిండము నని రెండువిధములనుండును. అందు స్వేదపిండంబనబడునది మిగుల ప్రశస్తమైనది. అట్టి నల్లమందును బలురక్కసియొక్క ఆకునందు మాటుబెట్టి డోలయంత్రంబున పాలుజోసి దానిపై స్వేదనము జేసి నీళ్లచేగడిగిన శుద్ధమై యోగంబులయందు చేర్చుకొనుటకు యుక్తమైయుండును. ఇట్టి నల్లమందు శ్వాసవ్యాధి, దుర్నామమను వ్యాధి, క్రిమివ్యాధి, గుల్మవ్యాధి, కాసము, వీనినన్నిటిని నశింపజేయును. దీపనపాచనంబుల గలిగించును. తాపంబు నుపశమింపజేయును. క్షయవ్యాధులను

1. (ఖ) పోస్తు. (గ) పుస్తు. 2. (ఖ) సిద్ధము. 3. (ఖ) సిద్ధము.

గ్రహణివ్యాధులను హరించును. శరీరమునకు పుష్టిని కలుగచేయును. అతిని ద్రవః తగ్గించును.

ఇచ్చట “సముద్రేచైవజాయన్తే విషమత్స్యాశ్చతుర్విధాః । తేభ్యః ఫేనంసముత్పన్నం అహిఫేనంచతుర్విధం॥ కేచిద్వదన్తిసర్పస్యఫేనంస్యాదహిఫేనకమ్” అని రససారమునుండి అఫేనము సముద్రమందలి విషమత్స్యముల నుండి కలుగుననియు అది నాలుగువిధములనియు దెలియుచున్నది. మరియు సర్పవిషమును అహిఫేనమని కొందరు వచించుటయుకూడ స్పష్టముగ దెలియుచున్నది. ఆనందకందాది తంత్రకారులు పైవిషములయందు అఫేనశబ్దమును వినియోగించినను, ఈవైద్యశిఖామణి యిక్కాలమున బ్రసిద్ధమగు నల్లమందుకే యాశబ్దమును వాడినట్లు తెలియుచున్నది.

—( వత్సనాభి. )—

సీ॥ విషములు ద్వివిధమై విలసిల్లు నిర్విష
 వత్సనాభియనంగ వసుధలోన ।
[1]వత్సనాభియు నాల్గువర్ణములై యొప్పు
 ధరణి శ్వేతాదిభేదములచేత ।
ఖర్జూర [2]ఫలకళగల వసనాభియు
 రసయోగములయందు బొసగుచుండు ।
మునుపుగా త్రిఫలగోమూత్ర భావనలచే
 నెండింప బరిశుద్ధి నుండు నాభి ।
వైద్యు లనుపానయుక్తితో వత్సనాభి

1. (ఖ) (గ) వసనాభియును. 2. (ఖ) ఫలముపొంకముగలవసనాభి.

పథ్యమొనరింపగా నీయ ప్రాణికోటి ।
వాతకఫకుష్ఠ జ్వరయక్ష్మఘాత లణచు
[1]పాటిసేయంగ వసనాభి సాటిగలదే॥ ౫౦॥

వ్యా॥ నిర్విషము, వత్సనాభియని నాభి రెండువిధములై యుండును. ఇట్టి నాభి తెలుపుమొదలగు వర్ణభేదములచే నాలుగువిధములై యుండును. అందు ఖర్జూరపుకాయలవంటి రూపుగల వత్సనాభి శ్రేష్ఠమైనది. ఇది రసయోగంబులయం దుపయోగించుటకు మిగుల నుపయుక్తముగనుండును. వత్సనాభిని త్రిఫలకషాయమునందును గోమూత్రమునందును భావనజేసి యెండించిన పరిశుద్ధమగును. ఇట్లు శుద్ధమైననాభిని మంచి నేర్పరులగు వైద్యులు మంచి యనుపానముతోఁగూడ పరిమితినెరింగి యుపయోగించి తగుపథ్యము నేర్పరచిన వాతవ్యాధులు, కుష్ఠము, కఫవ్యాధులు, జ్వరములు, రాజయక్ష్మ వీనినన్నింటిని పోఁగొట్టును కావున వత్సనాభికి తగునోషధి వేరుండదు.

— వెలిగారము —

క॥ వెలిగారము గోక్షీరం
బుల కొబ్బరినీళ్ళ నిమ్మపులుసున శుచియై ।
యలరుచు వాంతిభ్రాంతులు
గలరుజముల నితరరోగగణముల గెలుచున్॥ ౫౧॥

వ్యా॥ వెలిగారమును ఆవుపాలయందును, టెంకాయనీటియందును, నిమ్మపండ్లరసమునను వేసి సంప్రదాయముల ననుసరించి భావనజేసిన శుద్ధినందును. అట్లు శుద్ధమైన వెలిగారము నుపయోగించిన వమనవిరేచనములును మతిభ్రమణమును కలిగియుండు వ్యాధులను హరించును.

1. (ఖ) (గ) మహితగుణసాంద్ర యాత్రేయ మౌనిచంద్ర.

"లికుచస్యఫలస్యాపి రసేనాపిజలేనవా టంకణంశోధయేత్ క్షీరేనారికేళ జలేనవా" అను నీసంస్కృతమున నీళ్లునుగూడ వెలిగారమును శుద్ధి జేయుట కుపయోగింపదగునని విశేషము గన్పట్టుచున్నది.

—॥ విషముష్టిగింజలు వానిశుద్ధి. ॥—

క॥ ఎంచ విషతిందుకంబును
కాంజికమున శుద్ధిబొంది ఘనరోగములన్ ।
ద్రుంచుచు శుభ మొసగును బా
లించగ విషతిందుకంబు వెలయే దిలలో॥ ౧౨॥

వ్యా॥ "త్రిదినంకాంజికేస్విన్నం" అను దీనికి మూలమగు సంస్కృతముచే విషతిందుకమును కాంజికమున మూడుదినములు సంప్రదాయములనెరింగి ఆవిరిచే నుడికింప శుద్ధమగునని విశేషము దెలియుచున్నది. అద్దాని నుపయోగింప పక్షవాతము మొదలగు క్రూరవ్యాధులను పోగొట్టి సౌఖ్యమును కలుగ జేయును. కావున వాతవ్యాధుల విషతిందుకంబునకు తగునదిమరియొకటిలేదు.

—॥ నేపాళములు. ॥—

క॥ విను నేపాళము గోమయ
మున పాలను వండ శుద్ధి బొందుచు నతిరే ।
చనమై గుల్మోదరముల
ఘనశూలల జ్వరవికారగణ మణచు మునీ॥ ౧3॥

—॥ ఆశ్వాసాంతము. ॥—

మాలినీ॥ అతులితమణిహారా [1]అనుపూర్వావతారా ।
జితసురరిపువీరా శ్రీరమాహృద్విహారా ।

---

1. (క) అనుపూర్వోపకారా.

వితరణగుణపూరా వేదశైలప్రచారా।
శ్రితజనభయదూరా శ్రీనృసిహ్మావతారా॥ ౫౭॥

గద్య॥ ఇది శ్రీమద్వైద్యవినోద శ్రీవత్సగోత్రానుమోద వేదాన్తాచార్య పుత్ర నృసిహ్మవర ప్రసాదలబ్ధ కవితాచాతుర్య ముడుంబ వెంకటాచార్య ప్రణీతంబైన రసప్రదీపిక యను మహావైద్యశాస్త్రంబునందు నుపరస మహారస సాధారణ రసంబులు గలయది ద్వితీయాశ్వాసము సమాప్తము.



వ్యా॥ నేపాళములను సంప్రదాయములనెరింగి గోమయంబున డోలాయంత్రంబున నుంచి వండి పిమ్మట గోక్షీరంబుల డోలాయంత్రంబున వండ శుద్ధములగును. అట్టి నేపాళంబులను పరిమితులనెరింగి సేవించిన నధికముగ రేచనము జేయును. గుల్మములను మహోదరములను నశింపజేయును. శూలలను రూపుమాపును. జ్వరములను పోగొట్టును.

—( గుగ్గులుశుద్ధి. )—

దీని సంస్కృతమూలమున గుగ్గిలముయొక్క శుద్ధి యిట్లు చెప్పబడి యున్నది.

“నిదిగ్ధి కామృతావాశా ముస్తారిష్టపటోలకైః। భృంగరాజం త్రికటుకం భాండాంతస్సువినిక్షిపేత్। దుకూలయంత్రే సంశుద్ధో గుగ్గులుశ్శుద్ధిమృచ్ఛతి॥” వాకుడు, తిప్పతీగె, అడ్డసరము, తుంగముస్తలు, వేప, చేదుపొట్ల, గుంటగలగర, శొంఠి, పిప్పలి, మిరియములు వీనినెల్ల రసముదీసి యారసంబుల నొకకుండయందుంచి దుకూలయంత్రముపై వండిన గుగ్గిలము శుద్ధిబొందును. (వలసిన ద్రవ్యరసంబుల కుండయందుంచి కుండమువాసెనగట్టి దాని

యందు వలయు ద్రవ్యంబులనుంచి పైన మూకుడుమూసి చీరమంటినిచ్చి కుండ పొయ్యిపైనమర్చి మంటబెట్టిన నావిరికి వాసెనలోనుండు ద్రవ్యముకరిగి గుడ్డనుండి రసంబులయందుఁబడి పేరుకొనును. దీనికే దుకూలయంత్రమని పేరు). ఇట్లు శుద్ధమైనగుగ్గిలమును ఔషధయోగంబుల నుపయోగించుకొన వలయును. గ్రంథకర్త ఇద్దాని నాంధ్రమున విడుచుటకు తగుకారణ మరయఁజాల.

ఇతి శ్రీమన్మహీశూర మహారాజధానీ మధ్యవిద్యోతమాన సర్వతోభద్ర దివ్య
రత్న సింహాసనాధీశ్వర శ్రీమద్రాజాధిరాజేత్యాది బిరుదావళీ విరాజమాన
శ్రీశ్రీకృష్ణరాజసార్వభౌమ సంస్థానాస్థానాయుర్వేద విద్వద్వైద్య
ప్రకాణ్డ శ్రీమద్రాజకీయ సంస్కృత మహాపాఠశాలాయుర్వేద
మహోపాధ్యాయ అగరం.పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసే
వాసమాసాదితాయుర్వేదవిద్యా సత్సంప్రదాయ గౌతమగోత్ర
విరాజమాన దివ్యాన్వవాయ శ్రీకృష్ణమాచార్యపౌత్ర కోదండ
రామాధ్వరి దౌహిత్ర రామకృష్ణార్య రాజ్యలక్ష్మ్యమ్బా
తనూభవ సకల సహృదయ విధేయ శ్రీమత్పంచమజార్జి
చక్రవర్తి ప్రదత్త "వైద్యరత్న" బిరుదావళీ విరాజ
మాన "ఆయుర్వేదమార్తాండ" భిషఙ్మణి,
పండిత గోపాలాచార్య విరచితంబైన
"ప్రభ" యను రసప్రదీపికాన్ధ్ర
వ్యాఖ్యానమున ద్వితీయాశ్వాసము
సమాప్తము.

# తృతీయాశ్వాసము.

మొదటి రెండాశ్వాసములయందు రసము, ఉపరసములు, మహారసములు, సాధారణరసములు, అను మొదలగువానిని సవిశేషంబుగ వివరించి యీయాశ్వాసంబున రత్నంబులను లోహంబులను చెప్పుచున్నాడు.

క॥ శ్రీరమణీహృదయేశ్వర
భూరికృపాపాంగ విమల[1]పుణ్యతరంగా ।
నారద సన్నుత దానవ
వీరాగ్రేసరవినాశ వేదాద్రీశా॥ ౧॥

వ॥ అవధరింపు [2]మశ్వనులు ధన్వంతరికిం జెప్పిన తెరంగున నగస్త్యుం డాత్రేయున కిట్లనియె. ౨॥

వ్యా॥ స్పష్టము.

క॥ ధరగల పాషాణంబుల
మరియాదలు చెప్పితింక మణినామములన్ ।
బరగిన నవరత్నంబుల
గురుతులు చెప్పెదను తెలిసికొనుము మునీంద్రా॥ 3॥

వ్యా॥ ఆత్రేయమునిశ్రేష్ఠుడా! ఇంతవరకును ధాతువులలో రసోపరసాదికమగు వాని వివరణంబులనెల్ల చెప్పితిని. ఇక మణు లనుపేరుచే ప్రసిద్ధములైయుండు నవరత్నంబులనుగురించి వివరించెదను వినుము.

---

1. (ఖ) పూర్ణ.
2. (గ) మట్లశ్వ.

—( నవరత్నములు. )—

గీ॥ వినుము మాణిక్యమౌక్తిక విద్రుమములు
గరుడ పచ్చయు పుష్యరాగంబు వజ్ర।
నీల వైడూర్య గోమేదకా లనంగ
వెలయు తొమ్మిది నవరత్నములు నటంచ్రు॥ ౮॥

వ్యా॥ పద్మరాగము, ముత్యము, పగడము, పచ్చ, పుష్యరాగము, వజ్రము, నీలము, వైడూర్యము, గోమేదకము నను నీతొమ్మిదియును రత్నంబులు.

—( ఆయారత్నంబులచే బ్రీతినందు గ్రహములు. )—

సీ॥ పద్మరాగము లోకబాంధవునకు బ్రీతి
మఱిచంద్రునకు బ్రీతిమౌక్తికంబు।
భౌమున[1]కును బ్రీతి పగడంబటం[2]డ్రుర్వి
బుధునకు బ్రీతి యింపొందు పచ్చ।
పుష్యరాగము సొంపు బురికొల్పు గురునకు
ఘనత వజ్రంబు భార్గవుని బ్రీతి।
నీలంబు శనికి వర్ణింపగా బహుప్రీతి
రమణ వైడూర్యంబు రాహువునకు।
ప్రీతి గోమేదకంబది కేతువునకు
గాన గ్రహపీడలకు శాంతి కాదలంచి।
రత్నభూషణచయ [3]మనురక్తి దాల్ప
కాంతి చెన్నొందు పీడలు శాంతిబొందు॥ ౧౯॥

1. (ఖ) (గ) కతి. 2. డ్రది. 3. (క) మును.

వ్యా॥ పైఁ జెప్పబడిన తొమ్మిదివిధంబులగు మణులలో మాణిక్యము (కెంపు)సూర్యునకును, ముత్తియము చంద్రునకును, పగడము అంగారకునకును, పచ్చ బుధునకును, పుష్యరాగము బృహస్పతికిని, వజ్రము శుక్రునకును, నీలము శనికిని, వైడూర్యము రాహువునకును, గోమేదకము కేతువునకును మిక్కిలి యిష్టములై యుండును. కావున నాయాగ్రహములచారము సరిగనుండక పీడల నందు వారా యాగ్రహములకు బ్రీతియు శాంతియు కలిగి పీడలు నివర్తించుటకై మణిభూషణంబుల ధరింపవలయును.

వ॥ అందు [1]మాణిక్యాది రత్నభేదంబుల వర్ణగుణంబు
లెఱింగించెద వినుము. ౬॥

వ్యా॥ వానిలో మాణిక్యము మొదలుగాగల మణులయొక్క వర్ణంబులు గుణంబులును చెప్పెదవినుము.

## —॥ మాణిక్యము. ॥—

సీ॥ పద్మరాగఖ్యాతి బరగు మాణిక్యంబు
బహుకాంతి వంతమై పరిఢవిల్లు।
పద్మపత్రాభమై బరువును మెరుగును
స్ఫుటమును వట్రువై స్థూలమైన।
పద్మరాగం[2]బది పరిశుద్ధమని యంద్రు
చులకనై చిపిటమై మలినమైన।
రంధ్రంబు వక్రత రౌక్ష్యంబు గలిగిన
కార్శ్యమై యున్నను గానిదంద్రు।
భూతభేతాళ పాపముల్ వాతపైత్య

1. (క) మాణిక్యాది భేదంబులు.  2. (గ) బతి.

శ్లేష్మములడంచు రుజముల తీక్ష్ణమణచు।
పీడలనుబాపి [1]జనులకు ప్రీతిజేయు
మహిత గుణసాంద్ర యాత్రేయ మానిచంద్ర॥ ౭॥

వ్యా॥ మాణిక్యము పద్మరాగమను పేరున నొప్పుచుండును. అయ్యది తామర రేకువంటి కాంతికలిగి బరువుకలదై తేజోవంతమై స్ఫుటముగనుండి గుండ్రనై పెద్దదిగనుండి నునుపైనదిగను విశాలముగను హెచ్చు తగ్గులులేక సరిసమానముగను నుండినయెడ మిగుల శ్రేష్ఠమైనదిగ నెరుంగునది. తేలికయైనదియు మట్టుకలదియు మలినమైనదియు చిల్లులుకలిగినదియు వంకరగనుండునదియు పెళుసుగుణము కలిగినదియు గరగరలాడుచుండునదియు వెలవెలబోవుచుండునదియునగు మాణిక్యము దుష్టమైనదిగ తెలియదగినది. మరియు నిచట "మాణిక్యం పద్మరాగాఖ్యం ద్వితీయంనీలగంధిచ। కుశేశయ...... ......శ్రేష్ఠముచ్యతే॥ నీలగంగాంబుసంభూతం నీలగర్భారుణచ్ఛవి। పూర్వం మాణిక్యవచ్ఛ్రేష్ఠం మాణిక్యంనీలగంధియత్॥"అను నీమొదలగు వాక్యంబులచే పైజెప్పబడినయట్లుత్తమగుణములు కలిగిన పద్మరాగమను శ్రేష్ఠమాణిక్యము గాక నీలగంధియను మరియొక శ్రేష్ఠమాణిక్యము కలదనియు; నియ్యది నల్లని గంగాజలంబుల బుట్టుననియు; నీలవర్ణముగలిసిన యెఱ్ఱనికాంతిగల్గి యొప్పుచుండుననియు; ఈ నీలగంధియు పద్మరాగమువలె శ్రేష్ఠమైనదియేయనియు నొకవిశేషము తెలియదగినదిగ నున్నది. ఈ మాణిక్యమును శాస్త్రోక్తవిధిననుసరించి శోధనమారణంబుల నందించి సేవించిన "మాణిక్యందీపనంవృష్యం కఫవాతక్షయార్తినుత్" అనిచెప్పబడినచొప్పున అగ్నిదీపనమును కలిగించి వాతపిత్తశ్లేష్మములవలన జనించు క్షయాదికములగు సమస్తవ్యాధులను పోగొట్టును. భూషణముగ ధరించినచో భూతములు మొదలగు మానసికములగువ్యాధులను, "కర్మజవ్యాధి నాశనమ్" అనునట్లు పూర్వకృతమగు

1. (క) బుధులకు.

పాపముల నశింపజేసి వానిద్వారమున కర్మవలన కలుగు వ్యాధులనుకూడ పోగొట్టును.

—॥ మాణిక్యశోధనము. ॥—

శ్రీవైద్యచిన్తామణిః—"అశ్వమూత్రాన్తరే భావ్యం త్రిదినం ప్రబలాతపే। తతోష్ణవారిణా క్షాళ్యం రత్నశుద్ధిర్భవిష్యతి॥" మాణిక్యమును గుఱ్ఱపుమూత్రమున నునిచి రాత్రియంతయు నానబెట్టి పగలు తీక్ష్ణమైన యెండనెండించునది. ఇత్తెరంగున మూడు అహోరాత్రములు భావనజేసి వేడినీళ్లచే గడిగిన మాణిక్యము శుద్ధినందును.

—॥ మాణిక్యభస్మము. ॥—

శ్రీవైద్యచిన్తామణిః—"తన్మాణిక్యం రవిక్షీరే దివసత్రయభావితమ్। శరావే త్రిపుటం పాచ్యం భస్మీభవతి తత్క్షణాత్॥" శుద్ధిచేయబడిన మాణిక్యమును జిల్లేడుపాలలో మూడుదినములు భావనజేసి మూకుటిలోబెట్టి పైన మూకుడు మూసి చీలజేసి యెండించి సంప్రదాయములనెరింగి మూడుపుటములు బెట్టినచో శుద్ధముగ భస్మమగును.

—॥ శ్రేష్ఠమైన ముత్యము. ॥—

గీ॥ ఆణిపాణియుగల్గి శ్వేతాభ [1]మగుచు
వట్టువై చుక్కనై తోయవర్ణమగుచు।
స్వచ్ఛమై నిర్మలంబుగ చక్కనైన
మౌక్తికమ్ము శుభంబంద్రు మానిచంద్ర॥　　౮॥

వ్యా॥ గుండ్రముగ నుండునదియు నీరుగలిగినదియు తెల్లనికాంతికలిగినదియు గుండ్రముగ నుండునదియు తేలికయైనదియు నీటియొక్క కాంతి కలిగినదియు స్వచ్ఛముగ నుండునదియు నలుసులు మొదలగునవి లేనిదియు

1. మెఱసి.

అందమైనదియునగు ముత్తియము శ్రేష్ఠమని యెరుంగునది. ఇచ్చట ఆణి, పాణియను రెండుగుణంబులు చెప్పబడినవి. ఆణియనగ ముత్యములయందుండు గుండ్రదనము పాణియనగ ముత్యములయందుండు నీరు. ఇట్టివిశేషణములచే గుండ్రముగను నీరుకలదిగను నుండవలయునని సిద్ధమగుచున్నను మరల "వర్తులమై" "తోయవర్ణమగుచు" నను విశేషణము లుపయోగింపబడినవి. అయినను "ఆణి" "పాణి" యనుపదములచే చెప్పబడినవి ముత్తియములయందు మాత్ర ముండు గుణవిశేషములనియు తక్కిన విశేషణాదులచే చెప్పబడినవి వస్తుసామాన్యమున నగుపడుచుండు గుణసామాన్యములనియు పరిష్కారము చేసికొనిన పునరుక్తిదోషముండదు. ఇట్లే "స్వచ్ఛమై" "నిర్మలంబుగ" అను విశేషణములకును విషయవిభాగమును చేసికొనునది.

—॥ శ్రేష్ఠముకాని ముత్యములు. ॥—

గీ॥ ఉప్పువలెనున్న పైపొర గప్పియున్న
గొగ్గులైయున్న వికటమై కూడియున్న ।
నలుపు నెరుపును రూక్షత కలిగియున్న
గుంటలుండిన ము[1]త్యంబు కూడదండ్రు॥ ౯॥

వ్యా॥ ఉప్పురాయివలె కాంతి తగ్గియున్నను ముత్యముపై పొరలున్నను బుడుపులులేచి గొగ్గుపారియుండినను వంకరవంకరగ నొకదానితో మరియొకటి అంటుకొనియుండినను నల్లగగాని ఎఱ్ఱగగానియుండినను నీరులేక పెళుసుగుణము కలిగియుండినను ముత్యముపై గుంటలేర్పడియుండినను అట్టి ముత్యము శ్రేష్ఠముకాదు. దాని నౌషధంబుల నుపయోగింపరాదు.

—॥ ముత్యపు గుణములు. ॥—

గీ॥ మౌక్తికము సేవజేసిన మానవులకు
నాయురారోగ్యకరము వీర్యాభివృద్ధి ।

---

1. (ఘ) త్యముల్ కూడవండ్రు.

యాకలియుగల్గి రక్తపైత్యక్షయాది
దోషముల బాపి పుష్టియు దుష్టినొసగు॥     ౧౦॥

వ్యా॥ ముత్యమును విధివిహితమగువిధమున శోధనమారణంబులం జేసి సేవించిన అట్టివారికి మంచియారోగ్యము కలిగి ఆయుష్యము పెంపొందియుం డును. వీర్య మభివృద్ధమగును, దీపనపాచనంబులం జేసి యాకలిని కలిగించును. రక్త పిత్తము క్షయము మున్నగు రోగముల నెల్ల పోగొట్టును. మంచిదేహపుష్టిని మనోబలమును కలుగ జేయును.

—॥ ముత్యముల శోధనము. ॥—

శ్రీవైద్యచిన్తామణి:—"మౌక్తికం శోధయేదమ్లైః కాఞ్జికైర్నిమ్బుకద్రవైః। గోమూత్రే శోధయేత్పశ్చాత్ శోధయేత్పయసాతథా । కుష్మాణ్డీఫలజద్రావైః భావితం దివసత్రయం । అథవాతిన్త్రిణీద్రావైః శుద్ధిర్భవతిమౌక్తికమ్॥"

(1) ముత్యములను అమ్లవర్గపురసము కాంజికము నిమ్మపండ్లరసము గోమూత్రము ఆవుపాలు అను నీద్రవములయందు ప్రత్యేకముగ భావనలజేసి నచో శుద్ధినందును.

(2) లేక తెల్లయుప్పిపండ్లరసముననైనను చింతకాయలరసముననైనను మూడుదినములు భావనజేసినచో ముత్యములు శుద్ధినొందును.

—॥ ముత్యముల భస్మము. ॥—

శ్రీవైద్యచిన్తామణి:—"శుద్ధముక్తాఫలం శ్వేత బృహతీఫలజైర్ద్రవైః। భావితం భూపుటే పాచ్యం భస్మ శుద్ధం భవిష్యతి॥" శుద్ధిచేయబడిన ముత్యములను తెల్లములకపండ్లరసమున భావనజేసి మూకుటంబెట్టి మూకుటిచేమూసి చీరమన్ను జేసి యెండించి భూపుటంబిడిన భస్మమగును.

—॥ ముత్యముల భస్మము. ॥—

♦ శుద్ధిజేసిన గోణీముత్యములను లేక బెజ్జములువేయని నూకవంటి ముత్యపుచూరను మంచి సజాతిఖల్వమందుంచి శుద్ధమగు పన్నీటితో విమువక

రెండువారములు లేక మెత్తగ కాటుకవలె తేలికభస్మమగువరకును మర్దనము జేయవలెను. యీనానిసంప్రదాయముల యిట్టిప్రక్రియలు మెండుగ గలవు. ఇది సున్నమువలె నుండక వేగరహితమై మిక్కిలి సుకుమారముగ పని జేయును. వేడిజేయదు. ముత్యపుసున్న మెంతటివేగముగ కఫప్రధానమగు క్షయము మొదలగు వ్యాధులయందు బనిజేయునో అటులనే కేవలపిత్తము రక్తపిత్తము ప్రధానమగు క్షయవ్యాధులయందునగూడ నంతటిసుకుమారముగ నీభస్మము బనిచేయును. పన్నీరున నెన్నిరోజులు మర్దించిన యంతటి గుణాధిక్యముగ నెరుంగునది.

శుద్ధిజేసిన నవరత్నములలో పవడము వజ్రమునువిడిచి నెద్దానినైన నిదేరీతిని ఆయాజాతిమణుల కనుకూలమగు ఖల్వమునందుంచి పన్నీరుతో విడువక సంప్రదాయముల ననుసరించి మర్దించవలెను. ప్రతిమణియు భస్మరూపమును బొందును. వీని నాయావ్యాధులయందును ఔషధములయందును సంప్రదాయముల ననుసరించి వినియోగింపందగును. ఈప్రక్రియలు పలుదడవలు జేసి యనేకుల కుపయోగించితిని. విశేషగుణదాయకములుగ గనుగొంటిని.

కొందరు వజ్రమునుకూడ నైరీతినే పన్నీటితోనూరి మెత్తగనైన పిదప ఎండించి భద్రపరచెదరు. ఆయావ్యాధులయందు నుపయోగించెదరు. చక్కని గుణముల నిచ్చుచున్నయది. నవరత్నముల నేకముగజేర్చి నైరీతిని పన్నీటితో చిరకాలము సంప్రదాయముల ననుసరించి మర్దనముజేయవలెను. పిదప బిళ్లజేసి యెండించిన భస్మమగును. ఈభస్మమును భద్రపరిచి సమయములలో పరిమితుల నెరింగి వినియోగించెదరు.

## —॥ ముత్యముల ద్రుతి. ॥—

రసరత్నసముచ్చయము:—“ముక్తాచూర్ణంతుసప్తాహం వేతసామ్లేన మర్దితమ్। జమ్బీరోదరమధ్యేతు ధాన్యరాశౌ వినిక్షిపేత్। సప్తాహాదుద్ధృతం చైవ పుటే ధృత్వాద్రుతిర్భవేత్॥” ముత్యములపొడిచేసి యాచూర్ణమును పుల్లప్రబ్బలిరసమున నేడుదినములు మర్దనముజేసి నిమ్మపండునడుమ రంధ్రముజేసి

పైచూర్ణము నునిచి ధాన్యరాశిలో నేడుదినములకాలముండనిచ్చి వెలికిందీసి పుటము బెట్టినచో ద్రవించును.

—( పగడము. )—

సీ॥ లలి పక్వబింబఫలచ్ఛాయ విలసిల్లు
　　వట్టువై స్నిగ్ధమై వ్రణము వంక ।
కోటరంబులు లేక గొప్పలై కుదురైన
　　పగడంబు బహుశుభప్రదమటంద్రు ।
తొఱ్ఱలు వ్రణములు ధూసరం[1]బులును పాం
　　డుర తామ్రవర్ణముల్ పొరగుణంబు ।
కలిగిన పగడంబు కానిదంద్రు మునీంద్ర
　　సహదేవిచే శుద్ధిస రసమంద్రు ।
క్షయములను రక్త పైత్య కాసముల ముదిమి
నక్షిరోగంబులను గరళాదికముల ।
పరిహారము జేసి దీపనపాచనముల
గలుగ జేయును పగడంబు కాంతినిచ్చు॥　　౧౧॥

వ్యా॥ మనోహరమై పండిన దొండపండువంటి కాంతిగలిగి గుండ్రమైనను పుగలిగి బుడుపులుకాని వంకరగాని తొఱ్ఱలుగాని లేకగొప్పదై సరిగనుండు పగడము శ్రేష్ఠమైనది. తొఱ్ఱలుగాని బుడుపులుగానియుండినను ధూసరము (కొంచెము తెలుపు)గ గాని తెల్లగగాని రాగివలెగాని రంగుకలిగియుండినను పొరలు లేచియుండినను అట్టిపగడము శ్రేష్ఠముకాదు. మంచి పగడమును సహదేవిరసమున శుద్ధిచేయనగును. శోధనమారణంబుల జేసిన పగడమును సేవించు

1. (క) బును పాండు తామ్రవర్ణంబులు తనగుణములు.

వారలకు క్షయవ్యాధులు నశించును. రక్తపిత్తవ్యాధులు తొలగును. కాస వ్యాధులను అకాలపుముసలితనమును పోగొట్టును. నేత్రరోగంబులను విష దోషంబులను నివర్తింపజేయును. దీపనపాచనముల గలిగించును. దేహమునకు మంచికాంతిని కలుగజేయును.

—॥ పవడముల శోధనము. ॥—

శ్రీ వైద్యచిన్తామణి:—"జమ్బీరనీరాన్తరేణ భావితం యామమాత్రకమ్। ఉష్ణోదకే క్షాళయిత్వా శుద్ధం భవతి విద్రుమమ్॥" పవడమును నిమ్మపండ్లరసమున నొకజాము నానబెట్టి వేడినీళ్లచే కడిగినచో శుద్ధినందును.

—॥ పవడ భస్మము. ॥—

శ్రీ వైద్యచిన్తామణి:—"తద్విద్రుమం రవిక్షీరైర్భావితం దివసత్రయమ్। ఏవం గజపుటే పాచ్యం భస్మీభవతి తత్క్షణాత్॥" అట్టి శుద్ధమైన పవడమును జిల్లేడు పాలలో మూడుదినములు నానబెట్టి మూకుటిలోనునిచి పైన మూకుడుమూసి చీరచేసి యెండించి గజపుటం బిడినచో శుభ్రముగ భస్మమగును.

—॥ ప్రకారాన్తరమున పవడభస్మము. ॥—

♦ (౧) శుద్ధిజేసిన పవడములను కుందేటినెత్తురులో నైదారుతడవలు భావనజేసి పిదప గజపుటం బిడవలెను. స్వాంగశీతలమునదీసిన స్వచ్ఛముగు భస్మమగును.

(౨) శుద్ధిజేసిన పవడములను మొసలినెత్తురులో నైదారుసారులు భావనజేసి గజపుటంబిడిన స్వచ్ఛముగు భస్మమగును.

(3) మొసలినెత్తురు నొకటిరెండు శేరులదెచ్చి గట్టిగకాచి ముద్ద జేసి యాముద్ద మొసలినెత్తురున సిద్ధముజేయబడిన పవడభస్మమునకు రెట్టింపుగాజేర్చి ఖల్వమందుంచి బాగాకలియనూరి బిళ్లజేసి నీడనెండించునది. పిదప నాబిళ్లను మూకుళ్లలోనుంచి చీగజేసి యెండించి గజపుటము వేయవలెను. స్వాంగశీతలమునగ్రహించి చక్కగనూరి మంచిసీసాలో పదిలముగనుంచవలెను.

ఈభస్మము అన్నివిధములలో నుత్తమము. క్షయవ్యాధులలో నెట్టితరుణమం దైన నుపయోగించవచ్చును.

(౪) శుద్ధిజేసిన పొగడములను జిల్లేడుపాలతో నైదారుతడవలు భావన జేసి యెండించేది పిదప నేలయుసిరికాకును ముద్దగనూరి యాముద్దనడుము పవడములనుంచి మూకుళ్లలోనుంచి చీరజేసియెండించి గజపుటము వేయునది. స్వచ్ఛమగు భస్మమగును.

— గరుడపచ్చ. —

సీ॥ వసుధ తార్క్ష్యము హరిద్వర్ణమై యతికాంతి
వంతమై మసృణమై వర్ణ్యమగుచు।
బరువునై మెరుగునై భాసురంబై యున్న
లలిగరుడ పచ్చకు లక్షణంబు।
నల్లనై చుక్కనై తెల్లనై చిపిటమై
కపిలమై రూక్షకర్కశమునైన।
తార్క్ష్యంబు వలదండ్రు తగ నావుపాలచే
పరిశుద్ధమై [1]యొప్పు గరుడపచ్చ।
పాండు దుర్నామవిష సన్నిపాతములను
జ్వరములను శ్వాసకాసలఛర్ది గుణము।
నగ్నిమాంద్యంబులను ద్రుంచి యధికమైన
కాంతినిచ్చును తను మెచ్చు గరుడపచ్చ॥    ౧౨॥

వ్యా॥ శ్రేష్ఠమగు పచ్చ ఆకుపచ్చరంగుకలిగి మిగుల కాంతివంతమై నునుపుగ బరువుకలిగి మెరయుచు ప్రకాశమానమై మనోహరముగ నుండును.

---

1. (క) (గ) గరుడపచ్చయొప్పు.

నల్లగనుండినను తెల్లగనుండినను కపిలవర్ణము (గోరోచనపురంగు) కలదిగనుండి నను తేలికగనుండినను అడుగు గట్టియున్నను పెళుసుగనున్నను గరగరలాడు చున్నను అట్టి పచ్చ శ్రేష్ఠముకాదు. గరుడపచ్చను శోధనమారణంబుల జేసి సేవించిన పాండువ్యాధులను, దుర్నామ (మూలశంక) వ్యాధిని విషదోషం బులను, సన్నిపాతజ్వరంబులను, సామాన్యజ్వరంబులను, శ్వాసవ్యాధులను, కాసరోగంబులను, వమనవ్యాధులను, అగ్నిమాంద్యమును పోగొట్టును. శరీర మునకు మంచికాంతిని కలుగజేయును.

—॥ గరుడపచ్చ శోధనము. ॥—

శ్రీవైద్యచిన్తామణి:—"క్షిప్త్వా విదారికన్దాన్తః పుటే కౌక్కుటసంజ్ఞకే। పాచితంచాథతన్నీత్వా భవేన్మరకతం శుచి॥" మరకతమణిని నేలగుమ్మడిగడ్డ నడమనునిచి చీరమంటినిబూసియెండించి కుక్కుటపుటంబిడి సాంగశీతలమున గ్రహించిన శుద్ధినందును.

—॥ గరుడపచ్చ భస్మము. ॥—

శ్రీవైద్యచిన్తామణి:—"తతో మరకతంశుద్ధా రసేన పరిభావయేత్। పాషాణభేదీద్రావేణ మర్దితంచశరావకే। పుటమేకం తతః పాచ్యం భస్మీభవతి తద్ధ్రువమ్॥" శుద్ధిచేయబడిన మరకతమును వాకుడుకాయలరసమున భావన జేసి పాషాణభేది (కొండపిండివేళ్ల) రసమున మర్దనముజేసి బిళ్లచేసి యెం డించి మూకుటిలోబెట్టి పైన మూకుడుమూసి చీరచేసి యెండించి పుటముబెట్టి నచో భస్మమగును.

—॥ పుష్యరాగము. ॥—

సీ॥ పుష్యరాగము గోగు పువ్వురీతిగనుండు
శుద్ధమై మసృణమై స్థూలమగుచు।
బరువునై సమమునై [1]మెరుగొప్పియుండిన
పరిశుద్ధమనియండ్రు భవ్యచరిత।

1. (గ) మెరుపుగొల్పుచునుండ.

కపిలంబు మలినంబు కర్కశంబును పీత
పాండువర్ణంబున్న పరిహారంబు।
ధాన్యామ్లమున కుళుత్థక్వాథమున పుష్య
రాగంబు శుద్ధియై రహి వహించు।
దీపనము పాచనముగల్గి తీవ్రమైన
దాహమును ఛర్దిగుణము వాతమును కుష్ఠ।
గరళముల మాన్పి మిక్కిలి కాంతి నిచ్చు
కార్యమీడేర్చు పుష్యరాగంబు భువిని॥ ౧౩॥

వ్యా॥ పుష్యరాగము గోగుపూవువలె స్వచ్ఛమగు కాంతి కలిగియుండును. ఇయ్యది పరిశుద్ధముగను నునుపుగను లావుగను బరువుగను హెచ్చుతగ్గులు లేనిదిగను కాంతులు గ్రక్కుచును నుండిన శ్రేష్ఠమైనది. గోరోచనపురంగుగ గాని పచ్చగ గాని పాండువర్ణముగ గాని యుండినను మలినముగ నుండినను గరగరలాడుచుండినను శ్రేష్ఠముకాదు. పుష్యరాగభస్మమును సేవించువారలకు దీపనపాచనంబులు కలుగును. అత్యధికమగు దప్పిని వమనములను నిలుపును. వాతవ్యాధుల బోకార్చును. కుష్ఠవ్యాధుల నశింపజేయును. విషదోషములను శమింపజేయును. దేహమునకు కాంతిని కలుగజేయును. ఆరోగ్యసిద్ధిని తప్పక కలిగించును.

—( పుష్యరాగశోధనము, భస్మము. )—

శ్రీవైద్యచిన్తామణిః—“పుష్పరాగం ఛాగమూత్రైః భావ్యంశుద్ధం భవిష్యతి।తత్పుష్యరాగం పాషాణ భేదీద్రావేణ భావితమ్। విశ్వకర్మపుటేదగ్ధ్వా భస్మీభవతి తత్క్షణాత్॥” పుష్యరాగమును మేకమూత్రమున భావన జేసిన శుద్ధినందును. అట్టి పుష్యరాగమును పాషాణభేదిరసమున భావనజేసి మూకుటిలోనునిచి మూసి చీరజేసి యెండించి కొలిమిలోబెట్టి యూదినచో శుద్ధముగ భస్మమగును.

—॥ వజ్రము. ॥—

క॥ విను వజ్రము త్రివిధంబై
కనుపడు పుం స్త్రీ నపుంసకంబు లనంగా।
నొనరి మఱియుత్తరోత్తర
ఘనగుణముల నుల్లసిల్లు గరిమ మునీంద్రా॥ ౧౮॥

వ్యా॥ పురుషవజ్రమనియు, స్త్రీవజ్రమనియు, నపుంసకవజ్రమనియు, వజ్రము మూడువిధముల నుండును. ఇందు పూర్వపూర్వము ఉత్తరోత్తరమునకంటె రసవీర్యవిపాకంబులచే నుత్తమముగ గుణములంగలిగి ప్రకాశించు చుండును. అనగా:—నపుంసకవజ్రముకంటె స్త్రీవజ్రంబును దానికంటె పురుషవజ్రంబును గుణంబున నుత్తమములనుట.

ఇచ్చట। "నొనరిమఱియుత్తరోత్తర। ఘనగుణముల నుల్లసిల్లుగరిమ" యను పద్యభాగమువలన "పుంస్త్రీనపుంసక" వజ్రంబులలో పూర్వపూర్వమునకంటె నుత్తరోత్తరము శ్రేష్ఠమా? ఉత్తరోత్తరమునకంటె పూర్వపూర్వము శ్రేష్ఠమా? యను విషయమున సందిగ్ధముగ నగుపడుచున్నది. ఆయినను "పూర్వపూర్వమిహ శ్రేష్ఠం రసవీర్యవిపాకతః" అను వాక్యమువలనను, "స్త్రీపుంనపుంసకంవజ్రం యోజ్యం స్త్రీపుంనపుంసకే। వ్యత్యాసాన్నైవఫలదం పుంవజ్రేణవినా క్వచిత్॥" స్త్రీపురుషనపుంసకజాతులనుం జేరిన వజ్రంబులను క్రమముగ స్త్రీలకును పురుషులకును నపుంసకులకు నుపయోగింపవలయును. అట్లుగాక మార్పునంటెనేని ఫలమునీయవు. పురుషవజ్రము మాత్ర మెట్లయినను ఫలము నిచ్చును. అని చెప్పబడియుండుటచే పురుషవజ్రము తక్కినవానికంటె నుత్తమమని యేర్పడుచుండుటవలనను, ఈగ్రంథముననే "బహుగుణంబులతోడ రహించు మిక్కిలి పురుషాఖ్యవజ్రంబు పుణ్యచరిత" యని ముందు చెప్పబోవుచుండుటవలనను నిచ్చట నుత్తరోత్తరమునకంటె పూర్వపూర్వముత్తమగుణమని తాత్పర్యనిర్ణయము చేయుటయే యుక్తమము.

—॥ పురుషవజ్రము. ॥—

క॥ ఎనిమిది యంచులు పక్షము
లెనిమిది కోణంబులారు నేర్పడ సురరాట్ ।
ధనుకాంతి వారితరమై
యనువొందిన పురుషరత్న మండ్రు మునీంద్రా॥ ౧౫॥

వ్యా॥ ఎనిమిదంచులును ఎనిమిదిపలకలును ఆరుమూలలును కలిగియుండునదియు మేఘమునందలి యింద్రధనుస్సువలె కాంతులు కలిగినదియు నీటివలె నీడలదేరునదియు నగు వజ్రము పురుషవజ్రముగ దెలియదగినది.

—॥ స్త్రీనపుంసకాది వజ్రంబులు వానిగుణములు. ॥—

సీ॥ వర్తులంబై చిపిటవర్ణంబు గలిగిన
స్త్రీవజ్రమనియండ్రు ధీ[1]వరేణ్యా ।
*కంఠకోణాగ్రంబు ఘనవర్తులంబైన
నది నపుంసకమని యండ్రు బుధులు ।
వర్ణభేదములచే వజ్రంబు నాలుగు
జాతుల ప్రకటమౌ ఖ్యాతి మెరసి ।
బహుగుణంబులతోడ రహిమించు మిక్కిలి
పురుషాఖ్యవజ్రంబు పుణ్యచరిత ।
జరయు మరణంబు [2]రోగముల్ పరిహరించు
నధిక వీర్యాభి వృద్ధియై యాకలిచ్చు ।

*(ఇచ్చట "కంఠకోణాగ్రంబు" అను మూలంబును "కుంఠకోణాగ్రం" అను సంస్కృతపాఠభేదంబును అనన్వితములుగ నగుపడుచున్నవి.)

1. (ఖ) శరణ్యా.  2. (ఖ) (గ) దురితంబు.

మానవుల కెల్ల నమృతోపమాన మగుచు
సర్వరుజముల బాపు వజ్రంబు భువిని॥ ౧౬॥

వ్యా॥ గుండ్రనై అకుకులుగట్టియుండు నాకారము కలిగినదిగ నుండిన స్త్రీవజ్ర మనబడును. మణగిన మూలలును అంచులును కలిగి గుండ్రనై గొప్పదిగ నుండిన నపుంసకవజ్రమగును. పై జెప్పబడినయట్లు స్త్రీపున్నపుంసకములను భేదంబులచే త్రివిధంబులగు వజ్రంబులును సర్వపదార్థంబులకును వర్ణభేదమును బట్టి జాతిభేదమును చెప్పిన యొక భైరవుని సిద్ధాంతన్యాయమును బట్టి "శ్వేతాదివర్ణభేదేన తదేకైకంచతుర్విధమ్। బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రం... ......" అని చెప్పబడినయట్లు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రంబులను నాల్గు జాతిభేదములు కల్గినవగును. అందు శ్వేతవజ్రంబు బ్రాహ్మణజాతియనియు, రక్తవజ్రంబు క్షత్రియజాతియనియు, పీతము వైశ్యజాతియనియు, కృష్ణము శూద్రజాతియనియు తెలియదగినది. మరియు "......స్వస్వవర్ణఫలప్రదమ్। ఉత్తమోత్తమవర్ణంహి నీచవర్ణఫలప్రదమ్" అని ఆయాజాతి వజ్రంబులు ఆయాజాతుల మనుజుల కుపయోగించిన ఫలమునిచ్చుననియు; ఉత్తమజాతి వజ్రంబులు క్రిందిజాతి మనుజులకుగూడ నుపయోగింప నర్హంబులగుననియు (అనగా బ్రహ్మజాతివజ్రంబు నాలుగుజాతులవారికిని, క్షత్రియజాతిది క్షత్రియుడు మొదలుగ మూడుజాతులకును, వైశ్యజాతిది వైశ్య శూద్రులకును, శూద్రజాతి శూద్రులకుమాత్రమును నుపయోగించిన ఫలమునిచ్చుననుట) తెలిసెడిని.

ఈ చెప్పబడిన సర్వవిధములగు వజ్రములయందు పురుషజాతివజ్రంబులు అనేకములగు నుత్తమగుణములుకలిగి సర్వోత్తమమై యొప్పుచుండును. ఇట్టి యుత్తమవజ్రంబును భస్మముచేసి సేవించువారలకు అకాలంబునకలుగు మృతిని తప్పించును. సమస్తరోగంబుల నశింపజేయును. వీర్యవృద్ధిని చేయును. మంచి ఆకలిని కలిగించును, అమృతమువలె మనుజులకు సర్వరోగంబుల నివర్తింపజేసి యారోగ్యము నొసగును.

మఱియు "రసాయనే మతో విప్రః సర్వసిద్ధిప్రదాయకః । క్షత్రియో వ్యాధివిధ్వంసీ జరామృత్యుహరః స్మృతః॥ వైశ్యోధనప్రదః ప్రోక్తః తథా దేహస్యదార్ఢ్యకృత్ । శూద్రో నాశయతి వ్యాధీన్ వయః స్తంభంకరోతిచ" అని బ్రాహ్మణజాతివజ్రము రసాయనంబులయం దుపయోగింప నర్హంబై యట్టిరసాయనంబుల సేవించువారలకు అణిమాది సిద్ధుల నొసంగజాలి యుండు ననియు; క్షత్రియజాతివజ్రము సేవింపబడిన సమస్తములగు వ్యాధులను అకాలంబులకలుగు జరామరణంబులను పోగొట్టజాలియుండుననియు; వైశ్యజాతి వజ్రము ధరింపబడిన ధనము నాకర్షించునదిగను, సేవింపబడిన శరీరమున దృఢతను కలుగజేయునదిగను నుండుననియు; శూద్రజాతి వజ్రము సేవించువారి వ్యాధులను నశింపజేసి యౌవనము చిరకాలముండునట్లు స్తంభనముచేసి యుంచు సామర్థ్యమునకలిగియుండుననియు; నీ వజ్రజాతిభేద వినిర్ణయంబునకు ప్రయోజనము గ్రంథాంతరముల జెప్పబడియున్నది.

—॥ వజ్రశోధనమారణములు. ॥—

సీ॥ వాకుడువేరులో వజ్రంబు తగనిల్పి
  యది డోల యంత్రంబు నందుగట్టి।
తనరు కుళుత్థకో ద్రవ కషాయములచే
  నేడేసి దినములు నెనసి [1]వండ।
ముయ్యేడుమారులు నెయ్యిన వజ్రంబు
  ఖరమూత్రమున [2]ద్రోచి కాచిమఱియు।
కలియ మత్కుణ తాళకముల మూసయొనర్చి
  యామూసలో వజ్ర మమరబెట్టి।
మునుపుజెప్పినగతి నశ్వ మూత్రమునను
  కాచి త్రోచిన స్వచ్ఛమౌ కాంతిగలిగి।

1. (ఖ) (గ). వండి.  2. (క). రాచి.

పగులగొట్టిన వజ్రంబు భస్మమగును
మహితగుణసాంద్ర యాత్రేయ మానిచంద్ర॥ ౧౭॥

వ్యా॥ "అశుద్ధం కురుతే వజ్రం కుష్ఠం పార్శ్వవ్యథాం తథా । పాండుతాం పంగురత్వంచ తస్మాత్సంశోధ్య మారయేత్" శుద్ధిచేయని వజ్రమును భస్మము చేసి సేవించువారలకు కుష్ఠవ్యాధి కలుగును. పార్శ్వమునందు నొప్పికలుగును. పాండువ్యాధి జనించును. మరిగుజ్జును కలిగించును. అని చెప్పబడియుండు తెరంగున శుద్ధిచేయక వజ్రంబును భస్మముచేయుట యుక్తముకాదు. కావున మొదట శుద్ధిచేయవలయును. వాకుడువేళ్లు నూరిముద్దచేసి అందు వజ్రమును పొదిగి గుడ్డయందుగట్టి ఉలవలకషాయముతో నేడుదినములును ఆళ్ళకషాయముతో నేడుదినములును డోలయంత్రంబునవండిన శుద్ధినిపొందును. పిమ్మట నావజ్రంబును నిరువదియొక్కమారులు కాల్చుచు గాడిదెమూత్రంబున ముంచుచుండవలయును. వెనుక నల్లులను హరిదళమును కలిపి మూసజేసి యందు వజ్రమునుంచి కాల్చుచు వెనుకటివలెనే గుఱ్ఱపుమూత్రమున నిరువదియొక్కమారులుముంచిన స్వచ్ఛముగ కాంతివంతమై యుండును. అద్దానిని ఖల్వంబున వైచి పగులగొట్టి నూరిన భస్మమగును.

## —వజ్రభస్మము.—

శ్రీవజ్రభస్మవిధానమును గురించి సోమనాథాది సిద్ధులనేక ప్రక్రియలం జెప్పియున్నారు. అట్టిప్రయోగములు రసరత్నసముచ్చయమున జూపబడినవి.

అందు సోమనాథుడు:—"కులుత్థక్వాథసంయుక్త లకుచద్రవపిష్టయా। శిలయా లిప్తమూషాయాం వజ్రం క్షిప్త్వా నిరుధ్యచ । అష్టవారం పుటేత్సమ్యక్ విశుష్కైశ్చవనోత్పలైః । శతవారం తతోధ్మాత్వా నిక్షిప్తం శుద్ధపారదే । నిశ్చితం మ్రియతే వజ్రం భస్మ వారితరం భవేత్" ఉలవలకషాయమును నిమ్మపండ్లరసమును బోసిమణిశిలనునూరి దానిని మూసకు బాగుగ రాచి పట్టించి యామూసయందు వజ్రమునుంచి మూసి చీరమంటినిచ్చి ఎండించి

ఎండిన ఏరుబిడకలలో సంప్రదాయముల నెరింగి పుటము వేయవలయును. ఇట్లెనిమిదిసారులు చేసినపిమ్మట నిప్పులయందూదుచు నూరుసారులు శుద్ధి చేయబడిన పాదరసమునం దుంచుచుండిన వజ్రము తప్పక జలమునం దునిచినను మునుగక తేలునంతటి లాఘవముగల్గిన భస్మమగును.

బ్రహ్మజ్యోతిముని:—"విలిప్తం మత్కుణస్యాస్రే సప్తవారం విశోషితమ్। కాసమర్ధరసాపూర్ణే లోహపాత్రే నివేశితమ్॥ సప్తవారం పరిధ్మాతం వజ్రం భస్మ భవేత్ఖలు॥" వజ్రమును నల్లులనెత్తుటియందువైచి యేడుసారు లెండించవలయును. పిమ్మట నావజ్రమును కొలిమిలోనునిచి యూది బాగుగ కాల్చుచు కసివెందయొక్క సమూలపురసంబును నింపియుండు పాత్రంబున ముంచునది. ఇట్లేడుపర్యాయములుచేసిన వజ్రము భస్మమగును.

తన్త్రాన్తరమున:—"మేషశృంగం భుజంగాస్థి కూర్మపృష్ఠశిలాజతు। సృక్కీలాలరసం స్తన్యం కాన్తపాషాణమేవచ॥ వజ్రకం చాపివైక్రాంతం తన్మధ్యే ప్రక్షిపేత్ప్రియే। తీవ్రాతపేపుటం దత్వా పుటాన్తం యావదాగతం। కులుత్థం కోద్రవంచాపి హయమూత్రేణ పేషయేత్॥ తప్తం నిషేచయేత్ పీతే యావత్తద్భస్మతాం వ్రజేత్॥" మేకకొమ్ము పాముఎముకలు తాబేటిచిప్ప శిలాజిత్తు కాన్తపురాయి వైక్రాంతము వీనినెల్ల నమరునట్లునరికి మూకుటియందుంచి ఇందు, జెముడుపాలును రక్తంబును చనుబాలనుబోసి వాని మధ్యమున వజ్రమునువైచి పుటముబెట్టవలయును. ఉలవలను ఆళ్ళను గుఱ్ఱపుమూత్రముబోసి నూరి జారుగాజేసి సిద్ధముగనుంచుకొని పైపుటము పూర్తియగునపుడు కాలియుండు వజ్రముపై నదిభస్మమగువరకు నీయులవనూరుడును చల్లుచుండవలయును.

—॥ వజ్రద్రుతి. ॥—

రసరత్నసముచ్చయమున:—"వజ్రనల్లశ్రైన్తరస్థంచ కృత్వావజ్రం నిరోధయేత్। అమ్లభాణ్డగతం స్వేద్యం సప్తాహాద్ద్రవతాం వ్రజేత్॥"

నల్లేరునునూరి ముద్దజేసి శుద్ధిచేయబడిన వజ్రమును ఆముద్దలో నునిచి మూసలోబెట్టి చీలచేసి పుటముబెట్టినచో ద్రవించును.

ఇంతవరకును తొమ్మిదివిధములగు మణులలో పద్మరాగము ముత్యము పగడము పచ్చ పుష్యరాగము వజ్రమునను నారువిధములగు మణులను గురించి వివరణములు చూపబడినవి. ఇంక నీలము వైడూర్యము గోమేదకమునను మణులకు వివరణములు చెప్పవలసియున్నవి. కాని యింతవరకును మాచే సంపాదింపబడిన యాంధ్ర రసప్రదీపక పుస్తకములలో నేప్రతియందును నీమూఁడు మణులనుగురించిన వివరణ మగుపడలేదు. పైజెప్పిన మూఁడుమణులను గురించియు దీని సంస్కృతమూలమున కొన్ని ప్రక్రియలు జెప్పబడినవి.

—॥ నీలము. ॥—

శ్లో॥ జలనీలేంద్రనీలే ద్వే శక్రనీలం తయోర్వరమ్। శ్వేతగర్భితనీలాభం లఘు తజ్జలనీలకమ్॥ కార్ష్ణ్యగర్భితనీలాభం సభారం శక్రనీలకమ్। ఏకచ్ఛాయం గురు స్నిగ్ధం స్వచ్ఛం పిండితవిగ్రహమ్॥ మృదు మధ్యోల్లసజ్జ్యోతిః సప్తధా నీల ముత్తమమ్। కోమలం విహితం రూక్షం నిర్భారం రక్తసంధి చ। చిపిటాభం స సూక్ష్మంచ సప్తధా నీలముత్సృజేత్। శ్వాసకాసహరంవృష్యం త్రిదోషఘ్నం సుదీపనమ్। విషమజ్వరదుర్నామపాపఘ్నం నీలమీరితమ్॥" జలనీలమనియును ఇంద్రనీలమనియును నీలము రెండువిధములుగనుండును. అందు ఇంద్రనీలము శ్రేష్ఠమైనది. తేలికయై తెలుపు కూడియుండు నీలవర్ణమునుగల నీలము జలనీలమనంబడును. బరువై నలుపుకలిగిన నీలవర్ణముగలనీలము ఇంద్రనీలము. మిశ్రితము గాక ఒకే వర్ణముగల కాంతిగలిగి బరువై నునుపై మలినములేక కలయిక గలరూపముగలిగి మృదువై మధ్యభాగమున ప్రకాశముకలిగియుండు నీలము శ్రేష్ఠమైనది. కోమలము (మిశ్రవర్ణము)గ నుండునదియు విహితము (సగము స్వచ్ఛముగను సగము మిశ్రవర్ణము కలది)గను నుండునదియు రూక్షంబును బరువులేనిదియు కొంచె మెరుపుతో కూడినదియు అణువులుగ రూపము కలిగినదియు నలుసులు కలిగినదియు జలనీల లక్షణయుక్తమైనదియునగు నీలము శ్రేష్ఠముగాదు.

శ్రేష్ఠమగు నీలము శ్వాసవ్యాధులను కాసవ్యాధులను శమింపజేయును. వీర్యవృద్ధినిచ్చును. వాతపిత్తకఫదోషంబుల నణచును. అగ్నిదీప్తినికలిగించును,

విషమజ్వరములను పోగొట్టును. దుర్నామ (మూల) వ్యాధి నణంచును. పాపంబు వలన జనించిన వ్యాధులను శమింపజేయును.

—॥ నీలశోధనము. ॥—

§ వైద్యచిన్తామణి:—"ఖరమూత్రాన్తరే క్షిప్త్వా నీలం తీవ్రాతపే క్షిపేత్ । భావితం దినమేకంచ నీలం శుద్ధం భవిష్యతి" నీలమణిని గాడిదె మూత్రమున నానబెట్టి తీక్ష్ణమైన యెండ నెండించినచో శుద్ధినందును.

—॥ నీలభస్మము. ॥—

వైద్యచిన్తామణి:—"తన్నీలం లక్షితం జీవాద్రవే భావ్యం త్రియామకం । విశ్వకర్మపుటే దగ్ధ్వా భస్మీభవతి తత్క్షణాత్॥" శుద్ధిచేయఁబడిన నీలమును పాలకూర రసమున మూఁడుదినములు భావనజేసి కొలిమిలోఁబెట్టి యూదినచో భస్మమగును.

—॥ గోమేదకము. ॥—

§ దీనిసంస్కృతమూలము:—"గోమేదస్సమరాగత్వాద్గోమేదం రత్నముచ్యతే । సుస్వచ్ఛగోజలచ్ఛాయం స్వచ్ఛం స్నిగ్ధం సమం గురు । నిర్దలం మసృణం, దీప్తం గోమేదం శుభమష్టధా । విచ్ఛాయం లఘు రూక్షాంగం చిపిటం పటలాన్వితమ్ । నిష్ప్రభం పీతకాచాభం గోమేదం న శుభావహమ్ । గోమేదం కఫపిత్తఘ్నం క్షయపాండుక్షయంకరం । దీపనం పాచనం రుచ్యం త్వచ్యం బుద్ధిప్రబోధనమ్॥" ఆవుయొక్క మేదోధాతువు (క్రొవ్వు) వలె నుండునది కావున నీమణికి గోమేదమను పేరుకలిగినది. గోమేదకము స్వచ్ఛమగు గోమూత్రమువంటి కాంతికలిగి స్వచ్ఛమై నునుపై హెచ్చుతక్కువలులేక సమానమై బరువై పొరలులేక దట్టముగను ప్రకాశమానముగను నుండిన శ్రేష్ఠముగ నెరుంగవలయును. కాంతిహీనమై తేలికయై పెళుసై అడుసులుగల యాకృతికలిగి పొరలుకలిగి మెరుపులేక పచ్చనిగాజుపెంకువలెనుండు గోమే

దకము శ్రేష్ఠమైనదికాదు. గోమేదకమును భస్మాదిరూపముగ పరిణమింపజేసి సేవించిన కఫవ్యాధులను పిత్తవ్యాధులను దగ్గును పోగొట్టును. క్షయరోగములను పాండురోగములను నశింపజేయును. అగ్నిదీప్తిని కలిగించి ఆహారపాచనమును జేయును. రుచిని కలిగించును. త్వగింద్రియమునకు హితమును చేయును. బుద్ధిని వెంపొందించును.

## —॥ గోమేదకశుద్ధి. ॥—

శ్రీ వైద్యచిన్తామణి:—“ తతో గోమేదకం వాజి మూత్రే భావ్యం దిన త్రయమ్ । తతో విదారీస్వరసే భావ్యం శుద్ధిర్భవిష్యతి॥ ” గోమేదకమును గుఱ్ఱపుమూత్రమున మూడుదినములు భావనజేసి పిదప నేలగుమ్మడిగడ్డల స్వరసమున భావనచేసినచో శుద్ధమగును.

## —॥ గోమేదకభస్మము. ॥—

శ్రీ వైద్యచిన్తామణి :—“ శుద్ధం గోమేదకం కృష్ణధత్తూరద్రవభావితమ్ విశ్వకర్మపుటే దగ్ధ్వా త్రివారం భస్మచాప్నుయాత్॥ ” శుద్ధిచేయబడిన గోమేదకమణిని నల్లఉమ్మెత్తాకురసమున మూడుమార్లు భావనచేసి కొలిమిలోనునిచి యూదినచో భస్మమగును.

## —॥ వైడూర్యము. ॥—

శ్రీ దీనిసంస్కృతమూలము:—“ వైడూర్యం శ్యామశుభ్రాభం సమం స్వచ్ఛం గురు స్ఫుటమ్ । అభ్రశుభ్రోత్తరీయేణ గర్భితం శుభమీరితమ్ । శ్యామం తోయసమచ్ఛాయం చిపిటం లఘు కర్కశమ్ । రక్తగర్భోత్తరీయంచ వైడూర్యం నైవ శస్యతే॥ వైడూర్యం రక్తపిత్తఘ్నం ప్రజ్ఞాయుర్బలవర్ధనమ్ । పిత్తప్రధానరోగఘ్నం దీపనం మలమోచనమ్॥ ” నల్లనైనట్టియు తెల్లనైనట్టియు కాంతికలిగి సమానమై స్వచ్ఛమై బరువై స్ఫుటమై లోన తిరుగుచుండు తెల్లని యుత్తరీయమువంటి పొరకలిగియుండు వైడూర్యము శ్రేష్ఠమైనది. నల్లగగాని నీటివంటి రంగుకలిగినదిగాని యుండినను అడుకుతేర్పడి

యుండినను తేలికయైనను గరగరకలిగియుండినను లోన నెఱ్ఱనగు నుత్తరీయమువంటిపొరతిరుగుచుండినను అట్టి వైడూర్యము శ్రేష్ఠముకాదు. ఉత్తమమగు వైడూర్యమును భస్మాదిరూపమునందించి సేవించిన రక్తపిత్తవ్యాధిని పోగొట్టును. బుద్ధికి బలముచేయును. ఆయువును దృష్టిపరమును. బలమును హెంపొందించును. పిత్తదోషప్రధానములగు వ్యాధులనన్నిటిని పోగొట్టును. అగ్నిదీప్తినిచేయును. మలమును వెడలించును.

—॥ వైడూర్యశోధనము. ॥—

§ వైద్యచిన్తామణి:—"వైడూర్యం వాజిమూత్రేణ కూశ్మాణ్డస్వరసేనచ। భావితం ద్విదినంచాథ శుద్ధిర్భవతి నిశ్చయమ్॥" వైడూర్యమును గుఱ్ఱపుమూత్రమున నొకదినమును గుమ్మడిపండు స్వరసమున నొకదినమును భావనచేసిన చో శుద్ధినందును.

—॥ వైడూర్యభస్మము. ॥—

వైద్యచిన్తామణి:—"తద్వైడూర్యం శిలాభేదిరసేన పరిభావితమ్। విశ్వకర్మపుటే దగ్ధ్వా తీవ్రాగ్నౌ వజ్రమూషయా। తతోగజపుటే పాచ్యం భస్మీభవతి నిశ్చితమ్॥" శుద్ధిచేయబడిన వైడూర్యమును కొండపిండిరసమున భావనచేసి కొలిమిలోనునిచి తీవ్రాగ్నినిడియూది పిమ్మట వజ్రమూషయందు బెట్టి చీరమన్నుబూసి గజపుటము నిడిన శుద్ధమగు భస్మమగును.

—॥ సర్వరత్న సామాన్యదోషములు. ॥—

§ రసరత్నసముచ్చయము:—"గౌరస్త్రాసశ్చబిందుశ్చ రేఖాచజలగర్భతా। సర్వరత్నేష్వమీ పంచదోషాః సాధారణా మతాః॥" "క్షేత్రతోయభవా దోషా రత్నేషు నలగంతి తే" తెలుపును వెలవెలబోవుటయు చుక్కలును గీతలును నీరుపట్టుటయు ననునివి యన్నివిధములగు మణులకు సాధారణంబులైన దోషంబులు. భూమివలన నేర్పడు దోషములుగాని జలమువలన నేర్పడు దోషంబులుగాని వజ్రంబులకు సోకవు.

— మణులకు ప్రత్యేకముగ శుద్ధులు. —

మరియు పైజెప్పబడిన మాణిక్యాదిమణుల దొమ్మిదిటికిని శోధనక్రమమును సూక్ష్మరూపముగ దీని సంస్కృతమూలమున నీవిధముగ జెప్పియున్నది:—«శుధ్యత్యమ్లేన మాణిక్యం జయంత్యా మౌక్తికం తథా। విద్రుమం క్షారవర్గేణ తార్క్ష్యం గోదుగ్ధకైస్తథా॥ పుష్యరాగంచ సంధానైః కులుత్థక్వాథసంయుతైః। తండులీయజలైర్వజ్రం నీలం నీలీరసేనచ। రోచనాభిశ్చ గోమేదం వైడూర్యం త్రిఫలాజలైః॥" అమ్లవర్గపురసములయందు భావనములను స్వేదనములును చేసిన మాణిక్యము శుద్ధినందును. తక్కలియాకు రసమున భావనచేసినను స్వేదనచేసినను ముత్యము శుద్ధినందును. క్షారవర్గములయందు పగడము శుద్ధిబొందును. గరుడపచ్చ ఆవుపాలచే శుద్ధిబొందును. సంధానసిద్ధములగు ఆసవ-అరిష్ట ద్రవములతో నులవకషాయమును జేర్చి యందు పుష్యరాగము నునిచి స్వేదనము జేసినచో శుద్ధమగును. వాయువిడంగముల కషాయముచే భావనస్వేదనముల జేసిన వజ్రము శుద్ధినందును. నీలియాకురసముచే నీలము శుద్ధిబొందును. గోమేదకము గోరోచనపు భావనచేత శుద్ధిబొందును. త్రిఫలకషాయంబున స్వేదనముచే వైడూర్యము శుద్ధిబొందును.

— మణిసామాన్యమును భస్మముచేయురీతి. —

దీని సంస్కృతమూలము:—«లికుచద్రవసంపిష్టైశ్శిలాగంధకతాళకైః। వజ్రంవినాన్యరత్నాని మ్రియంతేఽష్టపుటైర్లఘు॥" మణిశిల గంధకము తాళకము వీనిని నిమ్మపండ్లరసముబోసి నూరి యాముద్దయందు శుద్ధిచేయబడియుండు మణులను బొదిగి పుటము బెట్టుచుండవలయును. ఇట్లు ఎనిమిది పుటములు బెట్టిన వజ్రము తప్పతక్కిన మణులన్నియు తేలికగల్గిన భస్మములగును.

— సర్వరత్నద్రుతి. —

రసరత్నసముచ్చయము:—«రామఠం పఞ్చలవణం క్షారాణాం త్రితయం తథా। మాంసద్రావ్యమ్లవేతశ్చ చూలికా లవణంతథా। స్థూలం కుమ్భీఫలం పక్వం తథా జ్వాలాముఖీశుభా। ద్రవన్తీచ రుదన్తీచ పయస్యా చిత్ర

మూలకం। దుగ్ధం స్నుహ్యాస్తథార్కస్య సర్వం సమ్మర్ద్య యత్నతః। గోలం విధాయ తన్మధ్యే ప్రక్షిపేత్తదనన్తరమ్। గుణవన్తి వరత్నాని జాతిమన్తి శుభాని చ। భూర్జతం గోళకం కృత్వా సూత్రేణావేష్ట్య యత్నతః। పునర్వస్త్రేణ సంవేష్ట్య డోలాయన్త్రే విధాయ చ। సర్వామ్లయుక్తసన్ధాన పరిపూర్ణఘటోదరే। అహోరాత్రత్రయం యావత్ స్వేదయేత్తీవ్రవహ్నినా। తస్మాదాహృత్య సంక్షాళ్య రత్నజాం ద్రుతిమాహరేత్। రత్నతుల్య ప్రభాఃఖ్యీ దేహలోహకరీ శుభా॥''

ఇంగువ, పంచలవణములు, క్షారత్రయము (సర్జక్షారము యవక్షారము టంకణక్షారము), మాంసద్రావి - పుల్ల ప్రబ్బలి, చూలికాలవణము (నవాచారము), కుమ్భీఫలము, జ్వాలాముఖి, ద్రవన్తి, రుదన్తి, మనఃపాల, చిత్రమూలము, అను నీద్రవ్యములనన్నిటిని జేర్చి యందు జెముడుపాలును జిల్లేడుపాలును కలిపినూరి యుండజేసియుంచునది. పిదప మిక్కిలి ప్రశస్తగుణములు గల్గినవియు మంచిజాతీయములునగు రత్నములలో నెద్దానినైనను దెచ్చి యథోక్తముగ శుద్ధిచేసి పైజెప్పిన యౌషధసముదాయపిష్టము నడుమనునిచి ఆయుండకు పైన భుజపత్రినిజుట్టి యొకదారముచే గట్టిగకట్టి దానిమీద గుడ్డచుట్టి అమ్లవర్గద్రవ్యముల రసములచేతను ఆసవ-అరిష్టములచేతను నిండియుండు కుండలో డోలాయంత్రవిధానమున బెట్టి మూడు అహోరాత్రములు గాఢాగ్నిని రగిలించి యావిరిచే నుడికించి పిమ్మట నారత్నమును వెలికిందీసి నీళ్ల చేగడిగి కోష్ఠీయంత్రమున బెట్టి యథోక్తముగ నూదినచో ద్రవించును. అట్టి రత్నద్రుతి రత్నమున కెట్టిరంగు కల్గియుండునో అట్టికాంతికలిగి దేహమును లోహమువలె దృఢముగ జేయు ప్రభావము గల్గియుండును.

కొందరు గ్రంథకర్తలు మణులయనంతరమున నుపమణులను కొన్నిటిని చెప్పియున్నారు. రసార్ణవమున మణులనుగురించి యొకప్రకరణముగ వ్రాయబడలేదు. శక్తిరసంబులనుగురించి చెప్పు ప్రకరణమున వజ్రప్రస్తావము కలిగినపుడు దానిద్రుతికొరకు విధానమును చెప్పి "అథవాప్యభ్రకం స్విన్నం మౌక్తికం చ ప్రవాళకమ్। మాక్షికం నీలపుష్పం చ పీతం మరకతం మహత్। వైడూర్యస్ఫటికాదీని

ద్రవన్తి సలిలం యథా॥" అని పైచెప్పబడిన విధానముచే నభ్రకమున మౌక్తిక ప్రవాళాదిమణులును జలమువలె ద్రవములగునని చెప్పుచు మణులను పేర్కొని యున్నారు. అంతియేకాని మణిపరిగణనముగాని తద్వర్ణనముగాని తత్పరీక్షణముగాని శోధనమారణవిధానములుగాని మరియేమియు చెప్పియుండలేదు. వీనితోబాటుగనే ఉపరత్నములవిషయము ఎత్తుకొననేలేదు. రసరత్నసముచ్చయమున మణులయొక్క పరీక్షలును లక్షణములును శోధనములును మారణములును మొదలగునవి యన్నియు చెప్పబడినవికాని యుపరత్నప్రస్తావమగుపడదు.

భావప్రకాశకారుడును తదనుయాయులును "ఉపరత్నానికాచశ్చ కర్పూరాశ్మ తథైవచ। ముక్తాశుక్తిస్తథాశంఖ ఇత్యాదీనిబహూన్యపి" అని గాజును, కర్పూరపురాయియు, ముత్యపుచిప్పయు, శంఖమును అనునివి మొదలుగాగలుగు నవియనేకము లుపరత్నములు కలవు అని చెప్పి నిరూపించియున్నారు

శివతత్వరత్నాకరమున:—"సూర్యకాంతశ్చంద్రకాంత స్తారకాంతఇతి త్రయః। త్రీణ్యేవచోపరత్నాని లోహకాంతంచకేచన" అని సూర్యకాంతము, చంద్రకాంతము, తారకాంతము ననునివి మూడును మాత్రమే తనమతమున నుపరత్నములనియు ఇతరులు కొందరు లోహకాంతమనుదాని కూడ నుపరత్నములలో చేర్చి చెప్పెదరనియు చెప్పబడియున్నది.

ఆనందకందమున:—"సూర్యకాంతశ్చంద్రకాంత స్తారకాంతస్సుకాంతకః। వైక్రాంతశ్చనృపావర్త స్సస్యకోవిమల స్తథా। ఫిరోజశ్చనవైతాని హ్యుపరత్నానినిర్దిశేత్॥" అని సూర్యకాంతము చంద్రకాంతము తారకాంతము సుకాంతము వైక్రాంతము రాజావర్తము సస్యకము విమలము ఫిరోజము అను నీతొమ్మిదియు నుపరత్నములుగ చెప్పబడియున్నవి.

ఈరసప్రదీపికకు మాతృకయగు సంస్కృతరసప్రదీపికయందు:—"రాజావర్తంచంద్రకాంతం సూర్యకాంతంసితోపలా। మణిమధ్యేచ గణితా రస

బంధేప్రకీర్తితాః" అని మణులంజెప్పిన యనంతరమున రాజావర్తము, చంద్రకాంతము, సూర్యకాంతము, స్ఫటికము. అనునివికూడ మణులలో చేర్పబడినవి. ఇవియును రసబంధనమును చేయును. అనిచెప్పి వానిలో రాజావర్తమునుమాత్ర మీ్రకింద నగుపరచువిధమున వివరించి తక్కినవాని వివరణమును చెప్పక ప్రకరణమును ముగించియున్నారు.

—( రాజావర్తము. )—

§ దీని సంస్కృతమూలము:—"రాజావర్తోద్విధాక్షేయో గుళికాచూర్ణభేదతః । శిరీషపుష్పస్వరసే రాజావర్తంవిశోధయేత్ । లుంగాంబుగంధకోపేతం రాజావర్తంవిచూర్ణితం । పుటనాత్సప్తవారేణ రాజావర్తోమృతోభవేత్ । ప్రమేహక్షయదుర్నామ పాండుశ్లేష్మానిలాపహః । దీపనఃపాచనోవృష్యః త్రిదోషఘ్నోరసాయనః" రాజావర్తము ఉండెగను చూర్ణముగను రెండువిధములనుండును. ఇది దిరిసనపూవుయొక్క స్వరసమున భావనముచేసినను స్వేదనముచేసినను శుద్ధిబొందును. నిమ్మపండ్లరసమును గంధకమును రాజావర్తమున కలిపినూరి ఏడుపుటములుబెట్టిన నది భస్మమగును. అట్టిభస్మమును తగుపరిమాణంబున సేవించిన ప్రమేహము క్షయవ్యాధి దుర్నామము పాండువు శ్లేష్మవ్యాధులు వాతవ్యాధులును శమించును. దీపనపాచనముల జేయును. వృష్యమైనది. త్రిదోషప్రకోపము నడచును. రసాయనమై జరావలీపలితములను అకాలమృతిని పోగొట్టును.

ఇట్టి పరిగణనములయం దగుపడు గ్రంథకారులభేదములన్నియు నాకాలంబున వారు ఖనిజపదార్థములయందు వారు చేయుచుండిన విమర్శనువలనను ప్రయోగమువలనను విజ్ఞానప్రవేశమువలనను నేర్పడినదిగ నెరుంగదగియున్నది. మరియు రాజావర్తమును ధాతువును రససంప్రదాయగ్రంథములలో కొంద రుపరసంబులయందుచేర్చి చెప్పియున్నారు. మరికొందరు సాధారణరసంబులయందుచేర్చి చెప్పియున్నారు. ఇంకగొందరు మణులయందు చేర్చియున్నారు. రసరత్నసముచ్చయకారాదులగు కొందరుమాత్ర మీమూడు పక్షములయం

దును చేర్చక దానిని మహారసములయందు గాని ఉపరసములయందు గాని సాధారణరసములయందు గాని మరి యితరములగు రత్నోపరత్నలోహాలోహాపహాములయందుగాని చేర్చి పరిగణనము చేయకయే సాధారణరసంబుల నన్నిటిని చెప్పి ముగించిన యనంతరమున రాజావర్తమునుగురించి చెప్పియున్నారు. దీనిని బట్టి చూడ నీరాజావర్తమునుగురించి యాకాలమున వేనిలో చేర్చుటకును నిశ్చితమైన సిద్ధాంత మేర్పడలేదనియు దీనిపరిగణనము విషయమున భిన్నభిన్నములగు నభిప్రాయము లుండినవనియు నూహింపదగియున్నది.

రసరత్నసముచ్చయమున నాగ్రంథకర్త కాలముననే యీధాతువు కనుగొనబడి యుపయోగమున నుంచబడుచుండుటచే విడిచివేయ వీలులేకపోవుటచేతనో! దాని పరిగణనమునుగురించి నిశ్చితసిద్ధాంత మేర్పడకుండుటచే నొకసముదాయమున చేర్చి వేయుట కనువుకాకుండుటనో? మరి యేయితరకారణముననో? కాని మహారసాది సముదాయములలో దేనియందును చేర్పక వేరుగా నిట్లు చెప్పియున్నాడు.

## —॥ రాజావర్తలక్షణము. ॥—

శ్రీరసరత్నసముచ్చయము “ రాజావర్తోఽల్పరక్తోరునీలికామిశ్రితప్రభః। గురుశ్చమసృణః శ్రేష్ఠః తదన్యోమధ్యమస్మృతః॥ ” రాజావర్తము కొంచె మెరుపును అధికముగ నీలమును కలిసిన రంగుకలదిగను బరువుగను నునుపుగను నుండిన యుత్తమము. ఇట్లుండకపోయిన నది శ్రేష్ఠముకాదు.

## —॥ రాజావర్తోపయోగము. ॥—

“ ప్రమేహక్షయదుర్నామ పాండుశ్లేష్మానిలాపహః। దీపనః పాచనోవృష్యో రాజావర్తోరసాయనః॥ ” రాజావర్తమును సేవించిన ప్రమేహములును క్షయవ్యాధులును దుర్నామమును పాండురోగములును శ్లేష్మవ్యాధులును వాతవ్యాధులును నశించును. దీపనపాచనములం జేయును. వీర్యవృద్ధి నిచ్చును. ఇది రసాయనముగ నుపయోగించును.

—॥ రాజావర్తశోధనము. ॥—

"నింబుద్రవైః సగోమూత్రైః సక్షారైః స్వేదితాః ఖలు । ద్విత్రివారేణ శుధ్యంతి రాజావర్తాదిధాతవః । శిరీషపుష్పార్ద్రరసే రాజావర్తం విశోధయేత్॥"

నిమ్మపండ్లరసమునను గోమూత్రమునను క్షారములయందును రెండు మూడు పర్యాయములు స్వేదనముచేసిన రాజావర్తము మొదలగు ధాతువు లన్నియు శుద్ధములగును. దిరిసనపూవులయొక్కయు అల్లముయొక్కయు రసములయందు భావనస్వేదనముల జేసియు రాజావర్తమును శుద్ధిచేయవచ్చును.

—॥ రాజావర్తభస్మము. ॥—

"లుంగాంబుగంధకోపేతో రాజావర్తోవిచూర్ణితః । పుటనాత్సప్తవారేణ రాజావర్తోమృతోభవేత్॥" శుద్ధిచేసిన రాజావర్తమును గంధకమును నిమ్మపండ్లరసమును చేర్చినూరుచు ఏడుసారులు పుటమువైచిన భస్మమగును.

—॥ రాజావర్తసత్వపాతనము ॥—

"రాజావర్తస్యచూర్ణంతు కునటీస్నుతమిశ్రితమ్ । విపచేదాయసేపాత్రే మహిషీక్షీరసంయుతమ్ । సౌభాగ్యపఞ్చగవ్యేన పిణ్డీబద్ధంతుజారయేత్ । ధ్మాపితం ఖదిరాఙ్గారైః సత్వం ముఞ్చతి శోభనమ్॥" శుద్ధిచేయబడిన రాజావర్తమును చూర్ణముజేసి యందు ఇంగిలీకమును నేతిని జేర్చి యినుపపాత్రలోనునిచి ఎనుముపాలనుకలిపి పక్వముజేయునది. పిదప మజ్జిగయందును పంచగవ్యము నందును పక్వముజేసి జారణాయంత్రమున నునిచి యథోక్తముగ కొలిమిలో బెట్టి యూదినచో రాజావర్తమునుండి సత్వము వెడలును.

—॥ లోహములు. ॥—

సీ॥ వినుఁలోహములు పంచవిధములు శుద్ధలో
హంబును భానులోహంబు పూతి ।
లోహాఖ్యమును మిశ్రలోహంబనగ ధాతు
లోహంబనగ పంచలోహములగు ।

శుద్ధలోహము వెండి శుభహేమతామ్రము
లర్కలోహంబు కాంతాయసంబు ।
ధరపూతిలోహంబు తగరము సీసము
కడు మిశ్రలోహమిత్తడియు కంచు ।
నైదుగూడిన ధాతులోహం బటంద్రు
లోకరంజకముగ నవలోహములకు ।
భేదములు శుద్ధులును గుణామోదములును
తెలియజెప్పెద నాత్రేయ ధీవరేణ్య॥ ౧౯॥

వ్యా॥ లోహములు శుద్ధలోహములనియు భానులోహములనియు పూతిలోహములనియు మిశ్రలోహములనియు ధాతులోహమనియు నైదు తెరగులనుండును. కావుననే పంచలోహసంజ్ఞ. అందు బంగారమును వెండియు రాగియు శుద్ధలోహములు. కాంతలోహము భానులోహ మనబడును. తగరమును సీసమును పూతిలోహములు. ఇత్తడియు కంచును మిశ్రలోహంబులు. పై జెప్పబడిన కాంస్యాది పంచలోహంబుల మిశ్రమునకు ధాతులోహం బని పేరు. ఇట్లు పంచవిధలోహములయందును నంతర్భూతములైయుండు నవ లోహంబులకును అంతర్భేదంబులును వానిశుద్ధులును భస్మములును వానిగుణములును మొదలగువానిని క్రమముగ వివరించిచెప్పెదను.

ఈలోహపరిగణనము విషయమున రసార్ణవమున:—"........శృణు లోహాన్యతఃపరమ్ । సువర్ణంరజతంతామ్రం తీక్ష్ణంవఙ్గంభుజఙ్గమమ్॥ లోహంతు షడ్విధమ్.................." అని సువర్ణము, రజతము, తామ్రము, లోహము, తగరము, సీసము అని యారువిధములుగ నిరూపింపబడినవి.

భావప్రకాశమున:—"స్వర్ణంరూప్యంచ తామ్రంచ వంగం యసదమేవచ । సీసంలోహంచసప్తైతే ధాతవోగిరిసంభవాః॥" అని యసదమును (సత్తు) లోహమునుచేర్చి ఏడువిధములుగ చెప్పబడినవి.

ఆనందకందమున :—“ స్వర్ణరూప్యార్క-కాంతాభ్రిసత్వం తీక్ష్ణంచ ముండకమ్ । భుజంగం త్రపుసం చైవ రీతిఃకాంస్యంచ వర్తకమ్ । ద్వాదశైతాని లోహాని............. ” అని స్వర్ణము, రూప్యము, తామ్రము, కాంతలోహము, అభ్రికసత్వము, తీక్ష్ణలోహము, ముండకలోహము, సీసము, తగరము, ఇత్తడి, కంచు, వర్తలోహము అని పండ్రెండువిధములగు లోహములు చూపబడినవి.

రసరత్న సముచ్చయమున :—“ శుద్ధం లోహం కనకరజతం భానులోహాశ్మసారం పూతీలోహం ద్వితయముదితం నాగవంగాభిధానమ్ । మిశ్రంలోహం త్రితయముదితం పిత్తళంకాంస్యవర్తం ” శుద్ధలోహములగు సువర్ణరజతతామ్రతీక్ష్ణంబులును పూతిలోహములగు నాగవంగములు రెండును మిశ్రలోహములగు పిత్తళకాంస్యవర్తములు మూడును మొత్తమునకు తొమ్మిదియు లోహంబులు అని వివరింపబడినవి. ప్రకృతగ్రంథమునకు మూలమగు సంస్కృత రసప్రదీపికయందును ఈమతమే యనుసరింపబడి “ శుద్ధంలోహం ” అను శ్లోకమునే చెప్పియున్నది.

ఇట్టి పరిగణనమునందలి విభేదమున కంతటికిని మహారసాదిపరిగణనముల యందువలెనే వారివారి సిద్ధాంతభేదములే కారణములని యూహింపదగియున్నది. ఎట్లనిన :—

రసార్ణవకారుడు అన్యలోహాసంమిశ్రణములేక శుద్ధములైయుండు లోహములే పరిగణనార్హములనియు మిశ్రలోహంబులు తత్తల్లోహంబుల నంతర్భూతంబు లగుననియు నుద్దేశించి స్వర్ణము రజతము తామ్రము అయస్సు వంగము నాగము ననునవియారును లోహంబులని పరిగణించెను.

భావప్రకాశకారుడును దీనినే యనుసరించుచు పిత్తళమునకు మూలలోహమగు యసదముగూడ ప్రత్యేకలోహంబుగ పరిగణనీయమను నభిప్రాయంబున దానినిగూడ ప్రత్యేకముగ పరిగణించి యేడువిధములని నిర్ధారణము చేసెను.

ఆనందకందకర్తయు మిశ్రములైనను అమిశ్రములైనను పరస్పరభేద భిన్నములగు లోహజాతులన్నియు ప్రత్యేకములుగ పరిగణింపవలసినవేయని యభిప్రాయపడి అయోభేదంబులగు తీక్ష్ణ, ముండ, కాంతంబులను మిశ్రలోహంబులగు ఇత్తడి, కంచు, వర్తమునను వానిని ప్రత్యేకములుగ పరిగణించి అభ్రికసత్వమునుగూడ లోహంబులయందుచేర్చి తక్కిన అయిదు శుద్ధలోహంబులతోడను పండ్రెండుగజేసి సిద్ధాంతము జేసెను.

రసరత్నసముచ్చయమున నన్నిటిని వినర్శించి విషయవిభాగపూర్వకంబుగ వానికి సమీకరణము చేయుచు లోహములనన్నిటిని మొదట శుద్ధ పూతి మిశ్రభేదంబులచే త్రివిధంబులుగ విభజించి శుద్ధపూతి భేదభిన్నంబులగు నారువిధములగు నమిశ్ర (మిశ్రములుకాక స్వతంత్రములగు) లోహంబులును మూడువిధములగు మిశ్రలోహంబులును మొత్తమునకీ తొమ్మిదివిధంబు లగునవియు నామూడువిధంబుల నంతర్భూతంబు లగుననియు జెప్పుచు నొకమార్గమును స్థిరీకరించెను. ఇట్లు నూతన విషయంబులయందు ప్రయోగపూర్వకంబుగ పరిశ్రమముచేసి క్రొత్తసంగతుల గని పెట్టువారికి సిద్ధాంతములయందు పరస్పరభేదంబులుండుట దోషంబుగాదు.

రసప్రదీపిక సిద్ధాంతములును రసరత్నసముచ్చయ కారాంగీకృతములేయని వేరుగ జెప్పనక్కరలేదు. కాని ఈ విభాగమునమాత్రము పైజెప్పబడిన గ్రంథముల కన్నిటికి భేదముగ జెప్పబడియున్నది. లోహముల ప్రథమ విభాగమునందు ధాతులోహము అర్కలోహమునను వానిం జేర్చి యైదు విధములుగ చెప్పబడినవి. వాని యంతర్విభాగములలో స్వర్ణ రజత తామ్రంబులు మూడును మాత్రము శుద్ధలోహములుగ జెప్పి అయస్కాంతమును ఖానులోహంబుగ పరిగణించి నాగవంగంబుల పూతిలోహంబులుగ జెప్పి యనంతరమున ఇత్తడిని కంచును రెంటిని మాత్రము మిశ్రలోహంబుల జేర్చి పంచలోహ మిశ్రణము ధాతులోహమని చెప్పబడియున్నది.

మరియు ధాతులోహంబును వివరించునెడ నీపద్యమున జెప్పబడిన "ఐదుగూడిన ధాతులోహం బటంద్రు" అనుభాగము సందిగ్ధముగ నగుపడు

చున్నది. ఎట్లన్న? "ఐదుగూడిన" నన గూడవలసిన యైదులోహము లేవి? శుద్ధాదికములగు నైదులోహములా? స్వర్ణాదికములలో నైదులోహములా? ధాతులోహమునకు మూలములగు శుద్ధాదులు నాలుగులోహములుమాత్ర ముండుటచే మొదటిదని చెప్పుటకు వీలులేదు. ధాతులోహమూలంబులు స్వర్ణాదికములంటిమేని యవి యెన్మిదియగుటచే నం దే యైదులోహములు చేర్పవలయు ననుట కుత్తరము రాదు. కావున రెండవదనియు జెప్పుటకు వీలులేదు. అందుచే నీయది సందిగ్ధముగ నగుపడుచున్నది. కావున దీనికి క్లిష్టముగ నర్థము చేయ వలసియున్నది. ఈపద్యమున చేయబడిన ప్రతిజ్ఞ ననుసరించి చెప్పబడిన శుద్ధ్యాదివివరణమున మిశ్రలోహములగు పిత్తళకాంస్యములను వివరించి అంతట నిలిపివేయబడి ధాతులోహవివృతి చేయబడకపోవుటచే దానివిషయ మీగ్రంథమువలన నిర్ధారణచేయుటకు వీలులేదు. కావున నన్యగ్రంథములను సహాయముగ గొనవలయును.

ప్రకృతగ్రన్థమునకు మూలమగు సంస్కృతమున రీతికాంస్యలోహముల ప్రక్రియల నిరూపించి పిమ్మట "కాంస్యార్క-రీతిలోహాహిజాతం తద్వర్త లోహకమ్। తదేవపంచలోహాఖ్యం లోహవిద్భిరుదాహృతమ్॥" అని చెప్పి యున్నది. ఈశ్లోకముచేత కంచు రాగి విత్తడి ఇనుము నాగము అను నీలోహములు ఐదును జేరినది వర్తలోహమని యేర్పడుచున్నది. రసరత్నసముచ్చయమునందు నిదేశ్లోకము నిదేఘట్టమున జెప్పియున్నది. ఈప్రమాణములబట్టి చూడ ధాతులోహ వర్తలోహములు పదమాత్రముచే భిన్నములుగాని వస్తుభేదము లేదనియు ధాతులోహవివరణమున 'ఐదుగూడిన' యన్నచోట పైప్రమాణముల ననుసరించి కంచు రాగి విత్తడి ఇనుము నాగము నను నీయైదు గూడినచో ధాతులోహమని యర్థముచేయుట దృఢతరప్రమాణ సిద్ధముగనున్నది.

— స్వర్ణము. —

గీ॥ సహజమును ప్రాకృతము వహ్నిసంభవంబు
ఖనిజమును సూతవేధజంబనగ నొప్పి।

వైయిదువిధముల కనకంబు లమరుచుండు
కలితషోడశవర్ణముల్ కలిగి భువిని॥ ౧౯॥

వ్యా॥ అందు స్వర్ణము సహజము, ప్రాకృతము, వహ్నిసంభవము, ఖనిజము, సూతవేధజము, నని యైదువిధముల నుండును. ఇట్టి స్వర్ణము పదునారువన్నెలు కలిగి యలరారుచుండును

—॥ స్వర్ణభేదములు వానిస్వరూపము. ॥—

సీ॥ బ్రహ్మాండ [1]మవల సంభవమొందు ప్రాకృతం
బతిదుర్లభంబు దేవతలకైన।
వహ్నిచే జనియించు వహ్నిసంభూతంబు
సేవింప కాయసంసిద్ధి యగును।
పర్వతంబులయందు బ్రభవించు ఖనిజంబు
సర్వరుజంబుల గర్వమణచు।
మేరుకూటమున జన్మించును సహజంబు
వేధజంబన సూతవేధజంబు।
సహజమును వేధజము ఖనిసంభవంబు
ఘనతరంబగు నమృతమై జనులకెపుడు।
భుక్తిముక్తియు సౌఖ్యంబు బొసగ జేసి
యఖిలరుజముల బాపి దీర్ఘాయు వొసగు॥ ౨౦॥

వ్యా॥ "తదండమభవద్ధైమ" మని సువర్ణవికారమైన యీబ్రహ్మాండమును "బ్రహ్మాండంసంవృతంయేన రజోగుణభువాఖలు" అని చెప్పబడినయట్లు చుట్టుకొని రజోగుణభవమై గ్రుడ్డుపైపెంకువలెనుండు సువర్ణము ప్రకృతిజన్య

1. (క) ములను.

మగుటచే ప్రాకృతసువర్ణ మనబడును. అది దేవతలకుగూడ పొందశక్యము కానిదిగనుండును. హిరణ్యరేతస్కుండగు నగ్నివలన విడువబడినది వహ్ని సంభూత మనబడును. దీనిని సేవించినంతనే కాయసిద్ధికలుగును. పర్వతప్రదేశములయందుండు గనులలోబుట్టిన బంగారము ఖనిజమనబడును. ఇద్దానిని సేవించిన రోగంబుల బోగొట్టును. "బ్రహ్మాయేనావృతో జాతస్సువర్ణేన జరాయుణా । తన్మేరురూపతాం యాతంసువర్ణం సహజంహితత్॥" అని చెప్పబడియుండులాగున హిరణ్యగర్భుండగు బ్రహ్మ జరాయురూపంబున తన్నావరించియుండునే సువర్ణముతోగూడ జన్మించెనో; మేరుపర్వతపు శిఖరరూపంబున నిప్పుడగుపడుచుండు నాసువర్ణము సహజ మనబడును. రసవాదప్రక్రియలయందు చెప్పబడియుండు సంస్కారములచే సంస్కరింపబడియుండు రసముచే స్పర్శాదివేధలనందిన లోహాంతరాదులు సువర్ణముగ మారుటచే నేర్పడునది వేధజము. పైజెప్పబడినవానిలో సహజము వేధజము ఖనిజమునను నీమూడు విధంబులగు సువర్ణంబులును ఐహికపారత్రికంబులగు పురుషార్థములకు సాధనములై శోధనమారణాది సంస్కారంబులచే నమృతస్వరూపమునంది జనులరోగంబులనుపోగొట్టి యారోగ్యసౌఖ్యమును ఆయుష్యభాగ్యమును ఇచ్చును.

"రసజం క్షేత్రజంచైవ లోహసంకరజం తథా । త్రివిధం జాయతే హేమ చతుర్థం నోపలభ్యతే॥" రసజమనియు క్షేత్రజమనియు సువర్ణము మూడువిధములుగ మాత్రముండును. నాల్గవదిలేదు. అని రసార్ణవమున సువర్ణము మూడువిధములుగ మాత్రమే విభజితమైయున్నది.

—॥ శుద్ధాశుద్ధసువర్ణలక్షణములు. ॥—

సీ॥ కనకంబు ఘర్షణంబున మసృణాభమై
కాచిన రక్తిమ కలిగియున్న ।
నరికిన కపిలవర్ణముగల్గి స్వచ్ఛమై
పొరలేక స్నిగ్ధమై బరువుగలిగి ।

అతిపీతవర్ణాభమై మృదువైనను
కనకంబు పరిశుద్ధ మనిరి మునులు।
కాచిన మలినమై కాంతిహీనంబైన
[1]నొకవంక తెల్లనై విరిగి యున్న।
పగులువారిన నిత్తడిపగిదినున్న
కాచినను నల్లనైయున్న కఠినమైన।
మలినమైయున్న రూక్షత కలిగియున్న
గుంజగతినున్న స్వర్ణంబు కూడదండ్రు॥ ౨౧॥

వ్యా॥ బంగారము ఆకురాయి మొదలగువానితో రాచినపుడు చిక్కని కాంతికలిగి యుండవలయును. నిప్పులయందు కాల్చితీసి చల్లార్చినవెనుక నెరుపు రంగుకలదిగ నుండవలయును. పోగరు మొదలగువానిచే నరికినపుడు కపిల (గోరోచన) వర్ణముకలదిగ నుండవలయును. మరియు స్వచ్ఛమగు కాంతికలిగి పొరలులేనిదై నునుపుకలిగి బరువుకలిగి యుండవలయును. మిగుల పసిమియు మెత్తదనమును నుండవలయును. ఇట్టి లక్షణములుగల సువర్ణము శుద్ధమైనది. దీనిని ఉపయోగమునకు గ్రహించుట యుత్తమము. కాల్చినపుడు మాలిన్యముకలదై కాంతిలేకయుండినను కొంతభాగము తెలుపుగలిసియున్నను విరిగియున్నను పగుళ్ళువారియున్నను చూచినంతనే యిత్తడివలె నగుపడుచు కాంతిరహితమైయున్నను కాల్చిచల్లార్చిన నల్లనైయున్నను గట్టిగను పెళుసుగనున్నను గురిగింజవంటి కాంతికలిగియున్నను బంగారము మంచిదిగాదు. దానిని రసాయనయోగాదులయం దుపయోగింపజనదు.

ఇచ్చట నీపద్యముయొక్క నాలవపాదము రెండవయడుగునకు "నొరశేయవెల్లనై విరిసియున్న" యను పాఠాంతర మగుపడుచున్నది. అప్పుడు

1. (ఖ) (గ) నొరశేయవెల్లనై విరిశియున్న.

ఒరగల్లుపై నొరబెట్టినపుడు ఆరేఖ తెల్లనిరంగుగల్గి రేఖ చక్కగ నేర్పడక విడి విడిగనుండినను అని తాత్పర్యము. ఈపాఠము సమంజసముగ నగుపడుచున్నది.

—॥ లోహసామాన్య శుద్ధి. ॥—

గీ॥ తైలమును తక్రమును పంచితంబు కలియు
నులవకట్టును గూర్చి యొక్కొక్క[1]దినుసు।
కలియ నేడేడుమారులు కాచి త్రోయ
సొరిది హేమాదిలోహముల్ శుద్ధిబొందు॥  ౨౨॥

వ్యా॥ శుద్ధిచేయదలచిన లోహసామాన్యమును కొలిమిలోనిడి కాల్చి నువ్వులనూనె మజ్జిగ గోమూత్రము కాంజికము ఉలవలకషాయము అను నీద్రవములయందు వరుసగ నొక్కొకదానియం దేడేసిమార్లు వంతున ముంచునది. (నిప్పునకాచి ద్రవమునముంచి మరలకాచి మరల నాద్రవముననే ముంచునది. ఇత్తెరంగున నేడుసార్లు ఒకద్రమునముంచి తక్కిన ద్రవములయందెల్ల నదే తీరున నేడేసిమార్లు ముంచవలెననుట). ఇటుజేసినచో బంగరు మున్నగులోహములు పరిశుద్ధినందును. ఇయ్యది లోహసామాన్యమునజెప్పబడిన శోధనప్రక్రియయని యెఱుంగునది.

—॥ స్వర్ణశుద్ధి. ॥—

§ రసరత్నసముచ్చయము :— "కర్ష ప్రమాణంతు సువర్ణపత్రం శరావ రుద్ధం పటుధాతుయుక్తం। అంగారసంస్థం ప్రహరార్ధమానం ధ్మానేనతత్స్యా ద్ధ్నునుపూర్ణవర్ణం" కర్షప్రమాణము తూనికగల వన్నెతగ్గిన సువర్ణపురేకులను ఉప్పుతోడను గంధకాది ధాతువులతోడనుచేర్చి మూకుటియందుంచి చీరమంటి నిచ్చి అరజామువరకు నిప్పులయం దూదిన దోషములు హారించి శుద్ధమగు పదునారువన్నె బంగారమగును.

---

1. (క) (గ) దినము.

## —॥ సువర్ణభస్మము. ॥—

సీ॥ చొక్కంపుబంగారు మిక్కిలి పలుచగా
రేకులు జేసి యా రేకులకును ।
సమముగా సూతభస్మము మాదిఫలరసం
బున నూరి రేకుల బూసి యవియు ।
మూకుళ్ళలో నుంచి [1]మూడు పుటంబులు
వేసిన భస్మమై వెలయుచుండు ।
భస్మంబునకు చతుర్భాగంబు [2]సూతంబు
నిమ్మపండురసాన నెమ్మినూరి ।
బిళ్ళ[3]లుగ జేసి [4]చిన్నమూకుళ్ళలోన
పొందుగా నుంచి ముప్పది పుటము లిడిన ।
భస్మమగు నది కుంకుమప్రభయు బోలి
మహితగుణసాంద్ర యాత్రేయవహానిచంద్ర॥ ౨౩॥

వ్యా॥ స్వచ్ఛమై పదునారువన్నెగల శుద్ధమగు బంగారమును విధివిహితముగ శుద్ధిజేసి "కృత్వాకంటకవేధ్యాని" యని చెప్పబడిన యట్లు ముల్లున బొడువదగియుండు నంత పలుచని రేకులుగ జేసి యా రేకుల తూనికకు సమముగ పారదభస్మమును గ్రహించి యాభస్మమున మాదీఫలపు రసమును బోసినూరి దాని నా రేకులకుపట్టించి యా రేకులను మూకుళ్ళయందుంచి చీరనిచ్చి పుటము బెట్టవలయును. ఇట్లు మూడుపుటముల బెట్టిన సువర్ణము భస్మమగును. ఇచట "త్రిమియా తేదశభిః పుటైః" అని పదిపుటముల బెట్టిన భస్మమగునని

---

1. (గ) ముప్పదిపుటములు. 2. (ఖ) (గ) సూతభస్మము నిమ్మపులుసున నమరనూరి. 3. (ఖ) (గ) లాగి. 4. (ఖ) (గ) పిన్న.

దీనిసంస్కృతమూలమున నగుపడుచున్నది. "హేమ్నః పాదం మృతం సూతం పిష్టమమ్లేన కేనచిత్" అని చెప్పబడినప్రకారము పైచెప్పబడినయట్లు చేయబడిన సువర్ణభస్మంబునకు నాలవపాలు పారదభస్మమును కలిపి నిమ్మపండ్లు మొదలగు నమ్లవర్గమునకు చేరినవానిలో దేనియొక్క రసముతోనైనను బాగుగనూరి చిన్నబిళ్ళలుగజేసి సరియగు మూకుళ్ళయందు బాగుగనమర్చి చీరమంటినిచ్చి పుటము బెట్టవలయును. ఇట్లు ముప్పదిసార్లు పుటములబెట్టిన కుంకుమకాంతి కలిగి సిందూరించి భస్మమగును.

మరియు "లోహానాం మారణంశ్రేష్ఠం సర్వేషాం రసభస్మనా। మూలీభిర్మధ్యమం ప్రాహుః కనిష్ఠం గంధకాదిభిః। అరిలోహేన లోహస్య మారణం దుర్గుణప్రదమ్॥" లోహములను భస్మముగజేయు యోగములయందు రసభస్మమునుచేర్చి చేయబడు యోగము లుత్తమములు. మూలికలచే జేయబడు యోగములు మధ్యమములు. గంధకాది ధాతువులచే చేయబడు యోగములు అధమములు. ఒకలోహమును మరియొక శత్రులోహముతో జేర్చి పుటాదులం బెట్టి చేయబడు మారణ ముత్తమముకాదు. అట్టి భస్మమును సేవించిన దుర్గుణములనుకూడ కలుగజేయును. అని చెప్పబడినచొప్పున యుత్తమముగ గ్రహించబడిన రసభస్మసంబంధముచే చేయబడు విధానమే యిచ్చట చెప్పబడినది. అందు మొదటి మూడు సీసపాదంబులచే సువర్ణభస్మవిధానమును నాలవపాదమునను గీతమునను భస్మమును సిందూరీకరించుపద్ధతియు చెప్పబడియున్నవి. ఇందు సిందూరీకరించుటకై చెప్పబడినపద్ధతి గ్రంథాంతరములయందు భస్మవిధానమున కన్యపద్ధతిగ చెప్పబడియుండుటయేగాక అచ్చటచ్చట పరస్పరమున కొంతభేదమును అగుపడుచున్నది. ఎట్లన:—"హేమ్నః పాదం మృతం సూతం పిష్టమమ్లేనకేనచిత్। పత్రేలిప్త్వా పుటైః పచ్యాదష్టభి ర్మ్రియతే ధ్రువమ్" భస్మముచేయుటకై గ్రహింపబడిన బంగరుయొక్క పరిమాణమున నాలవపాలు పారదభస్మమును గ్రహించి అందు ఏదేని యమ్లవర్గమునకు చేరినయొకదానిరసమును బోసి నూరి యాపిష్టమును బంగరురేకులకు బూసి పుటము బెట్టవలయును. ఇట్లెనిమిదిపుటములు బెట్టిన సువర్ణము మృతమగును అని చెప్ప

బడియున్నది. ఇది సువర్ణమారణమునకై చెప్పబడినయోగము. ఇందు సూత భస్మము నమ్లవర్గమునకుచేరిన దేనితోనైననునూరి బంగరురేకులకుబూసి యెనిమిది పుటములుమాత్రము పెట్టవలయునని చెప్పబడియున్నది. ఈగ్రంథమున సువర్ణము భస్మమైనవెనుక నాభస్మమున సూతభస్మమునుచేర్చి నిమ్మపండ్లరసముతోచేర్చి నూరి ముప్పదిపుటములు పెట్టవలయునని చెప్పబడియున్నది. ఇద్దానిని విచారించిచూడ గ్రంథకర్త గ్రంథాంతరములయందు సువర్ణమారణమునకై చెప్పబడినయోగమును ప్రక్రియనుమార్చి యుపయోగించిచూచి తన యనుభవముచే నీగ్రంథమున సిందూరీకరణయోగముగ వ్రాసియుండవచ్చును. లేక ప్రత్యంతరభేదముచేనైన నిది తటస్థించి యుండవచ్చును. ఈ గ్రంథకర్తచే జెప్పబడినయోగము సామాన్యముగ నీయనచే ననుసరింపబడుచుండు గ్రంథములయందు వేరువిధముగ నగుపడుచుండుటచే నిట్టి వికల్పనములు చేయవలసివచ్చినది.

## — సువర్ణభస్మోపయోగము. —

ఉ॥ మంచిసువర్ణభస్మము క్రమంబునగొన్నను రాజయక్ష్మముల్।
సంచితకర్మజంబులగు సర్వరుజంబులు భూత[1]వేధలున్ ।
ద్రుంచియమోఘవీర్యమయిదోర్బలమున్ ఘనకాంతి తేజము।
త్యంచితబుద్ధిమార్గముచిరాయువొసంగునుమానిచంద్రమా॥

వ్యా॥ సరియగు మార్గమున శోధనమారణములు చేయబడిన శ్రేష్ఠమగు సువర్ణముయొక్క భస్మమును విధివిహితమగు క్రమంబున సేవించిన రాజయక్ష్మలును పూర్వజన్మసంచితమగు దుష్కర్మమువలన నేర్పడిన సమస్తరోగంబులును నశించును. భూతసంబంధములగు బాధలు తొలగును. సఫలమగు శక్తి కలిగినదియై యీభస్మము మంచివీర్యమును మంచిదేహకాంతిని ముఖవర్చస్సును తీక్ష్ణమగుబుద్ధిని దీర్ఘాయుష్యము నిచ్చును.

1. (ఖ) భేదమున్.

—( స్వర్ణసిందూరము. )—

ర సరత్న సముచ్చయము :—“ ద్రుతేవినిక్షిపేత్ స్వర్ణేలోహమానం మృతంరసమ్ । విచూర్ణ్య లింగతోయేన దరదేన సమన్వితమ్ । జాయతే కుంకుమచ్ఛాయం స్వర్ణం ద్వాదశభిః పుటైః॥” సువర్ణముతో సమముగు తూనికగల రసభస్మమును ఇంగిలీకముతోఁ జేర్చి మాదీఫలరసంబునఁ బోసి నూరి కరగిన మంచిబంగారముతోఁ జేర్చి పండ్రెండు పుటములు బెట్టిన సువర్ణము కుంకుమ వంటి కాంతిగలిగి సిందూరమగును.

సంస్కృతరసప్రదీపిక:—“సూతేన పిష్టికాం కృత్వా సువర్ణస్య వినిక్షిపేత్ । నీలాంజన మధశ్చోర్ధ్వం శరావేపరిబధ్యచ । పిష్టకై రష్టభిర్దద్యాత్ పుటానాం వింశతిర్దశ । తత్కుంకుమప్రభం భస్మయోజ్యం రసరసాయనే॥” సువర్ణమును పాదరసముతోఁ కలిపినూరి యాపిష్టికను మూసుటియందుంచి పై భాగమునను అడుగుభాగమునను నీలాంజనమునుబోసికప్పి పైన మూకుడు మూసి చీరమంటినిచ్చి బిగించవలయును. పిమ్మట దానిని యెనిమిది పిడకలతోఁ పుటము బెట్టవలయును. ఇట్లు ముప్పది పుటములబెట్టిన కుంకుమవంటి కాంతికలిగి సిందూరించి సువర్ణము స్వచ్ఛముగు భస్మ(సిందూర)ముగును.

—( స్వర్ణద్రుతి )—

రసరత్న సముచ్చయము:—“మణ్డూకాస్థివసాటఙ్క హయలాలేన్ద్రగోపకైః । ప్రతివాపేన కనకం సుచిరం తిష్ఠతిద్రుతమ్ । చూర్ణంసురేన్ద్రగోపానాం దేవదాలీఫలద్రవైః । భావితం సప్తశం హేమ కరోతి జలవద్ద్రుతిమ్॥”

కప్పయొక్క అస్థులు, వస, వెలిగారము, గుఱ్ఱపుజొల్లు, ఇన్ద్రగోపపు పురుగులు (ఆర్ద్రపురుగులు), అను నీద్రవ్యముల నొకటిగ జేర్చి యెండ నెండించి చూర్ణము జేసియుంచుకొనునది. పిదప బంగారమును కరిగించి అయ్యది చక్కగ కరగుసమయమున పైజెప్పినచూర్ణమును ప్రతివాపము (స్వర్ణాదిధాతువులు కరగునపుడు చూర్ణమును అందువేయుట) జేసినచోఁ ద్రవరూపమునందిన స్వర్ణము మరలగట్టిపడక యెల్లప్పటికిని ద్రవముగనే యుండును.

మఱియు నింద్రగోపపు పురుగుల నెండించి చూర్ణముజేసి దేవదాళి (దావరడంగి) పండ్లరసమున భావనజేసి యాచూర్ణమును బంగరు కరుగు నపుడు అందు కలిపినచో నీళ్లవలె బంగారు కరిగి యెల్లప్పుడును ద్రవము గనే యుండును.

—( వెండి. )—

సీ॥ విను వెండి త్రివిధమై విలసిల్లు ఖనిసంభ
వము సహజంబు కృత్రిమ మనంగ ।
గణుతింప సహజంబు కైలాసగిరి బుట్టు
ఖనిజంబు పర్వతఖనుల బుట్టు ।
విను కృత్రిమము రసవేధచే నాగవం
గములందు [1]జనియించు కాంతితోడ ।
కాచిన తెల్లనై ఘనకాంతివంతమై
శుభ్రమై మెరుగైన శుభ మటంద్రు ।
మలినమైనను రూక్షమై బరువు లేక
కుటిలమై నల్లనైయున్న కూడదంద్రు ।
సీసవెలిగారములతోడ వేసికరుగ
శుభ్రమగుచును రజతంబు శుద్ధి బొందు॥ ౨౫॥

వ్యా॥ ఖనిసంభవమనియు సహజమనియు కృత్రిమమనియు వెండి మూడువిధములై యుండును. అందు కైలాసపర్వతముననుండు వెండి సహజమన బడును. హిమాచలాది పర్వతశిఖరములయందలి గనులలోబుట్టు వెండి ఖని సంభవమనబడును. రసవేధచేత నాగవంగములు రజతముగ జేయుటచే నేర్పడు వెండి కృత్రిమ మనబడును. సహజ ఖనిజకృత్రిమము లనునీమూడువిధములగు

1. (ఖ) నుదయించు.

రజతంబులయందును "రజతం పూర్వపూర్వం వైస్యగుణై రుత్తమోత్తమమ్" అను ప్రమాణము ననుసరించి ఉత్తరోత్తరమగు జాతికంటె పూర్వపూర్వమగు జాతి శ్రేష్ఠమైనదిగ నెఱుంగవలయును. కృత్రిమముకంటె ఖనిజమును ఖనిజ మునకంటె సహజమును శ్రేష్ఠములనుట.

కాచినను నరికినను తెల్లనై బరువుగలిగి కాంతివంతమై మాలిన్యములేక నున్నపై మెత్తనై బుడుపులులేక యుండునది యుత్తమమైనది. మాలిన్యము కలిగినదై పెళుసుగుణముకలిగి తేలికగ గరగరలాడుచు "దాహే రక్తం చ పీతం చ కృష్ణం" అని చెప్పబడిన యట్లు కాల్చిన నెఱుపుగనైనను పసుపుగ నైనను నలుపుగనైనను కాంతిగలిగియుండిన నట్టిరజతము శ్రేష్ఠముకాదు. సీస మును వెలిగారమును కలిపి యూదినచో శుద్ధముకాని వెండి శుద్ధమగును.

రసరత్నసముచ్చయాదులయందు:—"శ్రీరామపాదుకాన్యస్తం వంగం యద్రూప్యతాం గతమ్। తత్పాదరూప్య మిత్యుక్తం కృత్రిమం సర్వరోగ నుత్" ఇత్యాదిగ్రంథముచే శ్రీరామపాదుకలయందు ఘటితమైయుండు వంగము రజతముగ పరిణామము నందెననియు అదియే పాదరూప్యమనియు కృత్రిమ మనియు చెప్పబడుననియు నగుపడుచున్నది.

దీనికంటె రసవాదప్రక్రియలయందు "రసోపరసవర్గంతు నిర్వాహే న్నాగవంగయోః। నాగవంగౌ పునఃశుల్బే శుల్బంతారేతు నిర్వహేత్" అను మొదలగువానియందు చెప్పబడిన ప్రక్రియననుసరించి కృత్రిమరజతమును గురించి రసవేధచే నాగవంగములు రజతముగ మారుటచే నేర్పడునది కృత్రిమమని యీగ్రంథకర్తచే చెప్పబడిన ప్రక్రియయే యుత్తమముగ గన్పట్టు చున్నది.

"శుక్లం చ తారకృష్ణం చ ద్వివిధం రజతం ప్రియే" యని రసార్ణవ మున రజతము రెండువిధములుగనే విభజింపబడియున్నది.

—॥ రజతశుద్ధి. ॥—

§ రసరత్నసముచ్చయము:—"తారం త్రివారం నిక్షిప్తం తైలే జ్యోతిష్మతీభవే। ఖర్పరే భస్మచూర్ణాభ్యాం పరితః పాలికాం చరేత్। తత్ర

రూప్యం వినిక్షిప్య సమసూతసమన్వితమ్ । జాతసీసక్షయం యావ ద్ధమేత్తా వత్పునఃపునః । ఏవం సంశోధితం సూతం యోజ్యం రసరసాయనే॥'' వెండిని కాల్చి జ్యోతిష్మతీతైలమునందు మూడుసార్లు ముంచి యనంతర మొకమూకుటియందు చుట్టును బూడిదయు సున్నమును కలిపినూరి దానితో కట్టగకట్టి దానినడుమ నాపై జెప్పబడిన వెండిని సమానపరిమాణముగల సీసముతో కలిపి యుంచి కుంపటియందు సీసము హరించుదనుక గాఢముగ నూదిన వెండి శుద్ధమైనదగును.

## —( రజతభస్మము, దాని యుపయోగము. )—

సీ॥ తారంబు సమము సూతము నిమ్మపులుసున
కలియ మర్దించి రేకులకు బూసి ।
పుటపాత్రలో నుంచి పొడిగంధ[1]కంబు రే
కులకు పైక్రింద సందులను జల్లి ।
పయిపూత నిడి లెస్స పొయిమీద నొకనాడు
వాలుకాయంత్రాన వండి తీసి ।
కాకమాక్షికతోడ కలనూరి ముప్పది
రెండు పుటాల నిరుత్థమగును ।
తారభస్మంబు నభ్రికాంతములతోడ
సేవజేసిన జ్వరమృత్యుజీర్ణకరము ।
క్షయమహాశ్వాసకాసనంక్షయము సర్వ
పాండుగుదజోదరాది విభ్రమము లణచు॥ ౨౽॥

వ్యా॥ భస్మముచేయుటకై గ్రహింపబడు వెండియొక్క తూనికకు సమమగు పరిమాణముగల రసభస్మమున నిమ్మపండ్లరసముబోసి నూరి యా

1. (క) కమ్మ.

పిష్టిని శుద్ధిచేసిన వెండిరేకులపై బూయవలయును. అట్టి వెండిరేకులను పుటమున కుపయోగింపబడు మూసయందుంచి వెండిరేకులకు క్రిందను పైభాగమునను అన్నివైపులను సందులేకుండులాగున చూర్ణము చేయబడిన గంధకముతో గప్పి మూసయొక్క ముఖమునుమూసి చీరమంటినిచ్చి బిగించి యెండించి యామూసను వాలుకాయంత్రంబునందుంచి గాఢమగునగ్నియం దొకదినము వండవలయును. స్వాంగశీతలమున నామూసను యంత్రమునుండితీసి పుటితమైన వెండితో కాకమాక్షికమును కలిపి నిమ్మపులుసున మర్దించవలయును. ఇట్లు మర్దనమును చేయుచు ముప్పదిరెండుపుటములు పెట్టిన వెండి భస్మమగును. ఇట్టి రజతభస్మమును "భస్మీభూతం రజతమమలం తత్సమావ్యోమభానూ సర్వైస్తుల్యం త్రికటుకవరం సారఘాజ్యేనయుక్తం" అని చెప్పబడినచొప్పున దానితో సమానమగు అభ్రకభస్మముతోడను కాంతభస్మముతోడను చేర్చి పైమూడు భస్మములయొక్క పరిమాణమునకును సమముగ త్రికటుకముల చూర్ణమును కలిపి చాలినంత తేనెను నేతినిచేర్చి సమముగ పరిమాణమున సేవించిన జ్వరములను హరించును. దీపనపాచనములు చేయును. క్షయవ్యాధిని శ్వాసకాసరోగములను నశింపజేయును. సమస్తవిధములగు పాండురోగములను ఉదరవ్యాధులను అర్శస్సులను పిత్తవికారములను పోగొట్టును.

—॥ రౌప్యద్రుతి. ॥—

§ రసరత్నసముచ్చయము :—"సప్తధానరమూత్రేణ భావయేద్దేవదాలికామ్ । తచ్చూర్ణ వాపమాత్రేణ ద్రుతిస్స్యాత్స్వర్ణతారయోః॥"

డావరడంగిని మనుష్యమూత్రమున నేడుసార్లు భావనజేసి యెండించి చూర్ణముజేసి వెండి కరగునప్పుడు పైచూర్ణమును కలిపినచో వెండి నీళ్లవలె కరగి గట్టిపడకయుండును. ఈయోగముచేత బంగరుకూడ ద్రవించును.

—॥ సువర్ణరజత భస్మములు. ॥—

♦ 1. శుద్ధిజేసిన బంగారును రజనుజేసి దానికి నాలవవంతు రసభస్మమునుజేర్చి యెఱ్ఱముళ్ళతోటకూర రసమున నాలుగైదు దినములు చక్కగనూరి

సంప్రదాయము నెరింగి పుటము వేయవలెను. ఇటుల సిద్ధమగు భస్మమునకు నాలవవంతు రసభస్మమును జేర్చి నైరసముతో మర్దనముజేయుచు పది పుటములు వేసిన చక్కగ సిందూరించును.

2. శుద్ధిజేసిన బంగారురజనును నాలవవంతు రసభస్మమును జేర్చి యొట్టుముళ్ళకోటకూర క్షారమును సమముగ జేర్చి నిమ్మపులుసునమర్దించి పై రీతిని పుటము వేయునది. ఈరీతిని పదిపుటములు వేసిన జక్కగ సిందూరమగును. ఈ భస్మము ననుపానభేదంబుల పరిమితుల నెరింగి యుపయోగింపనగును, మరియు నౌషధయోగములం జేర్పందగు.

## —॥ రజతభస్మము. ॥—

♦ శుద్ధిజేసిన వెండిని మెత్తగ పొడివలె ఆకురాయిచే రజనుజేసి ఆరజనుకు సమముగ కోడిగ్రుడ్ల పెంకులనుజేర్చి ఖల్వములోనునిచి నిమ్మపులుసున మూడు నాలుగురోజులు మెత్తగ కాటుకవలె నూరవలెను. పిదప బిళ్ళజేసి యెండించి మూసలోనుంచి చీరజేసి నీడనుఆర్చి కొలిమిలోనుంచి గాఢాగ్నిని యొకజాముకాల మూదవలెను. స్వాంగశీతలమున మూసను వైటదీసి అందలిమందునుగ్రహించి యందుకు అర్ధభాగముగ తిరిగి కోడిగ్రుడ్ల పెంకులను జేర్చి నిమ్మపులుసున పూర్వమువలె నూరి మునుపటివలెనే కొలిమిలోనుంచి యూదవలెను. ఈరీతి పదితడవలు జేసిన రజతము భస్మమగును. ఇయ్యది క్షయములకును శుక్లనష్టము శగరోగము మొదలగు మేహవ్యాధులకును ననుపానభేదంబుల నుపయోగించునది. మరియు నౌషధయోగంబులం జేర్చవచ్చును.

## —॥ రాగి ॥—

సీ॥ విను రాగి ద్వివిధమై విలసిల్లు నేపాళ
తామ్రం బనగ మ్లేచ్ఛతామ్ర మనగ।
మ్లేచ్ఛతామ్రముకన్న మేలు నేపాళంబు
ఘనరక్తకాంతియు గలిగియుండు।

కరగిన కొట్టిన కాచిన నరికిన
మలినము లేక నిర్మలము నగుచు।
విషముకంటెను మహావిషము తామ్రంబది
యష్టవిధంబులై యమరుచుండు।
భ్రమియు మూర్ఛయు దాహంబు భ్రాంతి వాంతి
జాడ్యమును దప్పి యలతయు చాల జేయు।
గాన తామ్రము పరిశుద్ధిగా నొనర్చి
సేవ జేసిన కార్యసంసిద్ధి జేయు॥ ౨౭॥

వ్యా॥ నేపాళతామ్రమనియు మ్లేచ్ఛతామ్రమనియు తామ్రము రెండు విధములనుండును. అందు "నేపాలాదన్యఖన్యుత్థం మ్లేచ్ఛమిత్యభిధీయతే" అను ప్రమాణమునుబట్టి నేపాలదేశపు గనులయందు బుట్టు తామ్రము నేపాల తామ్రమనియు దానికంటె నితరములగు దేశములయందలి గనులయందు బుట్టు తామ్రము మ్లేచ్ఛతామ్రమనియు చెప్పబడును. అందు మ్లేచ్ఛతామ్రమునకంటె నేపాలతామ్ర ముత్తమమైనది. నేపాలతామ్రము దట్టముగు నెరుపుకాంతి గలిగియుండును. కరగినను సమ్మెటతో సాగగొట్టినను నరికినను మాలిన్యము లేక యెరుపుకాంతి యొకటేవిధముగనుండును. మరియు "సుస్నిగ్ధం మృదులం శోణం ఘన ఘాతక్షమం గురు। నిర్వికారం గుణశ్రేష్ఠం తామ్రం నేపాలము చ్యతే॥" అని చెప్పబడియుండునట్లు నేపాలతామ్రము నునుపుగను మెత్తగను సమ్మెటదెబ్బలకు పొడిపొడిగ నలిగిపోక తాళియుండునదిగను ఎరుపుకాంతి కలిగినదిగను వమనాదివికారముల కలిగింపనిదిగను ఉత్తమగుణముల జేయునదిగను నుండును

లోకంబున విషంబులుగ ప్రసిద్ధములైయుండు ద్రవ్యములకంటె తామ్రము గొప్పవిష ద్రవ్యము. దీనిని తగువిధమున శుద్ధియొనర్పక యుపయోగించిన అనేకవిధములగు దోషములను కలిగించును. అట్టి దోషములు ఒడలు తిరుగు

టయు మూర్ఛకలుగుటయు తాపమును మనోదార్ఢ్యము చెడిపోవుట వమనము కలుగుట ఇంద్రియజ్ఞానముపోవుట విదాహము ఆయాసము కలుగుటయునని యెనిమిదివిధములుగ నేర్పడును. కావున తామ్రమును శాస్త్రవిధానము ననుసరించి శుద్ధిజేసిన యనంతరముననే మారణాది పరిణామములనందించి యుపయోగింపవలయును. అట్లుపయోగించిన గుణమునిచ్చును. “ఉత్క్లేదభేదభ్రమదాహమోహాస్తామ్రస్యదోషాః ఖలు దుర్ధరాస్తే” అని ఆయాసము భ్రాంతి త్రిప్పుట తాపము మూర్ఛయును నైదుదోషములుమాత్రమే కొన్ని గ్రంథములయందు చెప్పబడియున్నవి.

మ్లేచ్ఛతామ్రము “సితకృష్ణారుణచ్ఛాయం అతివామి కఠోరకమ్ । క్షాలితంచ పునఃకృష్ణ మేతన్మ్లేచ్ఛకతామ్రకమ్॥” అని చెప్పబడియుండునట్లు తెలుపును నలుపును ఎరుపును కలిసిన రంగుకలిగియుండును. అధికముగ వమనమును వికారమును చేయును. సాగగొట్టునపుడు కఠినముగనుండును. మాలిన్యమును పోగొట్టు అమ్లాదులచే తోమినను తిరిగి నల్లనగుచుండును. మరియు నేతామ్రమైనను “పాండురం కృష్ణశోణంచ లఘుస్ఫోటనసంయుతమ్ । రూక్షాంగం సదళం తామ్రం నేష్యతే రసకర్మణి॥” అని తెల్లగనైనను నలుపును యెరుపునుకలిసిన రంగుకలిగినదిగనైనను తేలికగనైనను పగుళ్ళుకలిగినదిగనైనను పెళుసగు నవయవములు కలిగినదిగనైనను పొరలు కలిగినదిగనైనను నుండెనేని అట్టితామ్రమును రసకర్మలయందుపయోగింపజనదని గ్రంథాంతరములయందు విశేష మగుపడుచున్నది.

“దర్శనేశుకతుండాభం తాడవే దరదోపమమ్ । జ్వాలనేకణికాభాసం శుద్ధతామ్రస్య లక్షణమ్” ఊరకచూచునపుడు రాగి చిలుకముక్కువంటి యెరుపును సుత్తెతో సాగగొట్టునపుడు ఇంగిలీకమువంటి రంగును కాల్చునపుడు అగ్నికణము వంటి కాంతియు కలిగినదిగ నుండవలయును. ఇట్లుండు తామ్రము శుద్ధమైనది, అని శుద్ధతామ్రముయొక్క లక్షణముకూడ దీని సంస్కృతమూలమున చెప్పబడియున్నది.

నేపాలదేశమందలి గనులయందు దొరకునట్టి రాగి మంచిదనియు, తదితరదేశములయందు దొరకునది శ్రేష్ఠముగాదనియు తేటపడుచున్నది. రాగి పూర్వకాలమున నేపాళ మ్లేచ్ఛదేశములయందు దొరకుటచేత "నేపాలమనియు, మ్లేచ్ఛమనియు, నామంబులు ప్రసిద్ధినందినటుల దెలియుచున్నది. మఱియు "తామ్రం చ ద్వివిధం ప్రోక్తం రక్తం కృష్ణం సురేశ్వరి" అని రక్త కృష్ణభేదముచే రాగి రెండువిధములుగ కొన్నిచోటుల విభజింపబడియున్నది.

— తామ్రశుద్ధి, భస్మము. —

సీ॥ మునుపుగా శుద్ధిజేసిన రాగిరేకులు
　　చించామ్లమున [1]నుడికించి తీసి।
తామ్రంబు సమము గంధక మిడి గంధక
　　పాదంబు సూతంబు పాదుకొల్పి।
నిమ్మపులుసున నూరి కమ్మకో రేకుల
　　పైనిండబూసి కాల్పార్చి యవియు!
పుటపాత్రలో నుప్పు బోసి యాపైనిటికె
　　పొడిబోసి రేకులు పొసగ నుంచి।
పై పొడిబోసి యాపైయుప్పు తగ నుంచి
　　మరి మూతనిడి చీరమన్ను లిచ్చి।
సరగున నాలుగుజాములు వండిన
　　పసచెడి తామ్రంబు భస్మ మగును।
కాకమాచికి తోడుత కలియ నూరి
కొనుచు బిళ్ళలుజేసి మూకుళ్ళలోన।

1. (క) నుంచిరేచి

పుటము లిడినను ముప్పది పుటములకును
రూఢిగాను వారితరము నిరుత్థ మగును॥ ౨౮ ॥

వ్యా॥ శాస్త్రవిహితమగు పద్ధతిననుసరించి అంతకుపూర్వమే శుద్ధి చేయబడియుండు రాగిరేకులను భస్మముచేయుటకై గ్రహించుటకుముందుగ చింతపులుసునవైచి బాగుగనుడికించి యెత్తికడిగి గ్రహింపబడిన రాగియొక్క తూనికకు సమముగ గంధకమును ఆగంధక పరిమితియందు నాలవపాలు రస భస్మమునుచేర్చి నిమ్మపండ్ల రసముబోసినూరి యాముద్దను రాగిరేకులపై బాగుగ మూయునట్లు అన్నిభాగములయందును పట్టించి నీడనెండించవల యును. పిమ్మట పుటమువేయదగిన పాత్రయందు ముందుగ నుప్పుబోసి పేర్చి యాపై యిటికెలచూర్ణమును పరచి అందుపై పైచెప్పబడియుండు రాగిరేకుల నుంచవలయును. తరువాత నారాగిరేకులపై తిరుగ నిటికెపొడిబోసి పేర్చి యాపై మరలనుప్పుబోసి సవరించి పైన మూకుడు మూయవలయును. అనంత రమున చీరమంటినిచ్చి యెండించవలయును. అట్లా పుటపాత్రమును ప్రొయ్యి పైనుంచి నాలుగుజాముల కాలమువరకు గాఢాగ్నిని వండిన రాగి భస్మము గును. అనంతర మాభస్మమును జాగ్రతగనెత్తి కాకమాచికతో కలిపి యమ్లరసం బునుపోసి నూరి బిళ్ళలుగజేసి మూకుళ్ళయందుంచి పుటముబెట్టుచుండవల యును. ఇట్లు ముప్పదిపుటములు వేసిన తామ్రభస్మము జలదివ్యశోధనమునకు తగినదిగ నేర్పడి పరిశుద్ధమగు భస్మమగును.

ఈ విధానము రసరత్నసముచ్చయాది ప్రధానరసగ్రంథములయం దగు పడదు. గ్రంథకర్త తనయనుభవసిద్ధమనియో గ్రంథాంతరములనుండి సంగ్ర హించియో యీ యోగమును వ్రాసెనని తోచుచున్నది.

## — తామ్రశోధనము. —

§ (1) దీని సంస్కృతమూలము:— "తామ్రనిర్దళపత్రాణి లిప్త్వా నింబ్వాంబుసింధునా । ధ్మాత్వా సౌవీరకే క్షేపాద్విశుధ్యత్యష్టవారతః॥" పొర లులేని రాగిరేకులకు నిమ్మపండ్లరసమును ఉప్పును కలిపినూరి పట్టించి నిప్పుల

యందూది కాంజికమున ముంచవలయును. ఇట్లేనిమిది పర్యాయములుచేసిన రాగి శుద్ధమగును.

(2) "యామం గోక్షీరకే పక్త్వా తత్తైలే (తక్రే ?వ) స్థాపయేద్దినమ్। దినైకం లవణోపేతతింత్రిణీదళకర్దమే॥" రాగిరేకుల నొకజాము ఆవుపాలయందువండి ఒకదినమంతయు నందుంచవలయును. పిమ్మట చింతాకుయందుప్పువైచి రోకటితో బురదవలెనగునట్లు త్రొక్కి యాముద్దయం దొకనాడుంచవలయును. అట్లుచేసిన రాగి శుద్ధమగును.

రసరత్నసముచ్చయము:—"గోమూత్రేణ పచేద్యామం తామ్రపత్రం దృఢాగ్నినా । శుధ్యతే నాత్రసందేహః" రాగిరేకులను గోమూత్రంబున వైచి యొకజామువండిన నిస్సందేహముగ శుద్ధమగును.

తన్త్రాన్తరము:—"స్నుహ్యర్కక్షీరలవణ క్షారామ్లపరిలేపితమ్। తామ్రపత్రంచ నిర్గుండీరసమధ్యేతు ఢాలయేత్॥" రాగిరేకులకు జెముడుపాలను జిల్లేడుపాలను ఉప్పును క్షారములను పులుసులను పట్టించుచు కాల్చి వావిలాకురసమున ముంచుచుండిన రాగి శుద్ధమగును.

—៛ తామ్రభస్మము. ៛—

♦ (1) శుద్ధిజేసిన తామ్రమును రెండు డిప్పలుగా జేసి యందొకడిప్పయందు రసము, గంధకము, నవాసారము ఈ మూడును తామ్రమునకు సమభాగములుగ గ్రహించి తెల్లబాడిదపాకు లేక చెక్కెరసమున చక్కగనూరి ముద్దజేసి యాముద్దను తామ్రపుడిప్పలోనుంచి పైన మరియొకడిప్పనుమూసి గోపిచందనముచే చీరజేసి యెండించి గజపుటము వేయునది. స్వాంగశీతలానంతరము దానినిదీసి పైనుండు గోపచందనమును చక్కగవదలించి తామ్రసంపుటసముదాయమును గ్రహించి ఖల్వమునునుంచి నిమ్మపులుసున మెత్తగ నైదారురోజులు నూరవలెను. పిదప బిళ్ళజేసి నీడనెండించి శరావసంపుటమునునుంచి చీరజేసి యెండించి గజపుటమువేయునది. ఈరీతి నైదారు తడవలు మర్దించి పుటములువేసిన తామ్రము భస్మమగును.

(2) శుద్ధిజేసిన రజనును ఒకగాజుపాత్రములోనుంచి తెల్లజిల్లేడుపాలను అది మునుగునట్లుపోసి యెండించేది. ఈరీతి జిల్లేడుపాలను పది తడవలు ఆరజను మునుగునటులబోసి యెండించవలెను. ఎండిన పాలతోకూడిన యా రజను వుండకుసైన తెల్లని సన్నని బట్టనుచుట్టి పిదప పదితడవలు జిల్లేడుపాలను ప్రతిదినముపోయుచు నెండించుచు నుండవలెను. జిల్లేడుపాలతో కూడిన రాగిరజనుముద్దకు తెల్లవావడును సమూలముగ నూరి ఆరంగుళముల మందముగ పైన కవచమునిచ్చి యెండబెట్టించి చీరజేసి నీడనార్చి గజపుటము బెట్టవలెను. పుటము స్వాంగశీతలమగువరకును మనుజుని ఛాయ యాప్రదేశమున నెంత మాత్రము తగలగూడదు. స్వాంగశీతలమునుబొందిన పిదప భస్మమును జాగ్రతగా గ్రహించవలెను.

(3) శుద్ధిజేసిన తామ్రమునుపొడిజేసి దానికి సమము కోడిగ్రుడ్లపెంకులను పటికను జేర్చి నిమ్మకాయపులుసుతో నైదాఱుదినములు చక్కగామర్దించి బిళ్లజేసి నీడనుయెండించి శరావసంపుటంబుననుంచి చీరజేసి యార్చి గజపుటం బిడవలెను. ఈరీతి ప్రతితడవను కోడిగ్రుడ్లపెంకులును పటికను సిద్ధమగు భస్మమునకు సమముగజేర్చి నిమ్మపులుసునమర్దించి పైరీతిగ నైదాఱు పుటములు వేయవలెను. తామ్రము చక్కగ భస్మమగును.

(4) శుద్ధిజేసిన యొకపలమెత్తు రాగిరేకుకు సమముగ గంధకమును జిల్లేడుపాలతోడను నిమ్మకాయపులుసుతోడను మెత్తగనూరి పైరేకుకు దిగువను పైనను పట్టించి మూకుటిలోనుంచి పైన మూకుడుమూసి చీరజేసి యెండించి నూరుపిడకలతో పుటమువేయవలెను. పిదప నారేకును గ్రహించి మూకుటిలోనుంచి శుద్ధులోనర్చిన యొకపల పరిమితమగు గంధకమును ఒకపలము సౌవీరమును పొడిచేసి యారెంటిపొడిని ఆరేకుకు క్రిందుమీదుపోసి పైన మూకుడు మూసి చీరజేసి యెండించి ఆశరావ సంపుటమును పొయ్యిమీదనుంచి కమలాగ్ని నొకజాముకాలము వండవలెను. స్వాంగశీతలమైన పిదప సంపుటమును గ్రహించి చీరనువిప్పి యందలి భస్మమును జాగ్రతగ గ్రహించునది.

(5) శుద్ధిజేసిన తామ్రమును పొడిజేసి ఆరజనును ఒక యినుపబాణలిలోనుంచి కొలిమిలోబెట్టి సమూలమగు తెల్లగలిజేరరసమును ఆబాణలిలో బోయుచు కొలిమిని గాఢముగ నూదవలెను. ఇటుల తామ్రపురజను సిందూరమగువరకును తెల్లగలిజేరు రసమునుబోయుచు గాఢాగ్ని నూదవలెను. చల్లారినపిదప గ్రహించి ఖల్వమునందుంచి నిమ్మకాయరసముతో నూరి ఐదారు పుటములు వేయవలెను. చక్కని భస్మమగును.

## తామ్రసిందూరము.

శుద్ధిజేసిన తామ్రపురజను చక్కగ నైదారుసారులు నిమ్మకాయ పులుసుతోగడిగి యెండించవలెను. ఇట్టి రజనుకు నల్లమందును కొంచెము కొంచెముగా జేర్చుచు ఇనుపమూకుటిలోవేసి పొయ్యిమీదనుంచి క్రమముగా నల్లమందును వేయుచు వేయించవలెను. ఈరీతిని నెమ్మదిగ వేయించుచుండిన సిందూరమగును. పిదప నాసిందూరమును ఖల్వమునందుంచి నిమ్మపులుసుననూరి నైదారుపుటములువేసిన చక్కని భస్మమగును.

పైజేర్కొనిన తామ్రభస్మము ఔషధయోగంబుల జేర్చందగు. మరియు నీ భస్మసిందూరములు అనుపానభేదంబున నుపయోగించిన విశేషఫలదాయకములుగనుండును. మూలరోగము, కుష్టు, సామాన్యచర్మవ్యాధులు, శ్వాసము, కాసము, రాజయక్ష్మ, గండమాలలు, రక్తవికారములు, క్రూరకఫవ్యాధులు మొదలగు వానిని నివర్తిజేయును. వీనిపరిమితి యొకయవ మొదలు రెండు మూడుయవల పరిమితిగ నియ్యందగును.

## తామ్రభస్మోపయోగము.

లయ॥ మంచియనుపాన[1]మున మించ[2] తామ్రం బనుభ
వించ మృత్యువు జరయణంచు జ్వరబాధల్ ।
ద్రుంచి శూలలను హరియించి పాండువు నణం

---

1. (క) మును  2. (క) (గ) మించి

గించి క్షయములను నిరసించి ప్లీహాదుల్ ।
ద్రుంచి [1]యర్శముల బెకలించి గ్రహణులను నద
లించి బలుకాంతులను మించంగ జేయుఞ్ ।
కొంచక నొసంగి సిరిమించి భూజనుల వల
పించు తామ్ర [2]పుగుణం బెంచ దర మానె॥ ౨౯॥

వ్యా॥ శాస్త్రసిద్ధమగు ప్రక్రియననుసరించి శోధనమారణముల నందించ బడిన తామ్రమును యుక్తమగు ననుపానముతోఁ జేర్చి యుచితప్రమాణంబున సేవించిన అకాలమృత్యువును అకాలపు ముసలితనమును పోగొట్టును. సర్వ విధములగు జ్వరములబాధలను తొలగించును. శూలలను పోనణచును. పాండు వ్యాధుల హరించును. క్షయరోగముల తొలగజేయును. ప్లీహము మొదలగు వానిని అణచును. అర్శోవ్యాధులను నిర్మూలము జేయును. గ్రహణుల బడ గొట్టును. రోగముల నన్నిటినిపోగొట్టి శరీరమునకు వన్నె కలిగించును. మరియు జనులకు ఆయురారోగ్యభాగ్యంబుల నొసంగి లోకంబుల నాకర్షించు తామ్ర భస్మముయొక్క గుణము లిట్టివని వర్ణింప నలవికాదు.

## —॥ ఆయసము. ॥—

గీ॥ ఆయసము మూడువిధములై యవనిలోన
కలుగు తీక్ష్ణంబు ముండంబు కాంత మనగ ।
ముండమన నినుముతీక్ష్ణంబు మొనసి యుక్కు
కాంతమనునది ధర నయస్కాంత మండ్రు॥ ౩౦॥

వ్యా॥ ముండమనియు తీక్ష్ణమనియు కాంతమనియు నయస్సు మూడు విధములై యుండును, అందు "ఇనుము" అని వ్యవహరింపబడుచుండు లోహము ముండమనబడును. ఉక్కు తీక్ష్ణమనబడును. అయస్కాంతము (సూదంటు రాయి) కాంతమని చెప్పబడును.

---

1. (ఖ) (గ) యర్శలను. 2. (ఖ) (గ) మగునే.

ఇట్టీగ్రంథంబున నాయసము తీక్ష్ణాదిభేదములచే త్రివిధముగ విభజితమై యుండ తీక్ష్ణాయసశబ్దములు సమార్థకములను తలంపుననో యేమోకాని రసార్ణవకారుఁడు లోహపరిగణనమును చేయుచు ఆయసమును తీక్ష్ణశబ్దముచే నిర్దేశించి వివరణమున "రోహణం వాజిరం చైవ తృతీయం చ పటాలకమ్" రోహణము వాజిరము పటాలకము నని తీక్ష్ణమును మూడువిధములుగ విభజించెను. మరియు కాంతలోహము శక్తిరసంబులం జెర్చి యచ్చట వివరించెను. అచ్చటగాని యిచ్చటగాని కాంతతీక్ష్ణంబుల కెట్టిసంబంధమును చెప్పియుండ లేదు. ముండమును గురించిన ప్రశంసయగుపడ నేలేదు. ఇట్లే గ్రంథాంతరముల యందును "లోహోస్త్రీ శస్త్రకం తీక్ష్ణం పిండకాలాయ సాయసాయసీ"అని తీక్ష్ణంబు నయోవిభాగంబులయందుగాక పర్యాయంబులయందు పరిగణనము చేసి సారకాంతంబు లయోభేదంబులుగ చెప్పబడియున్నవి. అయినను నిఘంటుకారులచే పర్యాయంబులుగ గ్రహింపబడిన బుద్ధి, మనీషా. ధిషణా, ధీ ప్రజ్ఞాదులచే వాచ్యములగువాని తంత్రాంతరంబులయందు పరస్పరభేదముగ చెప్పుచుండుటయు; కల్పంబులయందు "అరిష్టమాసవంశోదం గుడం చేత్యభిధీయతే । తత్సాంద్రాచ్ఛత్వభేదేన లేహ్యం పేయమితి ద్విధా" యను నీ మొదలగు వాక్యములచే పర్యాయంబులుగ గ్రహింపబడియుండు ఆసవారిష్టగుడాదులకు "యదపక్వౌషధాంబుభ్యాం సిద్ధం మద్యం స ఆసవః" "అరిష్టః క్వాథసిద్ధస్స్యాత్" "లేహవత్సాధ్యతే వహ్నౌ గుడో వా శర్కరాథవా । గుగ్గులుర్వాత్ర క్షిప్తే త్త్రత్ర చూర్ణం తన్నిర్మితా వటీ॥" యను మొదలగు వానిచే పరస్పరభేదము చెప్పబడుచుండుటయు; ఇట్లే కాంజిక సౌవీర ఆరనాళాదులకు సమానార్థకత కొన్నిగ్రంథములయందు చెప్పబడియుండ గ్రంథాంతరములయందు వానికి పరస్పరభేద మగుపడుచుండుటయు గనబడుచుండుటచే తన్న్యాయంబున నీసంప్రదాయమునకు సంబంధించిన గ్రంథములయందును ఇట్టిభేదములు దూష్యములుగావు.

"అశుద్ధలోహం న హితం నిషేవణాదాయుర్బలం కాంతివినాశి నిశ్చితమ్ । హృద్విప్రపీడాం తనుతే హ్యపాటవం రుజం కరోత్యేవ విశుధ్య మార

యేత్॥" అను మొదలగు వాక్యములచే రసరత్నసముచ్చయాది గ్రంథముల యందు నేలోహములనైన శుద్ధిజేయక యుపయోగింపదగదని నిరూపించియున్నదిగాన తత్రాన్తరములనుండు లోహశుద్ధివిధానములుకొన్ని యిచ్చట చూపబడును. "పత్త్రలీకృతపత్రాణి లోహస్యాగ్నౌ ప్రతాపయేత్ । నిషించేత్తప్త తప్తాని తైలే తక్రేచ కాంజికే । గోమూత్రే చ కులుత్థానాం కషాయే చ త్రిధా త్రిధా । ఏవం లోహస్య పత్త్రాణాం విశుద్ధిం సంప్రయోజయేత్॥" లోహమును పల్చనియాకులవలె రేకులుగగొట్టి యారేకులను నిప్పులయందు కాల్చుచు నూనె, మజ్జిగ, కాంజికము, గోమూత్రము, ఉలవకషాయము, అను వీనియందు ప్రతిదానియందును ముమ్మారుచొప్పున ముంచుచుండవలయును. ఇట్లుచేసిన లోహము శుద్ధిబొందును.

"శశకృతజసంవిలిప్తం త్రివారం పుటతాపితం । ముండాదిసర్వలోహానాం శుద్ధిరాయాతి నిశ్చితమ్॥" లోహపురేకులకు కుందేటినెత్తురునుబూసి పుటమునబెట్టి కాల్చవలయును. లేక సంప్రదాయముల నెరింగి కొలిమిలో బెట్టియైనను కాల్చవలెను. ఇట్లు ముమ్మారుజేసిన యినుము మొదలగు లోహజాతులన్నియు శుద్ధిబొందును.

—॥ తీక్ష్ణముండలోహములభస్మములు ॥—

సీ॥ మునినాథ శుద్ధిజేసిన తీక్ష్ణలోహంబు
నాకురాతను చూర్ణ మమర జేసి ।
యినుపమూకుటిలోన నెఱ్ఱగా ముమ్మారు
నేతితో వేయించి నేర్పుతోడ ।
త్రిఫలకషాయాన త్రిపుటంబు లొగి వేసి
సమగంధకముతోడ నమర నూరి ।
ప్రమిదలలో నుంచి పటమృత్తికల బూసి
యారించి నాల్గుపుటాలు దీర్చి ।

చాగ నల్లేరు [1] వస యడ్డసరము గొబ్బి
తిప్పతీగయు [2]పులిచింత త్రిఫల గునుగు।
నల్లమాదిగగూర్చి లోహంబుపట్టి
పుటము[3]లిడినను నమృతమై పొసగుచుండు॥      ౩౧॥

గీ॥ తీక్ష్ణముండంబులకు నొక్కతీరు సుమ్ము
భస్మములు శుద్ధులును గుణప్రాభవములు।
గాన వైద్యులు శాస్త్రసంగతిగ గూర్చి
దివ్యతరముగ బుటములు దీర్చవలయు॥      ౩౨॥

వ్యా॥ * తీక్ష్ణ లోహంబును శాస్త్రములయందు చెప్పబడియుండు పద్ధతి ననుసరించి శుద్ధిజేసి పిదప నాకురాయిచే బాగుగ నరగదీయవలయును. అట్టి యుక్కు రజమును ఇనుపబాణలిలోనుంచి నేయిబోసి మూడుసారు లెఱ్ఱగ వేచవలయును. ఆమీద నీరజమున త్రిఫలముల కషాయమునుబోసినూరుచు మూడుపుటములు బెట్టివలయును. ఇట్లు సిద్ధముచేయబడిన లోహపురజమును సమానపరిమితిగల గంధకముతో కలిపి సంప్రదాయముల నెరింగి మెత్తగనూరి చిన్న బిళ్ళలుగజేసి ప్రమిదలయందునిచి పైనమూసి చీరమంటినిచ్చి బిగించి బాగుగ

1. (ఖ) పసు పడ్డసరము. 2. (గ) ములుచింత-(క) ములుపుచ్చ.
3. (ఖ) వేసిన మృతమునై.

* ప్రాచీనగ్రంథకారులు లోహమును ముండము తీక్ష్ణము కాన్తము అని మూడువిధములుగ నిరూపించిరి. అందు తీక్ష్ణము ముండము అనునవి భిన్నమైనను ముండము విశేషదోషభూయిష్ఠమగుటచేత తీక్ష్ణకాన్తములనే విశేషముగ గ్రహించెదరు. ముండము నుపయోగించు స్థలముల తీక్ష్ణము విశేషగుణదాయక మనుట చిరకాలమునందే తెలిసికొనియుండిగనుటకు పైరసాఙ్గవకారుని వాక్యమే సప్రమాణముగనున్నయది. నీగ్రంథకర్తయు ముండమునకన్న తీక్ష్ణమునకే

నెండించి పుటము బెట్టవలయును. ఇట్లు నాలుగు పుటముల బెట్టిన యనంతరమున నద్దానిని చాగ, నల్లేరు, వస, అడ్డసరము, గొబ్బి, తిప్పతీగ, పులిచింత, త్రిఫలములు, గునుగు, అల్లము మొదలగువాని ద్రవములతో జేర్చి నూరుచు అరువదిపుటములు బెట్టిన వారితరమైన పరిశుద్ధమగు భస్మమై యమృతస్వరూపమై వెలయుచుండును.

తీక్ష్ణలోహమునకు శోధనమారణములయం దేవిధానములు చెప్పబడియెనో ఆవిధానమునే ముండలోహమునకును నుపయోగింపవచ్చును. కావున వైద్యులు బుద్ధికౌశల్యము నుపయోగించి యనుభవముచే నాయావిధానముల నెరుంగవలయును.

ముండతీక్ష్ణలోహంబుల భేదంబులును విభాగములును లక్షణంబులును గ్రంథాంతరములయం దిట్లు చెప్పబడియున్నవి:—

—॥ ముండభేదములు. ॥—

౪ రసరత్నసముచ్చయము:—"మృదుః కుంఠః కడారంచ త్రివిధం ముండముచ్యతే । ద్రుతద్రావమవిస్ఫోటం చిక్కణం మృదు తచ్ఛుభమ్ । హతంయత్ప్రసరేద్దుఃఖాత్ తత్కుంఠం మధ్యమం స్మృతమ్ । యద్ధతం భజ్యతే భంగే కృష్ణం తత్స్యాత్కడారకమ్॥"

మృదువనియు, కుంఠమనియు, కడారమనియు ముండలోహము మూడు విధముల నుండును. కరగించిన కరగుస్వభావము కలిగినదియు స్ఫోటము (బొబ్బ) లు లేనిదియు చిక్కదనము కలిగినదియునగు లోహము మృదుముండమనబడును. ఇది ముండలోహములలో నుత్తమమైనది. సాగగొట్టిన కష్టముగ సాగు ముండము కుంఠమనబడును. ఇది మధ్యమము. సాగగొట్టిన ముక్క

---

ప్రాధాన్యమును జూపియున్నాడు. మరియు రెండు మూడు శతాబ్దములనుండియు ఇనుము నుపయోగించుతటి తీక్ష్ణమునే యుపయోగించుచున్నట్లు పెక్కు గ్రంథములనుండి డెలియుచున్నది. వెండియు నిక్కాలపు వైద్యసోదరులును లోహమన్న తీక్ష్ణమును వాడుటయే హెచ్చుగ గనబడుచున్నది.

లుగ విరుగుచుండునదియు విరిగిన నల్లనిరంగుకలిగి యుండునదియునగు యినుము కడారమనబడును. ఇది యధమము.

—॥ * తీక్ష్ణలోహభేదములు, వానిలక్షణములు. ॥—

§ రసరత్నసముచ్చయము:—“ ఖరం సారం చ హృన్నాలం తారాపట్టం చ వాజిరమ్ । కాలలోహాభిధానం చ షడ్విధం తీక్ష్ణముచ్యతే ” ఖరమనియు సారమనియు హృన్నాలమనియు తారవట్టమనియు వాజిరమనియు కాలలోహమనియు నుక్కు ఆరువిధములనుండును.

(1) ఖరము.

“ పరుషం పాండురోన్ముక్తం భంగే పారదవచ్ఛవి । నమనే భంగురం యత్తత్ ఖరలోహముదాహృతమ్॥ ” కఠినమై చారలులేక వంచిన విరుగునట్టి స్వభావముకలిగి విరిగినపుడు పాదరసమువంటి తెల్లనికాంతిగలిగి యుండునట్టి యుక్కు ఖరలోహమనబడును.

(2) సారము.

“ వేగభంగురధారం యత్ సారలోహం తదీరితమ్ । పాండురాభాసకం పాండుభూమికం సారమీరితమ్॥ ” వేగముగ విరుగునట్టి స్వభావముగ పదును కలిగినదియు చారలవలెనుండు తెల్లనిరచన కలిగినదియునగు నుక్కు సారమనబడును.

(3) హృన్నాళము.

“ కృష్ణపాండువపుశ్చం చ బీజతుల్యోరుపాండురః । ఛేదనే చాతిపరుషం హృన్నాళమితికథ్యతే॥ ” నలుపును తెలుపునుకలిసిన వర్ణముకలిగి ఆము

* ఇచ్చట తీక్ష్ణమున నారువిధముల జూపంబడినదిగాని దీనివిభాగమున “ తారావట్టము ” అను దానికి మూలగ్రంథముల లక్షణముమాత్రము గానరాదు.

దపు విత్తులయందువలె పెద్దచారలుకలిగి నరుకుటకు కఠినమైయుండునది హృన్నాలమనబడును.

(4) వాజిరము.

"పోగరై ర్వజ్రసంకాశైః సూక్ష్మరేఖైశ్చ సాంద్రకైః। నిచితం శ్యామలాంగం చ వాజిరం తత్ప్రకీర్త్యతే॥" వజ్రమువంటి కాంతిగల పెద్దరేఖలును వాని నడుమ దట్టముగ వ్యాపించియుండు సూక్ష్మములగు రేఖలునుకలిగి నీలముగనుండునది వాజిరమనబడును.

(5) కాలాయసము.

"నీలకృష్ణప్రభం సాంద్రం మసృణం గురు భాసురం। లోహఘాతేఽప్యభంగాత్మ ధారం కాలాయసం మతమ్॥" నీలవర్ణముగను కృష్ణవర్ణముగను నుండు మెరుపుకలిగినదియు చిక్కగను నునుపుగను బరువుగను ప్రకాశమానముగను నుండునదియు ఇనుముపైబెట్టి కొట్టినను మొక్కబోని వాడికలిగినదగను నుండులోహము కాలాయసమనబడును.

మరియు, తన్త్రాన్తరమున:—"కాంతాభావే తీక్ష్ణలోహం చ గ్రాహ్యం తల్లోహం వై సమృదుత్వం విధత్తే। ముండం త్యాజ్యం సర్వథా నైవ గ్రాహ్యం యస్మాన్ముండే భూరి దోషాః వదన్తి॥" కాంతలోహము సంభవించనియపుడు తీక్ష్ణలోహము (ఉక్కు)ను గ్రహింపవచ్చును. ఇనుమున అనేకదోషములుండునని పూర్వులు చెప్పియుండిరి కావున దాని నెప్పుడు నౌషధములయం దుపయోగింపరాదు. అనియు "కాసీసామలకల్కాక్తే లోహేఽంగం దృశ్యతే స్ఫుటం।తీక్ష్ణలోహం తదుద్దిష్టం మారణాయోత్తమం విదుః॥" అన్నభేదిని చింతపండు రసమున కలిపి దానిచే ఉక్కు పలకనుతోమి దానియందు చూచిన ముఖము స్ఫుటముగ ప్రతిఫలింపవలయును. అట్లయిన నదియుత్తమతీక్ష్ణమనియు భస్మమున కుచితమనియు నెరుంగవలయును. అనియు కాంతతీక్ష్ణముండంబుల నుత్తమాధమ వినిర్ణయమును ఉత్తమతీక్ష్ణ లక్షణంబును నాయుర్వేదప్రకాశమున గనంబడుచున్నది.

"క్వాథ్యమష్టగుణే తోయే త్రిఫలాషోడశం పలమ్ । తత్క్వాథే పాదశేషే తు లోహస్య పలపంచకమ్ । కృత్వా పత్రాణి తప్తాని సప్తవారం నిషేచయేత్ । ఏవం ప్రలీయతే ధాతు ర్గిరిజో లోహసంభవః॥" పదునారు పలముల త్రిఫలములను నెనిమిదిరెట్లు నీటియందువైచి నాలవభాగము మిగులునట్లు కషాయముగాచి ఆకషాయముచే నైదుపలముల పరిమాణముగల లోహముయొక్క రేకులను కాల్చుచు నేడుసారులు తడుపవలయును. ఇట్లు జేసిన లోహమునందుండు పర్వతసంబంధముచేనైన పలువిధదోషములు నశించును. ఇట్టి విధానములచే లోహమును శుద్ధిజేసి భస్మమున కుపయోగింపవలయును.

—॥ అయస్సిందూరము. ॥—

♦ (1) శుద్ధిజేసిన ఉక్కును రజనుజేసి ఆరజను నొకభాగమును శుద్ధగంధకము నర్ధభాగమును జేర్చి నిమ్మపులుసున చక్కగమర్దించి బిళ్ళలు చేసి యెండించి గజపుటము వేయునది. ఈరీతి పదితడవలు వేయునది. ప్రతితడవను పూర్వమువలె గంధకమును జేర్చుచు నిమ్మపులుసున నూరుచు పుటములు వేయవలెను. పిదప పైరీతిని గంధకమును జేర్చుచు వేపకాయల రసముచేనూరి పదితెడవలు పుటము వేయవలెను. స్వచ్ఛమగు సిందూరమగును.

(2) శుద్ధిజేసిన యుక్కురాపొడిని మామిడిచిగుళ్ళ రసముతోడను తెల్లజిల్లేడు పాలతోడను చక్కగనూరి ప్రత్యేకము పదేసిపుటములు వేయునది. పుటములు వేసినయనంతరము మరియొకతూరి తెల్లజిల్లేడుపాలతో నాబిళ్ళలను చక్కగనూరి బిళ్ళలుజేసి యెండించి యుంచవలెను. పచ్చిచిత్రమూలపువేళ్ళ పైపొప్పరను మేకపాలతో చక్కగనూరి యుంచుకొనవలెను. పై బిళ్ళల నొక మూకుటిలోనుంచి యాబిళ్లకు క్రిందను పైనను మేకపాలతోనూరిన చిత్రమూల కల్కమునుంచి పైన మూకుడుమూసి చీకజేసి యెండించి గజపుటము వేయవలయును. ఇనుము చక్కగ తేలికయగు సిందూరమగును.

(3) శుద్ధిజేసిన యుక్కురాపొడి సౌవీరము గంధకము ఈమూటిని సమభాగములుగ గ్రైకొని ఖల్వమందుంచి నిమ్మపులుసున క్రమముగ కాటుకవలె

పదునైదుదినములు మర్దించి బిళ్ళలుజేసి యెండించి శరావసంపుటంబుననుంచి చీరజేసియార్చి గజపుటమును వేయవలెను. ఈరీతి పదితడవలు సౌవీరమును గంధకమును జేర్చుచు నిమ్మపులుసున మర్దించుచు పదునైదు పుటములు వేసిన నుత్తమమగు సిందూరమగును.

(4) రెండుపలముల ఇనుపరజమును కూతురుబుడమ ఆకురసముతో విడువక పదిదినములు చక్కగనూరి బిళ్ళజేసియెండించి శరావసంపుటంబులనిడి చీరజేసియార్చి నూరుపిడకలతో పుటము వేయవలెను. ఇట్లు పైరసముననూరుచు పదునైదు పుటములు వేయవలెను. ఈసిందూరమును రెండుగురిగింజల పరిమితి గల రెండుమోతాదు లుపయోగించిన అయస్సిందూరమునకు జెప్పిన గుణముల గల్గించుటయేగాక తత్క్షణమునసే యకృచ్ఛ్రాల పరిణామశూల మొదలగు శూలలు నివర్తించును.

(5) శుద్ధిజేసిన రెండుపలముల యినుపరజమును ఖల్వమందుంచి నేరేడుపండ్ల గుజ్జువేసి విడువక మర్దించి బిళ్ళలుజేసి యెండించి శరావసంపుటమునను౦చి చీరజేసి యార్చి నూరుపిడకలతో పుటము వేయునది. ఈరీతి నేరేడుపండ్లగుజ్జుతో నూరుచు పదునైదుపుటములు వేయవలెను. ఉత్తమమగు సిందూరమగును. నేరేడుపండ్లగుజ్జు దొరకని సమయముల నేరేడుచెక్క కషాయముతోనూరి పదునైదుపుటములు వేసినను చక్కని సిందూరమగును.

(6) శుద్ధిజేసిన రెండుపలముల ఉక్కు రజమునకు సమముగ నింగిలీకమును జేర్చి ముషిణిచెక్క కషాయముతోనైనను ముషిణిపండ్లగుజ్జుతోనైనను నూరి పుటము వేయునది. ఈరీతి ప్రతితడవయు నింగిలీకమును జేర్చుచు ముషిణి పండ్లగుజ్జుతోనైనను లేక చెక్కకషాయముతోనైనను నూరుచు పదిపుటములు సంప్రదాయములనెరింగి వేసినచో సిందూరమగును.

పై సిందూరము ననుపానభేదంబులచే నర్ధయవపరిమితి మొదలు రెండుయవల పరిమితివరకు నుపయోగింపవచ్చును. మరియు ప్రత్యేకముగ నౌషధయోగములను వినియోగింపందగును. ఇయ్యది పాండు కామల మహోదరము పక్కశూల మొదలగువ్యాధులను తొలగించును. రక్తమును వృద్ధిజేయును.

— ముండతీక్ష్ణంబుల భస్మోపయోగము. —

మ త్త॥ లోహభస్మము సేవజేసిన లోకమం దమృతాఖ్యమై ।
ప్లీహ పాండు మహోదరంబులు పిత్తవాతకఫార్తులున్ ।
మేహకుష్ఠ[1]గుదార్శ[2]శోఫలు మేహముల్ జ్వరకాస లా ।
నాహముల్ తెగటార్చి యిచ్చు చిరాయు రున్నతసంపదల్ ॥

వ్యా॥ ముండ తీక్ష్ణలోహంబులను శుద్ధియొనర్చి భస్మముజేసి సేవించిన నయ్యది యమృతస్వరూపమై ప్లీహములు, పాండువ్యాధులు, మహోదరములు, అర్శస్సులు, శూలలు, వాతపిత్తకఫముల వ్యాధులు, మేహకుష్ఠవ్యాధులు, గుదాంకురములు, నంజులు, మేహవ్యాధులు, జ్వరములు, కాసములు మొదలగువానినన్నిటిని నివర్తింపజేయును. ఆయురారోగ్యము నొడగూర్చును.

— తీక్ష్ణలోహద్రుతి. —

(1) శ్రీ రసరత్నసముచ్చయము:—“ త్రిస్సప్తకృత్వో గోమూత్రే జాలినీభస్మభావితమ్ । శోషయేత్తస్య వాపేన తీక్ష్ణం మూషాగతం ద్రవేత్ ”

దావరడంగిని భస్మముజేసి యాభస్మమును గోమూత్రమున నిరువది యొకమాటు భావనజేసి యెండించి యాక్షారము నుంచుకొనునది. పిమ్మట తీక్ష్ణలోహమును మూసలోనునిచి కొలిమిలోబెట్టి యూదుచు కరగునప్పుడు పైజెప్పిన క్షారమును ప్రతివాపము జేసినచో నీళ్లవలెకరగి చిరకాలము ద్రవరూపముగ నుండును.

— కాంతలోహము దానిపరీక్ష. —

సీ॥ వినుము కాంతము నాల్గువిధములౌ లోమక
భ్రామకచుంబకద్రావము లన ।

1. (క) గదా. 2. (ఖ) (గ) శూలలు.

నొక్కటొక్కటికన్న నెక్కువై విలసిల్లు
[1]గుణముల కాంతంపుగుణము వినుము ।
[2]కాంతపుగిన్నెలో నుదకంబు నుంచిన
తిలతైలముంచిన తీరు నుండు ।
హింగు విడినను గంధహీన[3]మై యుండును
వేపచేదిడ చేదు విడిచియుండు ।
పొసగ నాగిన్నెలో పాలు బోసి వండ
పొడవుగా బెరిగిభూమిపై బడకయున్న ।
గరికనునిచిన నల్లనై కానబడిన
[4]కాంతలోహంబటంచ్రు బుధాగ్రగణ్య॥ ౩౪॥

వ్యా॥ లోమకమనియు భ్రామకమనియు చుంబకమనియు ద్రావకమనియు కాంతము నాలుగువిధముల నుండును. "తేషు శ్రేష్ఠం పరాత్పరమ్" అనుదాని ననుసరించి వీనిలో వెనుకటిదానికన్న నుత్తర ముత్తమమైనది యని ఖ్యాతిగాంచిన అయస్కాంతమునుండి సత్వమును గ్రహించి యాకాంతలోహ సత్వముచే గిన్నెను చేయించి అందు నీటినిబోసిన నయ్యది నూనియవలె నుండును. ఇంగువనుంచిన దాని వాసనయంతయు నశించును. వేపాకునూరి యాముద్దను నాగిన్నెలో నుంచిన దాని చేదురుచి పోవును. కాంతపుగిన్నె యందు పాలుబోసి కాచిన నాపాలు శిఖరమువలె పొడవుగలేచి పొంగు చుండు నేకాని క్రిందబడదు. మరియు నాగిన్నెయందు గరికపోచలనుంచిన నవి నల్లగ నగుపడును. ఇట్టి లక్షణము లుత్తమకాంతముయొక్క గుణములుగ నుండును. అట్లు కానిది ఉత్తమముకాదు.

1. (క) గణుతింప. 2. (ఖ) (గ) కాంతంపుగిన్నె నుదకములుంచి తిలతైలమిడిన నందంటక నెనసియుండు. 3. (క) మునైయుండు వేపాకు రసముచే విడచియుండు. 4. (క) (గ) నన్య.

ఈపద్యములోని సీసముయొక్క మూడవపాదమునందుండు పాఠము నకు బదులుగ "కాంతంపుగిన్నె నుదకములుంచి తిలతైలమిడిన లిప్తముగాక నెరసియుండు" నని మరియొకపాఠ మగుపడుచున్నది. "పాత్రేయస్యప్రస రతిజలే తైలబిందుర్నలిప్తః" అను సంస్కృతగ్రంథముల ననుసరించుచుండు టచే నిదియ యుత్తమపాఠమని తోచుచున్నది. ఈకాంతలోహముగూడ అభ్రకవజ్రవైక్రాంతముల తోపాటుగ శక్తిరసములలోచేర్చి "మదోన్మత్త గజస్నాతఃకాంత మంకుశముచ్యతే" యని రసబంధకములలో నుత్తమముగ చేర్కొనబడియున్నది.

మరియు రసరత్నసముచ్చయాది గ్రంథాంతరములయందు "భ్రామకం చుంబకంచైవ కర్షకం ద్రావకం తథా । ఏవం చతుర్విధం కాంతం రోమ కాంతం చ పంచమమ్॥" అని భ్రామక చుంబక కర్షక ద్రావక భేదములచే కాం తము నాలుగువిధములనియు రోమకాంతమను మరియొక జాతికాంతముకూడ కలదనియు నిరూపించుచు కాంతము నైదువిధముల విభజించి తద్విభాగవిస్తర మంతయు నిట్లభివర్ణింపబడియున్నది.

—( కాంతభేదములలో తారతమ్యము. )—

"భ్రామకం తు కనిష్ఠం స్యాచ్చుంబకం మధ్యమం తథా । ఉత్తమం కర్షకం చైవ ద్రావకం చోత్తమోత్తమమ్॥" భ్రామకజాతికిచేరిన కాంతము కనిష్ఠము. చుంబకము మధ్యమము, కర్షక ముత్తమము, ద్రావక మన్నిటికన్న నుత్తమోత్తమము.

—( భ్రామకాది లక్షణములు. )—

"భ్రామయేల్లోహజాతం తు తత్కాంతం భ్రామకం మతమ్ । చుంబ యేచ్చుంబకం కాంతం కర్షయేత్కర్షకం తథా । సాక్షాద్యద్ద్రావయేల్లోహం తత్కాంతం ద్రావకం మతమ్ । తద్రోమకాంతం స్ఫుటితాద్యతో రోమో ద్గమో భవేత్॥"

కాంతలోహము చెంత నిమునుంచిన నాయినుమును తిరుగునట్లు చేయునది భ్రామకకాంతమనబడును. ఇనుమునకు తగిలించిన దానినంటి పట్టు

కొనునది చుంబకకాంత మనబడును. ఇనుము నాకర్షించునది కర్షకకాంతమన బడును. ఇనుము నొకచోటనుంచి అయస్కాంతమును జూపిన నాయినుము పరువెత్తివచ్చునేని అట్టిది ద్రావకమనబడును. కాంతమును పగులగొట్టిన నందు వెండ్రుకలవంటి తీగలుండినచో నయ్యది రోమకకాంతమనబడును.

## —॥ భ్రామకాదుల వినియోగము. ॥—

“భ్రామకం చుంబకం చైవ వ్యాధినాశే ప్రశస్యతే । రసే రసాయనే చైవ కర్షకం ద్రావకం హితమ్॥” ఈ నైదు విధములగు కాంతలోహము లలో భ్రామక చుంబక జాతులకు చేరినవి వ్యాధులను నశింపజేయు నౌషధ యోగములయందు చేర్చ నుత్తమమైనవి. కర్షకము రసబంధనాది ప్రక్రియల యందుపయుక్తము. ద్రావకము రసాయనముల కర్హమైనది.

## —॥ కాన్తముఖములు వానియోగ్యత. ॥—

* “ఏకద్విత్రిచతుష్పంచ సర్వతోముఖ మేవ తత్ । కనిష్ఠం స్యాదేక ముఖం మధ్యం ద్విత్రిముఖం భవేత్ । చతుష్పంచముఖం శ్రేష్ఠ ముత్తమం సర్వతోముఖమ్॥” ఈ కాంతలోహము లోహములయొక్క ఆకర్షణాదుల జేయు పార్శ్వముల సంఖ్యనుబట్టి ఏకముఖము ద్విముఖము త్రిముఖము చతుర్ముఖము పంచముఖము సర్వతోముఖమునని యారువిధములనుండును. అందేక ముఖము అధమము. ద్విముఖ త్రిముఖములు మధ్యమములు. చతుర్ముఖ పంచము ఖములు శ్రేష్ఠములు. సర్వతోముఖ మన్నిటికంటె నుత్తమమైనది.

“కాన్తము” (మనోహరము) అను నామమాత్రముననే పైజెప్పఁబడిన ముండ, తీక్ష్ణ, కాన్తములలో కాన్తము శ్రేష్ఠమైనదిగ పరిగణింపంబడి నది, అందును సర్వతోముఖము అనగా కాన్తపురాతియందంతటను నితర లోహాదిభాగములు లేక కాన్తలోహభాగ మాత్రముండుట యుత్తమతమమని భావము.

---

* ఇచ్చట జెప్పఁబడిన కాంతలోహ సామాన్యము మైసూరు రాజ్యమందలి బాబాబుడన్ గిరియందు విశేషముగ లభ్యము.

—॥ కొన్తలోహ ప్రాశస్త్యము. ॥—

మరియు "కిట్టాద్దశగుణమ్ముండం ముండాత్తీక్ష్ణం శతోన్మితమ్ । తీక్ష్ణాల్లక్షగుణం కాంతం భక్షణాత్కురతే నృణామ్ । తస్మాత్కాంతం సదా సేవ్యం జరామృత్యుహరం నృణామ్" అని అయోజాతు లన్నిటియందును కాంత ముత్తమమనియు దానినే ఔషధములయం దుపయోగించుకొనవలయుననియు కాంతమున కాధిక్యము చెప్పబడియున్నది.

ఇయ్యది సౌమ్యముగను సుకుమారజనసామాన్యములకు నుపయోగింపదగిన నైజశక్తిగలదగుటచేతను లోహసామాన్యమునకు కాంతమై (మనోహరమై) వైద్యశాస్త్రమున నతికెక్కియున్నయది.

—॥ కాంతశోధన మారణములు, దానియుపయోగము. ॥—

సీ॥ కాంతంబు తైలతక్రాది ద్రవములచే
    శోధించి కుందేటి శోణితమున ।
తడుపుచు ముమ్మారు వడి నగ్నిలో గాచి
    త్రిఫలరసాన నాతీరు జేసి ।
పుటపుటంబునకు నేర్పున నింగిలీకంబు
    నిరువదో భాగంబు నెరయ గూర్చి ।
కాంతంబుతోడను కలిబోసి మర్దించి
    స్ఫుటముగా ముప్పది పుటము లేసి ।
కాంతభస్మము ననుపాన గరిమతోడ
సేవజేసిన జ్వరమృత్యు జీర్ణకరము ।
నఖిలరుజముల బాపి దీర్ఘాయు వొసగు
కాంతభస్మంబునకు సాటి గలదె భువిని॥     3౫॥

వ్యా॥ * ఉత్తమమగు కాంతలోహమును తైలము తక్రము మొదలగు ద్రవములయందు పైజెప్పబడిన తీరునజేసి శుద్ధిజేసి అనంతరము నాకాంతపు రేకులకు కుందేలుయొక్క రక్తమునుపూయుచు మూడుపుటములును త్రిఫలముల కషాయమును బూయుచు మూడు పుటములును పెట్టవలయును. అనంతరమున గ్రహింపబడిన కాంతలోహంబున కిరువదియవభాగము ఇంగిలీకము నాకాంత ముతో గలిపి కాంజికమునుబోసి నూరి పుటముబెట్టవలయును. ఇట్లుచేయుచు ముప్పదిపుటములుబెట్టిన కాంతము భస్మమగును. ఇట్లు సిద్ధమైన కాంతపుభస్మమును తగుననుపానముతో గూర్చి సేవించిన సకలవిధములగు జ్వరములను అకాలమృత్యువును పోగొట్టును. పాండువు మున్నగు సమస్తవ్యాధులను నిర్మూలము చేయును. దీర్ఘాయుష్యమునిచ్చును. కావున కాంతభస్మముతో తుల్యమగునది వేరొకటి కానరాదు.

మరియు "సమ్యగౌషధకల్పానాం లోహకల్పః ప్రశస్యతే । తస్మాత్సర్వప్రయత్నేన లోహమాదౌ విమారయేత్ । నాతఃపచేత్పంచపలా దర్వాగూర్ధ్వం త్రయోదశాత్" ఉత్తమములగు నౌషధకల్పము లన్నిటియందును లోహకల్పముత్తమమైనది. కావున సర్వప్రయత్నంబులనుజేసి లోహమును శోధనమును భస్మమును సత్వపాతనమును ద్రుతియను కల్పములు (పరిణామములు) చేయవలయును. భస్మము మొదలగువానిని చేయుటకై గ్రహింపబడు లోహము అయిదుపలములకు తక్కువగను పదుమూడుపలముల కెక్కువగను నుండరాదు అని సంస్కార్యమగు లోహపరిమాణంబును;

"తావల్లోహం పుటేద్వైద్యో యావచ్చూర్ణీకృతో జలే । నిస్తరంగో లఘుస్తోయే సముత్తరతి హంసవత్" సిద్ధమైన లోహభస్మమును నీటియందువైచిన అందు అలలుగాని బుడగలుగాని కలుగక హంసవలె పైనతేలియుండవలయును. అట్లగునంతవరకు పుటముల బెట్టుచుండవలయునని లోహభస్మసామాన్య పరీక్షణంబును;

---

* కాన్తలోహమును భస్మమును జేయు ప్రక్రియలలో నిట్టి ప్రక్రియ నాకు దెలిసినకొలది లేదని తలచెదను.

* "గుంజామేకాం సమారభ్య యావత్స్యుర్నవరక్తికాః। తావల్లోహం సమశ్నీయాద్యథాదోషానలం నరః॥" దోషమును బట్టియు జీర్ణశక్తిననుసరించియు ఒకగురిగింజ యెత్తుమొదలు తొమ్మిదిరక్తిక (గురిగింజ) ల పరిమితివరకు లోహభస్మమును సేవించవచ్చును. అని లోహభస్మపరిమాణంబును మొదలుగా గలిగిన లోహభస్మమునకు సంబంధించిన విశేషములనేకము లచ్చటచ్చట గ్రంథములయందు కనుబడుచున్నవి.

—{ కాంతద్రుతి. }—

§ రసార్ణవము:—"యవక్షారస్తుసఙ్గృహ్య స్నిగ్ధభాణ్డే నిధాపయేత్। మరిచాభ్రకచూర్ణేన పిణ్డీబద్ధస్తుకారయేత్। కాన్తలోహం ద్రవేద్ధ్మాతం నాత్రకార్యావిచారణా॥" సంప్రదాయము ననుసరించి విధివిహితముగురీతిని యవక్షారమును సిద్ధముచేసి దానిని నూనెతో మాగిన కుండయందుంచవలయును. పిమ్మట మిరియములను అభ్రకభస్మమును కలిపినూరి యాముద్దను శుద్ధిజేసిన కాన్తలోహమునకు బాగుగ పట్టించవలయును. ఇట్లు పట్టించబడిన కాంతలోహపుటుండను కుండలోని యవక్షారముపైనుంచి కుండకుచీలనిచ్చి యెండించి యాకుండను కొలిమిలో నూదిన నిస్సంశయముగ కాంతము ద్రవించును.

వైద్యచిన్తామణి:—"సృగాలమేషకూర్మాది శల్యానిచశిలాజతు। ఏతత్సర్వంచూర్ణయిత్వా సుతప్తేకాంతచూర్ణకే। భావయేద్ద్రవతాంయాతి యథాసూతంసునిర్మలమ్॥" నక్క, మేక, తాబేలు మొదలగువాని యెముకలను సంపాదించి వానితో శిలాజతువును చేర్చి వీనినన్నిటిని మెత్తగ చూర్ణముచేయవలయును. ఆచూర్ణమున బాగుగ కాల్పబడిన కాంతలోహపు చూర్ణమును కలిపి మూసయందుంచి మూసి చీలజేసి యెండించి కొలిమిలోనూదిన కాంతము ద్రవించును.

---

* ఇచ్చట కాన్తలోహముయొక్క పరమావధిగజూపు పరిమితిమాత్రము నిక్కాలపువారి విషయమున యోచనీయము. కొందరు నాలుగు గుంజల పరిమితి నుపయోగించుట విదితము. ఈ పరిమితియే యొకానొకప్పుడు విపరీతమును గలిగించును.

—॥ తగరము, దానిశుద్ధి, భస్మము. ॥—

సీ॥ ఖురమిశ్రకములన నిరవొందు తగరంబు
ఘనము ఖురము మిశ్రకంబు కంటె।
పసుపున వావిలిరసమున ముమ్మారు
కరగి పోసిన శుద్ధి బరగుచుండు।
తగరము నగ్నిమీదట పెంకులోనుంచి
క్షారంబులను సురాకారమునను।
వండుచు మోదుగబండచే రాచిన
పసచెడి తగరంబు భస్మ మగును।
తాళకంబును జిల్లేడుపాలుతగర
మునకుపైపూతలిడి మూడుపుటము లేసి।
బుద్ధికొలదిని మరికొన్ని పుటము లేయ
వారితరముగ భస్మమౌ స్వచ్ఛముగను॥ ౩౬॥

వ్యా॥ ఖురమనియు మిశ్రకమనియు తగరము రెండువిధములై యుం డును. అందు ఖురము మిశ్రకమునకంటె నుత్తమమైనది. వావిలాకురసమున పసుపునుకలిపి కరగిన తగరమునందు మూడుసారులుబోసిన ఖురవంగము శుద్ధి బొందును. ఇట్లు శుద్ధిచేయబడిన తగరమును బాణలియందుంచి పొయిమీద బెట్టి అందు క్షారములును సురాకారమును వేసి వండుచు మోదుగ కొయ్యతుండు నొకదానిని తీసికొని రాచుచుండవలయును. ఇట్లుచేసిన తగరమునకు శక్తియుడిగి మృతిబొందును. అనంతరము శుద్ధిజేసిన తాళకమును జిల్లేడుపాల యందు నూరి తగరంబునకుబూసి పుటముబెట్టవలయును. ఇట్లు మూడుపుటము లిడిన పరిశుద్ధమగు భస్మమగును.

మరియు "ధవళం మృదులం స్నిగ్ధం ద్రుతద్రావం సగౌరవమ్। నిశ్శబ్దం ఖురవంగం స్యాత్ మిశ్రకం శ్యామశుభ్రకమ్॥" తెల్లగను మెత్తగను నునుపుగను సులభముగ కరగునదిగను బరువుగను మ్రోతలేనిదిగను నుండునది ఖురవంగము. నలుపు కలిసి తెలుపురంగు కలిగినది మిశ్రకము. అని వానిలక్షణములను "అమ్లతక్రవినిక్షిప్తం వర్గాభూవిమతిం,సుభిః । కట్వాలాబుగతం వంగం ద్వితీయం పరిశుధ్యతి" మిశ్రకతగరమును కరగి పులిమజ్జిగయందును గలిజేర విషముష్టి చేదుసార వీనియొక్క రసములయందును బోసిన శుద్ధిబొందునని మిశ్రతగరముయొక్క శుద్ధివిధానంబును తన్త్రాన్తరముల జెప్పబడినవి.

## —॥ వంగభస్మము. ॥—

♦ (1) శుద్ధిజేసిన వంగమును మిక్కిలి పల్చని రేకులుగ జేసి చింతాకులవలె కత్తిరించేది. ఇట్టి వంగమునకు రెండురెట్లు పసుపుచూర్ణమును సిద్ధముజేయునది. నాలుగువేళ్ళ వెడల్పున తెల్లనిగుడ్డను పేలికలుగాజేసి దిగువపరచి దానిమీద పసుపుపొడినిచల్లి దానిమీద వంగపురేకులను పలుచగాచల్లి పైన పసుపుపొడినికప్పి గుడ్డను రెండుప్రక్కలనుండియుకప్పి యుండగాచుట్టవలెను. ఇటులనే గుడ్డమీద పసుపుతో రేకులు జేర్చి లోగుడ్డను పెద్దయుండగా చుట్టి దానిపైన నొక క్రొత్తగోతముగుడ్డను బాగాబిగియించి దారముతో కట్టవలెను. ఆయుండను మంచినోరువెడల్పుగల దాకయందుంచి పైగోతమునకు నలుప్రక్కలను నిప్పును అంటించవలెను. సాంగశీతలానంతరమున నాకాలినయుండను జాగ్రతగాదీసిన నందుండు వంగపురేకులు పేలాలవలె తెల్లగపొంగియుండును. వానినన్నిటిని గ్రహించి ఖల్వములోవేసి చక్కగనూరి వస్త్రగాలితము జేయునది. భస్మముగాక మిగిలినవానిని వేరుపరచి మునుపటివలె పసుపుతోజేర్చి యుండచుట్టి భస్మముజేయునది. ఇట్లు సిద్ధమైనభస్మమును కలబందరసముతో నూరి పిడకలతో పదిపుటములు వేయవలెను. స్వచ్ఛమగు భస్మమగును.

(2) శుద్ధిజేసిన తగరమును పల్చని రేకులుగా గొట్టి యారేకులను పచ్చితంగేడు ఆకులను ముద్దగానూరి యాముద్దనడుమనుంచి పైనచీరజేసి యెం

డించి గజపుటము వేయునది. భస్మమగును. స్వాంగశీతలానంతరము నావంగ భస్మమును గ్రహించి కలబందరసమున చక్కగనూరి పదిపుటములు వేయవలెను. అమృతతుల్యమగు భస్మమగును.

(౩) శుద్ధిజేసిన వంగమును ఇనుపమూకుటిలోనుంచి పొయ్యిమీద బెట్టి సామాన్యమగు అగ్నిలోకరిగించేది, కరిగిన వంగమందు కొంచెము కొంచెముగా మంచిసూరేకారమును వేయుచు గరిటెతో నిమ్మదిగా త్రిప్పుచుండవలెను. ఈరీతిగా వంగము భస్మమగువరకును సూరేకారమును వేయుచు త్రిప్పుచుండవలెను భస్మమగును. పిదప నా భస్మమునుదీసి యొక మంచి చట్టిలోవేసి నీళ్ళుబాగాబోసి యొకరాత్రియంతయునుంచి మరునాడు నీళ్ళను నిమ్మదిగ పారబోయునది. అనంతరము ఆభస్మము నెండబెట్టవలెను. అట్టి భస్మమునకు సమము శుద్ధిజేసిన తాళకమునుజేర్చి నిమ్మకాయపులుసున చక్కగమర్దించి బిళ్ళలుజేసియెండబెట్టి శరావసంపుటంబుననుంచి చీరజేసియెండించి గజపుటము వేయవలెను. యిట్లు పైరీతిని ప్రతిపుటమునకును నాలవభాగము తాళకమునుజేర్చి నిమ్మకాయరసమున నూరుచు పదిపుటములు వేయునది. చక్కగ సిందూరించును. ఇయ్యది మేహరోగములకేకాక క్షయము శ్వాసకాసలు మొదలగు శ్వాసాశయకఫవ్యాధులకును కూడ నుపయోగింపనగును.

పై జెప్పబడిన వంగభస్మమును అనుపాన భేదములచే నుపయోగించిన వ్రణములను, మూత్రకృఛ్రిములను, మేహవ్రణములను, ప్రమేహవ్యాధులను, శుక్లనష్టమును, రక్తపిత్తమును, మూలరోగమును నివర్తిజేయును. దీనిపరిమితి యొకయవ మొదలు ఎనిమిదియవలవరకు నుపయోగించవచ్చును. మరియు ప్రత్యేకముగ నౌషధయోగంబులను జేర్పందగును.

—( వంగభస్మోపయోగము. )—

గీ॥ వంగభస్మము సేవించువారలకును
రాక్షసులనెల్ల విష్ణుచక్రంబు బోలి ।

మూత్రకృఛ్రింబులను బహుమూత్రములను
సర్వమేహవ్రణంబుల సంహరించు॥ ౩౭॥

వ్యా॥ పరిశుద్ధమగు వంగభస్మమును తగుననుపానముతో సేవించు వారలకు రాక్షసులను విష్ణుదేవుని చక్రము సంహరించునట్లు మూత్రకృఛ్రములు అతిమూత్రములు సకలవిధములగు మేహవ్యాధులు వానివ్రణములు వీనినెల్ల నశింపజేసి సౌఖ్యము నిచ్చును.

—《 సీసము, దానిభస్మము. 》—

సీ॥ కరగి సీసము మూడువరుసలు వావిలి
రసమున ముంచిన బొసగు శుద్ధి।
చింతభస్మము వేసి సీస మాయసకృత
పాత్రలో వేయించ భస్మ మగును।
సీసభస్మము మణిశిల సమంబుగ నూర్చి
నిమ్మపులుసున నూరి నెమ్మితోడ।
ప్రమిదలలో బెట్టి పదిలంబుగా నగ్ని
పుటమేసి తీసి నేర్పునను మరియు।
పరగ మణిశిల నిరువదోపాలు గూర్చి
పొసగ నూరుచు నరువది పుటము లేయ।
శుభ్రమై వారితరమునై శుభ మొసంగు
నాగభస్మంబు దీని విన్నాణముగను॥ ౩౮॥

వ్యా॥ ఉత్తమమగు సీసమును కరగించి మూడుసార్లు వావిలాకురసము నందుపోసిన శుద్ధిబొందును. అట్లు శుద్ధిచేయబడిన సీసమును ఇనుపబాణలి

యందుంచి చింతబెరడుబూడిదనుబోసి వేచిన భస్మమగును. అనంతరమాసీసమును సమానపరిమితిగల మణిశిలతోఁగూర్చి నిమ్మపండ్లరసమునుబోసి నూరి చిన్నబిళ్ళలుగజేసి మూకుళ్ళయందుంచి జాగ్రతగ నిప్పులయందుంచి పుటము బెట్టవలయును. అనంతర మద్దానిని జాగ్రతగనెత్తి దానిపరిమితి కిరువదవభాగము పరిమాణముగల మణిశిలనుచేర్చి నిమ్మపండ్లరసముబోసి నూరి పుటము బెట్టవలయును. ఇట్లు అరువది పుటములుబెట్టిన వారితరమైన పరిశుద్ధమగు భస్మమగును.

## —॥ శుద్ధసీస లక్షణము. ॥—

మరియు "ద్రుతద్రావం మహాభారం ఛేదేకృష్ణసముజ్జ్వలమ్।పూతిగంధం బహిఃకృష్ణం శుద్ధంసీసమతోఽన్యథా" సులభముగ కరగునదియు మిగుల బరువుగ నుండునదియు నరికిన నలుపుమెరుగు కలుగునదియు దుర్గంధముకలిగినదియు పైకి నల్లగనుండునదియునగు సీసము శుద్ధమైనదిగను అట్లుకానిది అపరిశుద్ధముఅని శుద్ధసీసలక్షణము గ్రన్థాన్తరమున జెప్పబడినది.

## —॥ సీసభస్మము. ॥—

♦ (1) శుద్ధిజేసిన సీసమును పలుచని రేకులుగాగొట్టి యా రేకులకు రెండురెట్లు పీతల (ఎండ్రకాయ) యొక్క పెంకులను నిమ్మకాయరసముతో మెత్తగా కాటుకవలెనూరి పై సీసపురేకుకు పట్టించి యెండబెట్టి శరావసంపుటంబుననుంచి చీరజేసి యెండబెట్టి గజపుటము వేయవలెను. చల్లారినపిదప భస్మమైనసీసపురేకును గ్రహించి ఖల్వములోనుంచి భస్మమున కర్ధభాగము పై పెంకులనుజేర్చి తిరుగ నిమ్మపులుసుతోనూరి బిళ్ళలుజేసి యెండించి పూర్వమువలె పుటము వేయునది. ఈరీతి పదిపుటములువేసిన నుత్తమమగు భస్మమగును.

(2) శుద్ధిజేసిన రెండుపలముల సీసమును ఖల్వములోనుంచి ఉప్పిళి యాకు దుష్టపాకు రసములతో ప్రత్యేకము ఏడురోజులునూరి బిళ్ళలుజేసి ముప్పది పిడకలతో పుటమువేయునది. పిదప అడ్డసరపాకు మూర్గ్రండాకు (కుప్పింటాకు)రసముల ప్రత్యేకము ఏడేడురోజులు చక్కగమర్దించిబిళ్ళలుజేసి

యెండించి పూర్వమువలెనే పుటములు వేయవలెను. పిదప నాసీసభస్మమునకు సమముగు గంధకమును జేర్చి తెల్లజిల్లేడుపాలతో చక్కగనూరి బిళ్లలుజేసి యెండించి యిరువదిపిడకలతో పుటము వేయవలెను. చక్కనిభస్మమగును.

(3) శుద్ధిజేసిన సీసమును ఇనుపమూకుటిలోనుంచి పొయిమీదబెట్టి కరగవలెను. సీసము కరిగినమీద అందు ముళ్లతోటకూరను సన్నగానరికి కొంచెముకొంచెముగా వేయుచు గరిటెతోకలుపుచు రాయుచుండవలెను. యీరీతి సీసము భస్మమగువరకు ముళ్ళతోటకూర వేయుచు ఇనుపగరిటెతో త్రిప్పుచుండవలెను. సీసము పసుపురంగువలె భస్మమునుదాల్చును. అపుడు నిలిపి దానిని కలబందరసముతోనూరి ప్రత్యేకముగ పది పుటములు వేయవలెను. చక్కని భస్మమగును. దీనిని వంగభస్మమువలెనే పరిమితిని ననుపానంబులను గల్పించి యుపయోగింపందగును.

—( సీసభస్మముయొక్క ఉపయోగము. )—

చ॥ నయముగ నాగభస్మము దినంబును సేవయొనర్చిన న్మహా।
క్షయములు సర్వశూలలును కామిల పాండుప్రమేహాకృ
చ్ఛ్రిముల్ । రయమున పారదోలుచు జరామరణంబుల
సంహరించి ని । ర్భయముగ జేయు మానవులపావన సీస
ముసాటి గల్గునే॥ 3౯॥

వ్యా॥ పరిశుద్ధమగు నాగభస్మమును సరియగు ననుపానముతోచేర్చి ప్రతిదినమును సేవించువారలకు గొప్పక్షయవ్యాధులును సర్వవిధములగు శూలలును కామిలావ్యాధులును పాండురోగములును ప్రమేహములును మూత్రకృచ్ఛ్రిములును వెంటనేనశించి అకాలపు ముసలితనమును మృత్యువును తొలగించి రోగభయమేమియు లేకుండ జేయును.

—( సీసాదిలోహసిందూరీకరణము. )—

క॥ నేరేడు మఱ్ఱి మోదుగ
బూరుగురసములను లోహములు సీసాదుల్ ।
[1]నూరి పుటాలేసిన సిం
దూరించును కెంపుసొంపుతోసమ మగుచున్॥ ౭౦॥

తా॥ సీసము మున్నగాగల లోహంబులను నేరేడు మఱ్ఱిమోదుగ బూరుగ అనువాని పట్టలరసముదీసి దానితో కలిపినూరుచు పుటములుబెట్టిన సిందూరించి కెంపువంటి కాంతి కలవియగును.

—( ఇత్తడి దానిశుద్ధిభస్మము ఉపయోగము. )—

సీ॥ పుత్తడిబోలిన యిత్తడి తగదెచ్చి
తైలాదిశుద్ధుల తగ నొనర్చి ।
రజము గావించి యారజము వావిలిరసం
బున నూరి యైదారుపుటము లేసి ।
గంధకమ్మును తాళకమ్మును మణిశిల
కలిపి యిత్తడి నిమ్మపులుసు[2]తోడ ।
మెత్తగానూరి యెన్మిదిపుటంబులు వేయ
పరిశుద్ధమై రీతి భస్మ మగును ।
రీతిభస్మంబు సేవించు రీతివినుము
కుష్ఠములణంచు జంతువుకులము ద్రుంచు ।
అస్రపైత్యాదిదోషంబు లపహరించు
కాక దొలగించు శైత్యముగలుగ జేయు॥ ౭౧॥

1. (క) (ఖ) నూరు. 2. (గ) చేత.

వ్యా॥ బంగరువన్నెనుండు పరిశుద్ధమగు ఇత్తడిని తైలము మజ్జిగ మొదలగువానియందు కరగిపోసి శుద్ధిచేయవలయును. అట్టిశుద్ధమగు ఇత్తడిని ఆకురాతిచే నరగరాచి యూరజమును వావిలాకు రసముబోసినూరుచు అయిదారు పుటములు పెట్టవలయును. పిమ్మట దానితోఁగూడ గంధకము తాళకము మణిశిలయను వానింజేర్చి నిమ్మపండ్లరసమునుబోసినూరి బిళ్ళలుచేసి పుటము పెట్టవలయును. ఇట్లెనిమిది పుటముల బెట్టిన ఇత్తడి పరిశుద్ధమగు భస్మముగ నగును. ఇట్టి రీతి భస్మమును సేవించిన కుష్ఠవ్యాధులు పోవును. జంతువికారములు శమించును. రక్తపిత్తవ్యాధి తొలగును. శరీరమందలి దుష్టమగు నుష్ణమును పోగొట్టును. చలవజేయును.

“రీతిర్హిచోపధాతు స్స్యాత్తామ్రస్య యశదస్యచ । పిత్తళస్య గుణాజ్ఞేయాః స్వయోనిసదృశాబుధైః । సంయోగజప్రభావేన తస్యాప్యన్యేగుణాః స్మృతాః॥” అనుదానిచే యథాభాగంబులుగ రాగిని యశదమను లోహంబును కలిపి కరగినది యిత్తడి యగుననియు నిత్తడికి మూలంబులగు లోహంబుల గుణంబు లిత్తడియం దుండుననియు ఇవిగాక సంయోగమువలన నేర్పడిన కొన్ని యితరగుణములు కూడ కలవనియు గ్రంథాంతరములయం దగుపడుచున్నవి.

మరియు “రీతికాద్వివిధాప్రోక్తా తత్రాద్యారాజరీతికా । కాకతుండీ ద్వితీయాస్స్యాత్ తయోరాద్యాగుణాధికా॥”అని రాజరీతికయనియు కాకతుండియనియు ఇత్తడి రెండువిధములనియు అందు రాజరీతి శ్రేష్ఠమనియు తద్విభాగమును; “సంతప్తాకాంజికేక్షిప్తా తామ్రా స్స్యాద్రాజరీతికా । కాకతుండీతు కృష్ణాస్స్యా న్నాసౌ సేవ్యాహిరీతికా॥” అని రాజరీతికయను నిత్తడిని కాచి కాంజికమున వైచిన నది రాగివంటి కాంతికలిగినదియగును. కాక తుండిక నిట్లు జేసిన నది నల్లబడును. ఇట్టివానిని సేవింపదగదని తత్తత్పరీక్షయు నౌచిత్యమును; “గుర్వీ మృద్వీ చ పీతాభా సారాంగీ తాడనక్షమా । సుస్నిగ్ధా మసృణాంగీ చ రీతిరేతాదృశీ శుభా” “పాండుపీతా ఖరా రూక్షా బర్బరీ తాడనే ఒక్షమా । పూతిగంధా తథా లఘ్వీ రీతిర్నేష్టా రసాదిషు” అని

బరువై మృదువై "చతుర్దశలసద్వర్ణసువర్ణసదృశచ్ఛవిః" అని చెప్పబడి నయట్లు పదునాలుగువన్నె బంగారమువలె పచ్చనికాంతిగలిగి బలమగు నవ యవముల కలయిక కలిగి సుత్తెతోఁగొట్టిన దెబ్బకోర్చి సాగునట్టి స్వభావము కలిగి స్నిగ్ధమై నునుపైయుండు ఇత్తడి మంచిది. తెలుపును పసుపును కలిగిన వన్నెయు కాఠిన్యమును పెళుసుదనమును కలిగినదియు బరబరలాడునదియు సుత్తెతోఁగొట్టిన దెబ్బకుతాళక ముక్కలుగ విరుగునదియు దుర్గంధము కలిగి నదియు తేలికయైనదియునగు నిత్తడి శ్రేష్ఠముగాదు. అని వానియందలి యుత్త మాధమజాతుల లక్షణములును మొదలగునవి తంత్రాంతరముల జెప్పబడియున్నవి.

## —॥ పిత్తలద్రుతి. ॥—

శ్రీ రసరత్నసముచ్చయము :—"సువర్ణరీతికాచూర్ణం భక్షితంవిష్ఠితం పునః। ఛాగేనకృష్ణవర్ణేన మత్తేన తరుణేనచ। తల్లిప్తం ఖర్పరేదగ్ధం ద్రుతిం ముఞ్చతిశోభనామ్। చతుర్దశలసద్వర్ణ సువర్ణసదృశచ్ఛవిః। దేహలోహకరీప్రోక్తా యుక్తారసరసాయనే" మంచిమదించినదియు యౌవనమున నుండునదియు నగు నల్లనిమేకను దెచ్చి బంగరువంటి చాయగల యిత్తడిని మెత్తనిచూర్ణముజేసి యామేకకు దినిపించునది. పిమ్మట నామేకపోతు వేయు మలమును దెచ్చి యొక కుండపెంకునబోసి యెండించి కొలిమిలోఁబెట్టి యూదినచోఁ నాపెంకున బూసిన మలమునుండు విత్తడియంతయు కరిగి పదునాల్గువన్నెలుగల బంగరు వంటి రంగుకలిగి ద్రవరూపమునంది చిరకాలము చెడకయుండును. ఈద్రుతి రసయోగములకును రసాయనయోగములకును మిక్కిలి ప్రశస్తమైయుండును.

## —॥ కంచు దానిశుద్ధి భస్మము. ॥—

సీ॥ తామ్రంబు తగరంబు తగగూర్చి మూసలోఁ
    గరగిన లోహంబు కాంస్య మండ్రు।
కాంస్యంబు తైలతక్రాదిద్రవములచే
    పరిశుద్ధి జేసిన సరసమగును।

గంధతాళములతో కలనూరి యైదారు
పుటము లేసిన మృతిబొందు లెస్స।
తామ్రభస్మమురీతి తగ గొన్ని పుటములు
వేయ నిరుత్థమై వెలయుచుండు।
కాంస్యభస్మము సేవించు ఘనుల కెపుడు
నుష్ణమై రూక్షమై చేదు నొగరు గల్గి।
వాతపైత్యకఫాదుల ఘాత లణచు
మహితగుణధుర్య యాత్రేయమౌనిధుర్య॥ ౪౨॥

మాలిని॥ జయజయమృదుశీలా చారుసౌవర్ణచేలా
జయముకురకపోలా స్వాశ్రితాహ్లాదమూలా।
జయరిపుచయకాలా సాన్ద్రవాత్సల్యశీలా
జయనిగమగిరీశా చారులక్ష్మీహృదీశా॥ ౪౩॥

గద్య॥ ఇది శ్రీమద్వైద్యవినోద శ్రీవత్సగోత్రానుమోద వేదాన్తాచార్యపుత్త్ర నృసింహవరప్రసాదలబ్ధ కవితాచాతుర్య శ్రీముడుంబ వేంకటాచార్య ప్రణీతంబైన రసప్రదీపికయను మహావైద్యశాస్త్రంబునందు నవరత్నలోహసిన్దూరాది ప్రకారంబులు గలయది తృతీయాశ్వాసము సర్వంబును సమాప్తము.



వ్యా॥ ఎనిమిదిభాగముల రాగిని రెండుభాగముల ఖురజాతివంగమును కలిపి మూసలోనుంచి కరుగగా నేర్పడులోహము కాంస్యమనబడును. ఉత్తమమగు కంచును భస్మముచేయుటకు ముందు తైలతక్రాదులయందు కరగిపోసి

శుద్ధిచేయవలయును. పిమ్మట గంధకమును తాళకమును చేర్చి నిమ్మపులుసున నూరుచు అయిదారు పుటములుబెట్టిన కంచు మృతిబొందును. పిమ్మట దానిని తామ్రభస్మమున చెప్పబడిన ద్రవ్యములతో నూరుచు అటులనే పుటములు బెట్టిన పరిశుద్ధమగు భస్మమగును. కాంస్యభస్మ ముష్ణవీర్యముగను రూక్షముగను చేదును ఒగరును కలిసిన రుచికలదిగను నుండును. ఈభస్మమును తగు ననుపానముతో సేవించిన వాతపిత్తకఫములకు సంబంధించిన వికారముల న్నియు శమించును.

మరియు "తీక్ష్ణశబ్దం మృదుస్నిగ్ధమీషచ్ఛ్యామలశుభ్రకమ్ । నిర్మలం దాహరక్తం చ షోఢా కాంస్యం ప్రశస్యతే॥" అని చెప్పబడినయట్లు తీక్ష్ణమగు ధ్వనియు మార్దవమును నునుపును కొంచెము నలుపుకలిసిన తెలుపు రంగును కాల్చిన నెఱ్ఱనిరంగునుకలిగి నిర్మలమైయుండిన నుత్తమమైనదనియు; "తత్పీతం దహనే తామ్రం ఖరం రూక్షం ఘనాసహమ్ । మర్దనాదాగతజ్యోతిః సప్తధా కాంస్యముత్సృజేత్" చూచుటకుపచ్చగనున్నను కాల్చిన రాగివన్నె కలిగినను కరుకుగను పెళుసుగను నున్నను బరువుపెట్టిన నిలువక విరుగుస్వభావము కలిగియున్నను తోమినపుడుమాత్రము మెరుగు కలుగుచుండినను అట్టి కాంస్యమును ఔషధములయందు గ్రహింపరాదు. అని దుష్టకాంస్యలక్షణములును; "ఘృతమేకం వినాచాన్యత్సర్వం కాంస్యగతం నృణామ్। భుక్తమారోగ్యసుఖదం హితం సాత్మ్యకరం తథా॥" నేయి యొక్కటి తక్క తక్కిన సకలవస్తువులును కాంస్యభస్మమును సేవించునపుడు భుజించిన సాత్మ్యమునంది హితములై యారోగ్యము నొసంగును అని కాంస్యసేవకులకు పథ్యాపథ్యములును రసరత్నసముచ్చయమున చెప్పబడినవి.

## —॥ ధాతులోహము. ॥—

ఈగ్రంథమున లోహములను విభజించునపుడు ధాతులోహ మొకటి కూడ చెప్పబడియుండెను. తక్కినలోహములతో బాటుదానినికూడ నిచ్చట వివరించుట యావశ్యకమైయున్నను ఎందుచేతనో యట్లు చేయబడదయ్యె. గ్రంథాంతరములయందు ధాతులోహమను విభాగమగుపడదు కాని రసరత్న

సముచ్చయాది గ్రన్థములయందు వర్తలోహమనునది కాంస్యపిత్తళముల తో బాటు మిశ్రలోహముగ జెప్పబడి తద్వివరణము మొదలగునవి చేయబడియున్నవి. ఇయ్యది కాంస్యాదిమిశ్రణముగ చెప్పబడుటచే మిశ్రశుద్ధసమ్మేళనజమని తెలియదగియున్నది. ఈవిమర్శమంతయు లోహవిభాగసమయమున విస్తరింపబడియె. కావున నితరగ్రంథములయందు చెప్పబడిన వర్తలోహమే ధాతులోహమను నిశ్చయముచేసికొని తద్వివరణము నిచ్చట చూపుచున్నాము.

—॥ వర్తలోహము. ॥—

శ్రీ రసరత్న సముచ్చయము:—"కాంస్యార్కరీతి లోహాహిజాతం తద్వర్తలోహకమ్ । తదేవపంచలోహాఖ్యం లోహవిద్భిరుదాహృతమ్॥" కంచు, రాగి, ఇత్తడి, ఇనుము, సీసము నను నీలోహముల కూడికవలన బుట్టునది వర్తలోహ మనబడును. కావుననే దీనిని పంచలోహమని లోహశాస్త్రజ్ఞులు వక్కాణింతురు.

—॥ వర్తలోహగుణములు. ॥—

రసరత్న సముచ్చయము :—"హిమామ్లం కటుకం రూక్షం కఫపిత్తవినాశనమ్।రుచ్యం త్వచ్యం కృమిఘ్నం చ నేత్ర్యం మలవిశోధనమ్।తద్భాండే సాధితం సర్వమన్నంవ్యంజనసూపకమ్।అమ్లేన వర్జితం చాతిదీపనం పాచనంహితమ్॥" ఈలోహము శీతవీర్యమును అమ్లవిపాకమును నైనది. కటురసము, రూక్షగుణవిశిష్టము. కఫపిత్తదోషముల శమింపజేయును. రుచికరము. స్పర్శనేంద్రియమునకును నేత్రేంద్రియమునకును హితమును చేయును. జంతుదోషమును నశింపజేయును, మలమును వెడలించి శోధించును. మరియు నీలోహముతో చేయబడిన పాత్రములయందు వండబడిన పులుసు కలియని యన్నము కూరలు పప్పులు మొదలగు పదార్థములన్నియు బాగుగ దీపనపాచనముల నంది శరీరమునకు హితమును చేయును.

—॥ వర్తలోహశుద్ధి. ॥—

"ద్రుత మశ్వజలే క్షిప్తం వర్తలోహం విశుధ్యతి" వర్తలోహమును కరిగి అశ్వమూత్రమునపోసిన నది శుద్ధిబొందును.

—॥ వర్తలోహభస్మము. ॥—

"మ్రియతే గంధతాలాభ్యాం పుటితం వర్తలోహకమ్" గంధకమును తాళకమును శుద్ధిచేయబడిన వర్తలోహముతో కూడచేర్చి నిమ్మపండ్లరసము బోసి నూరుచు పుటములబెట్టిన నది భస్మమగును.

—॥ ఉపలోహములు ॥—

§ "సప్తోపధాతవః స్వర్ణమాక్షికం తారమాక్షికమ్। తుత్థం కాంస్యం చ రీతిశ్చ సిందూరశ్చ శిలాజతు" అని స్వర్ణమాక్షికము, తారమాక్షికము, తుత్థము, కాంస్యము, పిత్తళము, సిందూరము, శిలాజతువు అనునవిఉపలోహము లని కొందరు చెప్పియున్నారు. మరికొందరు వీనియందు మండూరమునుకూడ చేర్చియున్నారు. కొందరు రససంప్రదాయములను గురించి వ్రాయబడిన గ్రంథములలో రససంప్రదాయమునకు విషయములగువానిని రస, ఉపరస, ధాతు, ఉపధాతు, రత్న, ఉపరత్న, విష, ఉపవిషంబులను భేదములచే భిన్నములుగ జేసి వానివాని నాయావిభాగములయందు చేర్చి యుపవర్ణించియున్నారు ఇంక కొందరు రససంప్రదాయమునకు చేరిన పదార్థములను రస, మహారస, ఉపరస, సాధారణరస, రత్న, ఉపరత్న, లోహాదిభేదములచే విభజించి వానివాని కాయాపదార్థముల నంతర్భవింపజేసి చెప్పియున్నారు. ఈ భేదములచే పూర్వోత్తరోదాహృతములగు గ్రంథప్రక్రియలకు పరస్పరము భేదము కలుగుచుండును. అందు ప్రకృతమున పైయుపలోహవిభాగమును జూపు శ్లోకము మొదటితెగకు చేరినవారి గ్రంథములయందు చెప్పబడి అవియన్నియు నుపధాతువులని చెప్పబడినవి. ఈగ్రంథము చాలవరకు రెండవతెగవారి గ్రంథముల ననుసరించి వ్రాయబడియుండుటచే నీయుపధాతువులలో కొన్ని మహారసోపరసాదులయందుచేర్చి యిందు వివరింపబడినవి.

వీనిలో మిగిలినది మండూర మొకటి కనబడుచున్నది. అయ్యది రసరత్నసముచ్చయాదులయందు కాంతలోహమున కనంతర మయోవిభాగముగ వర్ణింపబడినది. కావున దానినిగూడ నిచ్చట జూపెదము.

—॥ మండూరము. ॥—

§ "ధ్మాయమాన మయోవహ్నౌ పరిత్యజతి యన్మలమ్ । తత్కిట్ట సంజ్ఞాంలభతే తదనేకవిధంమతమ్" "ధ్మాయమానస్యలోహస్య మలంమండూరముచ్యతే" అయోలోహము నూదునపుడు ఆ యినుమునుండి కొలిమిలోనికి జారిన మలము మండూర మనబడును. ఇదియే లోహకిట్ట మనబడును. ఇది యనేకవిధములుగ నుండును.

—॥ మండూరలక్షణము, దానిభేదములు. ॥—

"ఈషచ్ఛవి గురు స్నిగ్ధం ముండకిట్టం జగుర్బుధాః । భిన్నాంజనాభం యత్కిట్టం విశేషాద్గురు నిర్వ్రణమ్ । నిష్కోటరం చ విజ్ఞేయం తీక్ష్ణకిట్టం మనీషిభిః । పింగం రూక్షం గురుతరం తదగ్ధమవకోటరం । భిన్నే చ రజతచ్ఛాయం స్యాత్కిట్టం స్థితకాంతజమ్॥" కొద్దికాంతియు బరువును చిక్కనయు కలిగియుండునది ఇనుపచిట్టెముగ జెప్పుదురు. నూరినకాటుకవలె నల్లనికాంతికలిగి మిగుల బరువై బుడిపెలునుతొఱ్ఱలును లేకయుండునది ఉక్కుచిట్టెమందురు. పింగళ (పచ్చని) వర్ణముకలిగి పెళుసై మిగుల బరువై తొఱ్ఱలులేనిదై నరికిన వెండివంటి కాంతికలిగియుండునది కాంతపుకిట్టమని శాస్త్రజ్ఞులు వచించెదరు.

—॥ మండూరశుద్ధిప్రధానము. ॥—

రసరత్నసముచ్చయము:—(1) "అక్షాంగారైర్ధమేత్కిట్టం లోహజం తద్గవాం జలైః । సేచయేదతప్తాంతః సప్తవారం పునఃపునః । మండూరోయం సమాఖ్యాతః చూర్ణం శ్లక్ష్ణం నియోజయేత్॥" లోహపుకిట్టమును తాండ్రబొగ్గుల నిప్పులయందుంచి యూది తాండ్రకొయ్యచే చేయబడిన పాత్రయందుంచి గోమూత్రముబోసి తడుపవలయును. ఇట్లేడుసారులు చేసిన శుద్ధమగును. దానిని మెత్తగ చూర్ణముచేసి యుపయోగింపవలయును.

(2) "గోమూత్రైః త్రిఫలాక్వాథ్యై తతోక్వథే సేచయేచ్ఛనైః।లోహకిట్టం సుతప్తం తు యావజ్జీర్యతి తత్స్వయమ్ । తచ్చూర్ణం జాయతే పేష్య

మండూరోయం ప్రయోజయేత్॥" త్రిఫలములను గోవుల మూత్రముబోసి కషాయముగ కాచవలయును. చిట్టెమును నిప్పులయందు బాగుగకాల్చి యీ కషాయమున తడుపవలయును. చిట్టెము స్వయముగ విరిసిపోవునంతవర కట్లు కాల్చుచు తడుపుచునుండి పిమ్మట దానిని మెత్తగ చూర్ణముచేసి యుపయోగింపవలయును.

—॥ మండూర గుణము. ॥—

"కఫం పిత్తం తథాశూలం శోఫార్శః ప్లీహపాండుతామ్ । మేదో మేహక్రిమీన్ కుష్ఠం లేఖనం వాతజం జయేత్॥" శుద్ధమగు మండూరమును సేవించినచో శ్లేష్మపిత్తములకు సంబంధించిన వికారములను శూలలను నంజులను మూలవ్యాధులను, ప్లీహమును, పాండువ్యాధులను, మేదోరోగమును, మేహరోగములను, జంతువికారములను, కుష్ఠమును, వాతమువలన కలిగిన వ్యాధులను పోగొట్టును.

—॥ సర్వలోహసామాన్యద్రుతి. ॥—

శ్రీ రసరత్నసముచ్చయము:—"గన్ధకం కాన్తపాషాణం చూర్ణయిత్వా సమంసమమ్ । ద్రుతేలోహే ప్రతీవాపో దేయోలోహాష్టకంద్రవేత్॥ దేవదాల్యాద్రవైర్భావ్యం గన్ధకం దినసప్తకమ్ । తేనప్రవాపమాత్రేణ లోహాస్తిష్ఠన్తి సూతవత్" గంధకమును కాంతలోహమును సమభాగములుగ జేర్చి చూర్ణము జేసి యాచూర్ణమును లోహములు కరగునప్పుడు ప్రతీవాపము జేసినచో ద్రవించును. ఈయోగమున నష్టవిధలోహములును నీరువలె ద్రవరూపమునందును.

మరియు గంధకమును డావరడంగిరసమున నేడుదినములు భావనలజేసి యెండించి చూర్ణముజేసి యాచూర్ణమును లోహము కరగునపుడు ప్రతీవాపము జేసినచో నీళ్లవలె ద్రవించును.

—॥ ద్రుతిసంరక్షణోపాయము. ॥—

శ్రీ రసరత్నసముచ్చయము:—"కుసుమ్భతైలమధ్యేతు సంస్థాప్యా ద్రుతయః పృథక్ । తిష్ఠన్తి చిరకాలంతు ప్రాప్తేకార్యే నియోజయేత్"

ఆయాపద్ధతుల ననుసరించి సిద్ధములు జేయబడిన నానావిధద్రుతులను యోగ్యపాత్రలయందుంచి మూసి యాపాత్రలను కుసుమనూనె నడమునునిచినచో నవి చెడక చిరకాలమువరకును శుద్ధములుగనుండును. అట్టిద్రుతులను కావలసిన సమయమున నాయాయోగముల జేర్చుకొనవలెను.

## —॥ భూనాగసత్వము. ॥—

§ మరియు రసరత్నసముచ్చయమున లోహవిధానముల నన్నిటిని జెప్పి పిమ్మట రత్నద్రుతికి సాధనమగు భూనాగసత్వమును జేయుపద్ధతి యీవిధముగ జెప్పబడినది.—(1) "వజ్రాణాం ద్రావణార్థాయ సత్వం భూనాగజంబ్రువే । తదేవ పరమం తేజః సూతరాజేన్ద్రవజ్రయోః । ధౌతభూనాగసంభూతిం మర్దయే ద్భృంగజద్రవైః । నింబూద్రవైశ్చ నిర్గుండ్యాస్స్వరసై స్త్రిదినం పృథక్ । తద్ద్రావణగణోపేతం సమ్మర్ద్య వటకీకృతమ్ । నిరుధ్య దృఢమూషాయాం ద్విదణ్డం ప్రధమే ద్దృఢమ్ । స్వాంగశీతం సమాహృత్య పట్టకేవిని వేశ్యతత్ । రవకాన్ రాజికాతుల్యాన్ రేణూనతి భరాన్వితాన్ । ద్వాదశాంశార్క సంయుక్తాన్ ధమిత్వా రవకాన్ హరేత్ । ప్రక్షాళ్య రవకానాశు సమాదాయ ప్రయత్నతః । వజ్రాదిద్రావణం తేన ప్రకుర్వీత యథేప్సితమ్ । ఖరసత్వమిదం ప్రోక్తం రసాయన మనుత్తమమ్ । ద్విత్రిమూషాసుచైకస్యాం సత్వం భవతి నిశ్చితమ్" భూనాగము (వానపాము)లను తెచ్చి కడిగి కాల్చి బూడిదెగ చేయవలయును. ఆబూడిదెయందు గుంటకలగర రసముబోసి యొకదినమును నిమ్మపండ్లరసముబోసి యొకదినమును వావిలియాకురసమునుపోసి యొకదినమును మర్దించి ద్రావణగణమున చెప్పబడిన ద్రవ్యములతో దానినిచేర్చి నూరి యుండలుగ జేయవలయును. పిమ్మట నాయుండలను దృఢమైనమూసలోనునిచి మూతిమూసి చీలమట్టినిబూసి యెండించి కొలిమిలోబెట్టి రెండుగడియలకాలము గాఢముగ నూదునది. పిదప స్వాంగశీతలమైన వెంటనే వెలికిందీసి మూసలోనుండి గట్టిదైన ద్రావకమును యంత్రావగింజల బోలియుండు గుండ్లను మిక్కిలి భారముగల్గియుండు రేణువులను గ్రహించవలెను. పిమ్మట వానికి పన్నెండవ

పాలు జిల్లేడుపట్టచూర్ణమును కలిపి మూసలోనునిచి మరల మునుపటివలెనే యూది స్వాంగశీతలమున నందుండు రవలను గ్రహించునది. ఇయ్యది భూనాగ సత్వ మనబడును. అట్టి సత్వమును నీళ్లచే పరిశుభ్రముగ కడిగి యుంచుకొని వజ్రాదిమణులను ద్రావణము జేయుతరి యుపయోగించుకొనునది. ఇయ్యది ఖర సత్వమనియు బేర్కొనంబడును. రసాయనమునగూడ నుత్తమమైయుండును. పైజెప్పినరీతిగ జేయుటచే సత్వమేర్పడకున్నచో మరల రెండుమూడు తడవ లదేతీరున జేసి కొలిమిలో నూదినచో శుద్ధమగు సత్వమేర్పడును.

(2) "భుజంగమానుపాదాయ చతుష్ప్రస్థసమన్వితాన్ । సువర్ణరూప్య తామ్రాయస్కాంత సంభూతిభూమిజాన్ । ప్రక్షాళ్యరజనీతోయైః శీతలైశ్చ జలైరపి । ఉపోషితంమయూరంవా కూరంవాచరణాయుధమ్ । క్రమేణచార యిత్వాథ తద్విశ్లేస్సముపాహరేత్ । క్షారామ్లైస్సహసంపేష్య విశోష్యచఖరా తపే । తతఃఖర్పరకేక్షిప్త్వా భర్జయిత్వామషీంచరేత్ । మషీంద్రావణవర్గేణ సంయుక్తాం సంప్రమర్దితాం । నిరుధ్యకోష్ఠికామధ్యే ప్రధమేద్ఘటికాద్వయమ్॥ శీతలీభూతమూషాయాః ఖోటమాహృత్యపేషయేత్ । ప్రక్షాళ్యరవకానాశు సమాదాయప్రయత్నతః । సువర్ణమానవద్ధ్మాత్వా రవంకృత్వానియోజయేత్॥"

వెండి బంగరు తామ్రము అయస్కాంతము అను నీలోహములుజనించు భూములబుట్టిన వానపాములను నాలుగుప్రస్థముల పరిమితముగదెచ్చి చల్లని నీళ్లచే శుభ్రముగకడిగి యొకదినమంతయు నాహారముబెట్టక యుపవాసముంచ బడిన నెమలినైనను మిక్కిలి శౌర్యముగల కోడినైనను దెచ్చి దానికి పైజెప్పిన వానపాములను దినక్రమముగ దినుపించునది. పిమ్మట నాజంతువు విసర్జించు మలమునుగ్రహించి యందు క్షారములను అమ్లవర్గపు రసములను కలిపినూరి తీక్ష్ణ మైన యెండనెండించి యొకమూకుటిలోనునిచి ప్రొయ్యిపైబెట్టి వేయించి యందుండు మలమంతయు మసివలెయగునట్లు చేయునది. పిమ్మట నామసిని ద్రావణవర్గమునజెప్పిన ద్రవ్యములజేర్చి నూరి మూసలోనునిచి చీరమంటిని బూసి యెండించి కొలిమిలోబెట్టి రెండుగడియలకాలమూదునది. స్వాంగశీత

మైనవెనుక మూసలో నుండవలెనుండు సత్వమును గ్రహించి నూరి యేర్పడిన రవలను నీళ్లచేగడిగి మరల బంగరునూచురీతిగ కొలిమిలోబెట్టి యూది రవలను గ్రహించునది. ఇదియే భూనాగసత్వ మనదగును.

ఇతి శ్రీమన్మహీశూర మహారాజధానీ మధ్యవిద్యోతమాన సర్వతోభద్ర దివ్య రత్నసింహాసనాధీశ్వర శ్రీమద్రాజాధిరాజేత్యాది బిరుదావళీ విరాజమాన శ్రీశ్రీకృష్ణరాజసార్వభౌమ సంస్థానాస్థానాయుర్వేద విద్వద్వైద్య ప్రకాణ్డ శ్రీమద్రాజకీయ సంస్కృత మహాపాఠశాలాయుర్వేద మహోపాధ్యాయ అగరం.పుట్టస్వామిశాస్త్రి చరణారవిన్దసంసేవాసమాసాదితాయుర్వేదవిద్యా సత్సంప్రదాయ గౌతమగోత్ర విరాజమాన దివ్యాన్వవాయ శ్రీకృష్ణమాచార్యపౌత్ర కోదండ రామాధ్వరి దౌహిత్ర రామకృష్ణార్య రాజ్యలక్ష్మ్యమ్బా తనూభవ సకల సహృదయ విధేయ శ్రీమత్పంచమజార్జి చక్రవర్తి ప్రదత్త "వైద్యరత్న" బిరుదావళీ విరాజమాన "ఆయుర్వేదమార్తాండ" భిషజ్మణి, పండిత గోపాలాచార్య విరచితంబైన "ప్రభ" యను రసప్రదీపికాన్ధ్రి వ్యాఖ్యానమున తృతీయాశ్వాసము

సమాప్తము.

శ్రీః

# తప్పొప్పులను దెలుపు పట్టిక.

| తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. |
|---|---|---|---|
| ముడింబి ... | ముడుంబ ... | ౩ | ౫ |
| సురిని ... | శురుని ... | ౬ | ౧౭ |
| చున్నది ... | చున్నవి ... | ౯ | ౯ |
| బోయిన ... | పోయిన ... | ౧౦ | ౧౪ |
| జౌపాధిక ... | ఔపాధిక ... | ౧౭ | ౨౪ |
| నెసార్యులు ... | నేయార్యులు ... | ౧౯ | ౨౪ |
| మందలి ... | మందు ... | ౨౯ | ౧౨ |
| యొత్తు ... | యెత్తు ... | ౩౮ | ౧౦ |
| స్పధి ... | వృద్ధి ... | ౪౨ | ౩ |
| ముసు ... | ముఖు ... | ౫౪ | ౩ |
| యవే ... | యనే ... | ౫౫ | ౨౨ |
| పృసు ... | పృథు ... | ,, | ౨౩ |
| తేల్ల | వేల్ల | ౭౬ | ౬ |
| | | ,, | ౧౬ |
| | | ,, | ౧౭ |
| | | ,, | ౨౪ |
| కొనుటయు ... | కొనుట ... | ౭౮ | ౧౬ |
| నంజ్జా ... | నంజా ... | ౯౭ | ౧౨ |
| యుక్తాన ... | యుక్తాను ... | ,, | ౧౪ |
| హింసు ... | హింసు ... | ౯౬ | ౯ |
| ముస ... | మున ... | ౯౭ | ౧౨ |
| క్నృణో ... | క్నీణో ... | ౧౦౦ | ౭ |
| వూహింప ... | యూహింప ... | ,, | ౧౩ |

# తప్పొప్పులను దెలుపు పట్టిక.

| తప్పు. | ఒప్పు. | పుటం. | పం[illegible] |
|---|---|---|---|
| కౄార ... | క్రూర ... | ,, | [illegible] |
| శిలలసు ... | శిలలను ... | ౧౦౩ | [illegible] |
| వాభి ... | నాభి ... | ౧౧౩ | [illegible] |
| యిట్టి ... | నిట్టి ... | ౧౨౪ | [illegible] |
| యంతటి ... | నంతటి ... | ,, | [illegible] |
| పాషాణా ... | పాషాణ ... | ౧౨౭ | [illegible] |
| ధును ... | ధనుః ... | ౧౩౧ | [illegible] |
| మున ... | ముని ... | ౧౪౨ | [illegible] |
| వారుచేయు ... | చేయు ... | ౧౪౩ | [illegible] |
| దిగ ... | విగ ... | ,, | [illegible] |
| యున్నది ... | యున్నవి ... | ,, | [illegible] |
| మనియర్థము ... | మనియు నర్థము ... | ౧౪౯ | [illegible] |
| పైన ... | నైన ... | ౧౫౬ | [illegible] |
| నీగ్రంథ ... | ఈగ్రంథ ... | ౧౭౩ | [illegible] |



శ్రీమద్ధన్వన్తరయేనమః.

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

సంస్కృతమునకు విపులమగు నాంధ్రవ్యాఖ్యాన రూపములుగను ఆంధ్రభాషయందు కేవల గద్యరూపములుగను మాచే సంప్రదాయానుసారముగ వ్రాయబడి ముద్రితములై క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

☞ శాశ్వతచందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగత పుస్తకములు 100-కి 25-రూపా. తగ్గించి ఇవ్వబడును.

1. మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్ర వ్యాఖ్యాయుతము. రోగనిదానాదులం దెలుపు గొప్ప వైద్యగ్రంథము. వెల ... ... 3 0 0

2. పథ్యాపథ్యము - సంస్కృతము. విశదమగు తెనుగు తాత్పర్యము వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను దెలుపును. వెల ... 1 0 0

3. ఆయుర్వేదపరిభాష - అనేక గొప్ప ఆయుర్వేదగ్రంథములనుండి సంగ్రహింపబడినది. సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయువారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... ... ... 1 8 0

| | | | |
|---|---|---|---|
| 4. ఆగస్త్యవైద్యము - దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగువచనము. వెల ... | 0 | 4 | 0 |
| 5. ఆయుర్వేదాంగశల్యతంత్రము - ఆయుర్వేదమున శస్త్రచికిత్స నెట్లు కనుగొనినదియు దానినభ్యసించు మార్గములను బోధించు తెనుగువచనము వెల ... | 0 | 4 | 0 |
| 6. వస్తికర్మము - "పిచికారి" యొక్క స్వరూపమును దాని నుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెనుగు వచనము. వెల ... ... ... | 0 | 4 | 0 |
| 7. అర్కప్రకాశము - ప్రతిమూలికనుండియు "అరకుల" దీయుట కుపాయములను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుసరించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్రవ్యాఖ్యానము వ్రాయబడియున్నది. వెల ... ... ... | 2 | 0 | 0 |
| 8. భేషజకల్పము - వైద్యప్రక్రియలను తెలుపు సుప్రసిద్ధ ఆంధ్రపద్యకావ్యము. అతి విపులమగు నాంధ్రవ్యాఖ్యానము కలదు. వైద్యులుమాత్రమేగాక ప్రతియాంధ్రుడును చూడతగినయుత్తమగ్రంథము. వెల... | 1 | 0 | 0 |
| 9. ఆయుర్వేద(చరిత్ర)ము - ఆయుర్వేదము అందలి విషయములు మొదలగువానిని విపులముగ చర్చించు తెనుగు వచన గ్రంథము, వెల ... ... | 0 | 4 | 0 |

# ప్రకృతము ముద్రణములోనుండు ఆయుర్వేద వైద్యగ్రంథములు.

---:O:---

**చరకసంహిత** — చికిత్సాశాస్త్రములలో నింతటి యుత్తమగ్రంథ మింకొకటిలేదు. దీని విఖ్యాతినిబట్టి ఇందలివిషయముల వివరించుట యనవసరము. ఇది చక్రపాణి, గంగాధరకవిరాజ, యోగీంద్రనాథులు, మొదలగు వ్యాఖ్యాతల వ్యాఖ్యలననుసరించి విపులముగ విశేషవిషయముల కూర్చి రచింపబడిన యాంధ్రవ్యాఖ్యతో కూడియున్నది.

**సుశ్రుతసంహిత** — శస్త్రచికిత్సను శారీరవిభాగములను దెలుపు విఖ్యాత వైద్యగ్రంథము. ఇది చక్రపాణి, డల్హణుడు మొదలగువారి వ్యాఖ్యానముల ననుసరించి యనేక నూతనవిషయములం జేర్చి అతిప్రౌఢముగ వ్రాయబడిన యాంధ్రవ్యాఖ్యాసహితము. యంత్రశస్త్రములయొక్కయు శారీరవిభాగములయొక్కయు ప్రతిమలిందు ముద్రించబడుచున్నవి. మరియు నిందలి శారీరసంబంధములగు పేరులకు యింగ్లీషుతో స్థానములు చేర్పబడియున్నది.

**ఆయుర్వేదచికిత్సాప్రకాశిక** — ఇందు వ్యాధులకన్నిటికిని ఆయుర్వేద సంప్రదాయమున మా స్వానుభవముచే నిశ్చితములైన సులభములగు కషాయ, లేహ్య, చూర్ణ, స్వరసాది చికిత్సాప్రక్రియలు ప్రతిచోటను దొరకు పదార్థములతో ప్రతివారును జేసుకొనుటకు అనుకూలమైనవి వ్రాయబడియున్నవి.

**అష్టభాషావైద్యకనిఘంటువు** — మన రాజధానియందలి వైద్యుల వ్యవహారములో గల మూలికలు సంస్కృతము, తెనుగు, అరవము, మళయాళము, కన్నడము, హిందూస్తాని, ఇంగ్లీషు, ల్యాటినీభాషలలో

నాయామూలికలు చక్కగ దెలియునటులను సాధ్యమగునంతవరకు ఆమూలికాదుల గుణములతోకూడ వ్రాయబడియున్నది.

నవనాథసిద్ధప్రదీపిక - ఇయ్యది పేరయామాత్య విరచితపద్యకావ్యము. ఇందు నవనాథసిద్ధులు దేశహితమునకై గనుగొనిన గొప్పగొప్పసిద్ధప్రక్రియలు మెండుగాగలవు.

శారీరము (ఫిజియాలజీ). శారీరవిభాగము (అనాటమీ) - ఈరెండును మాకలాశాలయందలి గొప్ప ఆంగ్లవైద్యవిశారదులచే విరచితములు. ఆంధ్రమున ఇట్టి గ్రంథములు యింతవరకులేవు. చిత్రప్రతిమలతో ముద్రితము.

మధుమేహము, రాజయక్ష్మ, చలిజ్వరము, విషూచి, ఓషధితత్త్వము మొదలగు గ్రంథములు శాస్త్రచర్చలతో వచనరూపముగ నుండును.

మరియు భావప్రకాశిక, బృందమాధవము, కల్యాణకారకము, రసార్ణవము, రసరత్నసముచ్చయము, రసరత్నాకరము, రసపరిభాష, నిదానపరిశిష్టము మొదలగు గ్రంథములను నాంధ్రవ్యాఖ్యలతోడ ముద్రించుచున్నాడను.

# నాగరాక్షరములతో ముద్రణలోనున్న ప్రాచీన వైద్యగ్రంథములు.

ఆయుర్వేదసూత్రములు — నిత్యానందసనాథవిరచిత వ్యాఖ్యాసహితము. ముద్రణ త్వరలో పూర్తియగును.

| | |
|---|---|
| భేడసంహిత. | మహర్షి భేడవిరచితము. |
| కల్యాణకారకము. | ఉగ్రాదిత్యాచార్య విరచితము. |
| యోగశతకము. | వరరుచివిరచితము (వ్యాఖ్యాసహితము) |
| ప్రశ్నోత్తరరత్నమాల. | అగ్నివేశ పునర్వసు సంవాదరూపము. |
| భేషజకల్పము. | చన్ద్రనాచార్య వ్యాఖ్యాసహితము. |
| వాగ్భటమండనము. | పండితభట్ట నరహరివిరచితము. |
| చారుచర్య. | భోజమహారాజ విరచితము. |
| ఆయుర్వేదసారము. | శేవణసిద్ధవిరచితము. |
| ఆనందకందము. | మన్థానభైరవసిద్ధ విరచితము. |
| కాశ్యపసంహిత. | మహర్షి కశ్యపవిరచితము. (అతిప్రాచీనము) |
| శివతత్త్వరత్నాకరము. | కేరళిబసవరాజ విరచితము. |
| భేషజతర్కం. | ప్రాచీనము. |
| రసప్రదీపము. | ప్రాచీనము. |
| నాడీతంత్రము. | ప్రాచీనము. |

మొదలగు గ్రంథములు అనేక గ్రంథముల సాహాయ్యమువలన నాయుర్వేదాశ్రమమున జక్కగఁ బరిశోధింపంబడి ముద్రణమునకు సిద్ధముగనున్న యవి మఱియుఁ బై గ్రంథములుగాని యింక నితరవైద్య గ్రంథములుగాని యెవరివద్దనైన నుండినయెడల మాకార్యాలయమునకు దయతోఁ బంపిన వందనములతో నందుకొని మాపుస్తకములతో సరిచూచుకొని పంపెదను.

మఱియు ముద్రణానంతరము ముద్రితమగు నొక గ్రంథమునుగూడ నుచితముగ బంపెదను.

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్లు,
ఎ.వి.ఎస్., ఎ.ఎమ్.బి.,
ఆయుర్వేదాశ్రమం, జి టి. మదరాస్.

టెలిగ్రాఫ్ అడ్రసు
"పండిట్" మదరాస్.

# శాశ్వతపు చందాదారులు.

---

మా గ్రంథమాలయందలి గ్రంథములు ప్రతి ఆంధ్రునకును ప్రతి ఆంధ్రదేశపు వైద్యునకును ఇతరవైద్యులకును మిక్కిలి యుపయోగమగునట్లు తక్కువ వెలల కీయదలచినారము.

మా గ్రంథములన్నియు చవుకగా కావలయునేని మా గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులగుటయే యుత్తమము. శాశ్వత చందాదారులగువారు మొదట చందాధనము నీయనక్కరలేదు.

తాము సంతకము జేసిపంపిన దరఖాస్తు అందగానె ఇదివరకు ప్రకటింపంబడిన గ్రంథములలో నిలవయున్న గ్రంథములన్నియు తమకు వి. పి. గా పంపబడును. తరువాత క్రొత్తగ్రంథములు ఎప్పటికప్పుడు వి. పి. గా పంపబడుచుండును.

చందాదారులగువారు మేము పంపిన వి. పి. లు తిరుగగొట్టకుండగలందులకు యెక్కువగ ప్రార్థించెదము. అట్లు తిరుగగొట్టినవారివద్దనుండి గ్రంథముల పూరా వెలలును మాకగు నష్టమును క్రమముగ రాబట్టుకొనబడును.

కొందరివలె ముమ్ముందుగ పోషకులవద్దనుండియు చందాదారులవద్దనుండియు ద్రవ్యమును స్వీకరించి ఒకటిరెండు సంచికలనుమాత్రము యెచ్చటనోముద్రించి బంపియో లేక పంపకయోయుండు గ్రంథమాలలవలె గాక మా గ్రంథమాలయందలి గ్రంథములను ఆంధ్రసోదరుల సౌకర్యమునకై విశేషమగు మూలధనముతో స్వకీయమగు ముద్రణాలయమును యేర్పరచుకొని అధిక ధనవ్యయముతో పుస్తకములను ముద్రించి ముద్రణము పూర్తియైనతోడనే దెలిపి వి. పి. మూలకముగ పంపుచున్నారము.

శాశ్వతచందాదారులుగ నుండగోరువారు ముందుగ ప్రవేశరుసుము క్రింద రెండుఅణాలు పోష్టుబిళ్లలను పంపుకొనవలెను. శాశ్వతచందాదారులుగా నున్నవారికి మా గ్రంథమాలయందలి గ్రంథములన్నిటికిని నియమితములగు ఖరీదులో రూపాయికి నాలుగణాలు తగ్గించి యివ్వబడును. చక్కని కాకితములు చక్కనిఅచ్చు మనోహరమగు బైండుతోజేరిన ఆయుర్వేద వైద్యశాస్త్ర గ్రంథములు ఇంతకన్న తక్కువవెలల కిచ్చువారు ఆంధ్రదేశమునందెచ్చటను లేరని జెప్పగలము.

శ్రీరస్తు.

భరతఖండమునందలి కలకత్తా, బొంబాయి, బనారస్
మొదలగు పట్టనములయందు జరిగిన చిత్రవస్తు మహాప్రదర్శనములయందు
బంగారు పతకములను, మొదటితరగతి యోగ్యతాపత్రములను
శ్రీ శ్రీ శ్రీ గద్వాలమహారాణి గారినుండి మహామారినివారకౌషధములకై
బంగారు పతకమును బొంది
శ్రీమత్పంచమజార్జిచక్రవర్తి సార్వభౌమునిచే "వైద్యరత్న" యను
బిరుదమును బొందిన ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి

# పండిత డి. గోపాలాచార్యులు, ఏ. వి. ఎస్.,

గారిచేత శాస్త్రోక్తముగ తయారుచేయబడిన

# ఆ యు ర్వే దీ యౌ ష ధ ము లు.

ప్రమేహభంజని:—మధుమేహము, బహుమూత్రము అను క్రూర వ్యాధులను పోగొట్టి యెట్టి యవస్థలోనయినను రోగికి శ్రమనివారణమును కలుగజేయుటకు నిశ్చయమయిన యౌషధము. ఈ యౌషధమువలన గుణమునుగాంచిన గొప్పవారనేకులు దీనివలన తమకు కలిగిన అధిక ప్రయోజనమును కృతజ్ఞతాపూర్వకముగ నొప్పుకొనుచున్నారు. వెల రు. 2—8—0

వజ్రదంతచూర్ణము:—ప్రతిదినము దంతధావనము జేసినయెడల దంతములనుండి రక్తము కారకుండ జేసి దంత సంబంధమగు నితరవ్యాధులను నిర్మూలము చేసి దంతమూలములకు మిగుల దార్ఢ్యము గలుగచేయును.
డబ్బా 1-కి 4 అణాలు.

వృష్యయోగము:—వీర్యవృద్ధినిచ్చి బలమును కలుగచేయుటయందు ఉత్తమోత్తమమయినది. మెదడునకును మెదడునందుండు నరములకును ప్రధానావయవములకును పటుత్వమును, రక్తవృద్ధిని, దృష్టిబలమును కలుగజేయుటయందిది సంజీవివంటిది. వెల డబ్బా 1-కి రు. 1—0—0.

పూజ్యపాదవటి:—నరముల నొప్పులను నరముల ఈడ్పులను పక్షవాతములను, చచ్చువాతములను నిర్మూలనముచేయును. హృదయమునకు మిక్కుటమగు బలమును గలుగజేయును. వెల సీసా - 12 - అణాలు.

పంచానన లేపము:—ఈ యౌషధము తామరను శుభ్రముగపోగొట్టి విడువకుండ నుపయోగించినయెడల తిరిగి యెప్పటికి పొడచూపకుండచేయును.
వెల డబ్బా 1-కి 8-అణాలు.

సుఖవిరేచనవటి:—మాత్ర మినపగింజకంటె నధిక ప్రమాణముండదు. అసహ్యములేకుండ సేవించదగినది. మలబద్ధకమును నివారించును. పసిబిడ్డలు కూడ నుపయోగింపనగును. వెల సీసా 1 కి 8-అణాలు.

అజీర్ణ పంచాననము:—అజీర్ణమువల్ల కలిగెడు అనేక వ్యాధులలో జ్వరము, నిద్రలేకపోవుట, రొమ్ములో బరువు, నిస్త్రాణ, బలహీనము, కడుపు నొప్పి యనునవి పోగొట్టుటకు రాజౌషధము. వెల డబ్బా 1-కి రు. 0-8-0.

తాంబూలవటి:—ప్రతిదినము తాంబూలముతో నుపయోగించుట కుద్దేశింపబడినది. మిక్కిలి బలమును కలుగజేయుటయేగాక, తాంబూలమునకు రుచిని పుట్టించి నోటిదుర్గంధమును పోగొట్టి, కంఠనాళములకును స్వరమునకును జీర్ణశక్తికిని సహాయముచేయును. 50 మాత్రలుగల సీసా 8-అణాలు.

కేశప్రసాదన తైలము:—శిరస్సు చల్లపడునట్లు చేసి వెంట్రుకలు ఊడిపోకుండ పెరుగుటను వృద్ధిచేసి, అకాలమున నెరవకుండునట్లుచేయును. మెరుగునూనెలకు బదులు దీని నుపయోగించుటచే కలిగెడు లాభము అసదృశము. వెల సీసా 1-కి రు. 1.

భృగువటి:—రెండురోజులలో సెగరోగములను పోగొట్టి మర్మస్థానమునందలి విషజల స్రావమునాపును. దీర్ఘకాలమునుండి బాధింపుచున్న వ్యాధియందు వారముదినముల సేవవలన రోగిని మిక్కిలి మంచిస్థితికి తెచ్చుట నిస్సంశయము. వెల 24 మాత్రలుగల సీసా 1-కి రు. 1—8—0.

చంద్రకల:—ఒంటికణతనొప్పులు, అన్నివిధములగు తలనొప్పులు, పడిశము, రొమ్ముపడిశము, కళ్లె, దగ్గు, సామాన్యవాపులు, కీళ్ళవాపులు మొదలగు వాటియందు దీనిని రుద్దినతోడనే బాధ మాయమగును. ఇది ప్రతియింట నుండదగిన కుటుంబౌషధము. వెల బుడ్డి రు. 0—8—0.

అశోకవటి:—స్త్రీల దురవస్థలను తొలగించుటకు అమూల్యమయిన యౌషధము ఋతు సంబంధమగు నొప్పులను, ఇతరజబ్బులను, రజోగర్భాశయములు చెడుటవలన నేర్పడినవ్యాధులను మొదలంటు రూపుమాపుటలో నిస్సందియము. వ్యాధినివారణమయినపిదప గర్భోత్పత్తియు సుఖప్రసవమును ఈ యౌషధ సేవవలన నేర్పడుచున్నవి. వెల సీసా 1-కి 12-అణాలు.

రక్తశోధక:—సవా మేహములచేతను, రసదోషములచేతను, యింకనేక కారణములచేతను, చెడిపోయిన రక్తమును శుద్ధిపరచును కురుపులు, చీడ, తామర, మేహపొడలు, మొదలగు చర్మదోషములను నిర్మూలము జేయును. నోటిపూతలను, అపుడపుడువచ్చు కండ్లకలకను బోగొట్టును.

వెల బుడ్డి రు. 2—8—0.

అబలాసంజీవిని:—(స్త్రీలకుగలుగు మదమూర్ఛలకు సిద్ధౌషధము) యువతులగు స్త్రీలకు ననేక కారణములచే గలుగు అపస్మారములను, మూర్ఛలను, గర్భాశయదోషములను, పలువిధ మనోవికారములను, బోనణచును. గర్భిణీ స్త్రీలు దీనిని సేవించిన గర్భాశయమునకు మిక్కిలి బలమును, సుఖప్రసవమును, గలుగంజేయును, మఱియు, ఇయ్యది స్త్రీలకేకాక మనుజసామాన్యముగ సంభవించు మూర్ఛలను అపస్మారములనుకూడ నశింపజేయును.

వెల బుడ్డి రు. 1—8—0.

వృశ్చికదంశ నివారిణి:—తేలుకుట్టినచోట దీనిని రుద్దినయెడల, 5 నిమిషములలోనే కుట్టినచోటకూడ బాధలేకుండునట్లు జేయునని అనేకవేల మహనీయులు కొనియాడుచున్నారు. వెల బుడ్డి 0—8—0.

జంబీరరసాయనము:—(పైత్యములకు మంచిది.) నోట నీళ్లూరుట, తలతిరుగుట, రొమ్మునొప్పి, రొమ్ములోమంట, కడుపులో త్రిప్పుట, వాంతియగుట, పసరువెళ్లుట ఈ మొదలగు పైత్యవికారములకు మిగుల మంచిది. మఱియు పైత్యాజీర్ణములకు మిక్కిలి గుణకారి. వెల బుడ్డి రు. 0—8—0.

చ్యవనప్రాశన:—ఉబ్బసము దగ్గులను, క్షయదగ్గులను, సామాన్యపుపొడిదగ్గులను, రొమ్ముపడిశెము వలన కఫము జాస్తిగానుండుటను, నివర్తిజేయును. రొమ్మునకు ఊపిరితిత్తులకు బలమును కలిగించును. క్షయరోగులంటటివారి కసమానపుష్టిని శరీరమునకు శక్తినికలిగించును. బాలురును, వృద్ధులు

నుగూడ సేవించదగును. బలమునకు దీసికొను చేపనూనెకంటె (Cod liver Oil) వేయిరెట్లు పనిజేయును. ఉబ్బసమువగయిరాలను రాకుండ కాపాడును.

వెల టిన్ను రు. 2—8—0.

అశ్వనివటి:—ప్రతిదినము వచ్చెడి జ్వరములను, దినమువిడిచి దినము వచ్చెడి జ్వరములను, వర్షాంతములవరకు విడువని జ్వరములను, బల్లలతోకూడిన జ్వరములనుకూడ నతిశీఘ్రములో మాయము జేయును. వెల బుడ్డి రు. 0-12-0.

మకరధ్వజ:—రోగసామాన్యములను రాకుండ జేయుటయందును, అనేక కారణములచేత బలహీనతనొందిన వారికి బలమును కలుగజేయుటయందును, హిందూవైద్యశాస్త్రమున నింతటి ఖ్యాతిగలమందు వేరొకటిలేదు. నియ్యది బంగారు మొదలగు మిక్కిలి విలువగల పదార్థములచేత తయారు చేయబడినది. వెల తు 1-కి రు. 24—0—0.

7 డోసులమందు రు. 1—0—0.

సిద్ధ మకరధ్వజ:—పై మందువలెనే అత్యధికమగు బలమును, మెదడుకు నరములకు శక్తిని కలిగించును. మఱియు నపుంసక దోషములనుకూడ బోగొట్టును. నియ్యది ముత్యములు, బంగారు, మఱియు యితర లోహములతో చేయబడిన యమూల్యౌషధము. వెల తు 1-కి రు. 80—0—0.

7 రోజులమందు రు. 5—0—0.

నారాయణతైలము:—పక్షవాతములు, చచ్చువాతములు, కీళ్ళ నొప్పులు, వాపులు, శిరోవాతములు, దీనిని పైన రుద్దుటచేత నిర్మూలము చేయును. వెల బుడ్డి రు. 2—8—0.

నాడీవ్రణాంతక:—నారికురుపులకు వజ్రాయుధమువంటిది. గొప్ప వారనేకులు దీనిని ఉపయోగించి దీనిపేరు సార్థకమనిరి.

వెల బుడ్డి రు. 0—12—0.

మాతులుంగరసాయనము:—(గర్భిణీ స్త్రీలకు సంజీవి) గర్భిణి స్త్రీలకు అనేక కారణములచే సంభవించు వాంతులు మొదలగు వ్యాధులను, బలహీనమును బోనడచును. మఱియు గర్భాశయమునకు బలమును కలుగజేయును. అధికప్రయాసచే ప్రసవించెడి స్త్రీలకు బాధయనునది తెలియకనే సులభముగ ప్రసవము జేయుటలో గర్భిణి స్త్రీలపాలిటికి సంజీవని యిదియే.

వెల బుడ్డి రు. 1—8—0.

వ్రణరోపణి:—గజ్జి, చీడ, పాసినపుండ్లు, కాలినపుండ్లు వీనిని నిస్సంశయముగ నిర్మూలము జేయును. వెల డబ్బా రు. 0—4—0.

వసంత కుసుమాకరం:—బహువిధ మూత్రవ్యాధులకును, మూత్ర మందుగల తీపు దోషములకును, ఆయుర్వైద్యశాస్త్రమున నుత్తమతమౌషధమని ఘంటాపథముగ జెప్పంబడుచున్నది. మఱియు మధుమేహ బహుమూత్ర వ్యాధులచే గలుగు రాచ కురుపులను రాకుండజేయును. గుండెకాయ కును, నరములకును, బలమునిచ్చుటలో దీనికి సరిపోల్చుటకు వేరొకయౌష ధము మాకు గోచరముగాకున్నది.

వెల తు 1-కి రు. 30—0—0; 7 రోజులమందు రు. 5—8—0.

ఆత్రేయవటి:—కీళ్ళనొప్పులు, సవామేహవాతనొప్పులు, కీళ్ళవా పులు మొదలగు వానిని, విడువకుండెడు దీర్ఘకాలపు నొప్పులనుకూడ రూపు మాపును. వెల బుడ్డి రు. 0—12—0.

బాలసంజీవనివటి:—ఈ మాత్రలను ప్రతి నిత్యము రేపుమాపుకకటి చొప్పున యుపయోగించిన, అజీర్ణములు, దోషుపిరేచనములు, జలుబు, దగ్గు, జ్వరము, మొదలగునవి రాకుండయుండును. వచ్చిన నిర్మూలముజేసి ఆరోగ్య మును గలిగించును. పసిబిడ్డల సంరక్షణకుగాను ప్రతికుటుంబమున నుండదగినది.

వెల 50 మాత్రలుగల సీసా 1-కి రు. 0—8—0.

విచిత్రరత్న లేపం:— చాలాకాలమునుండి పీడించెడు సవాయి పుండ్లు, కొరుకుపుండ్లు, భగందర వ్రణములు, గండమాలా వ్రణములు, ప్రధా నావయవమందలి వ్రణసామాన్యములు, స్త్రీల మర్మస్థలములయందలి వ్రణ ములు, మేహవ్రణములు, మొదలగువానిని శీఘ్రములో గుణముజేయును.

వెల డబ్బా 1-కి రు. 1—8—0.

కదళీకందపాకం:—రక్తవిరేచనములను, నోటివెంట, ముక్కువెంట, పండ్లవెంట రక్తముపడుటను, రక్తవమనమును, రక్తకుసుమమును, శరీరతాప మును, ఎదురుబొమ్మ అరకాళ్లు అరచేతుల మంటలను, మూత్రనాళమందలి పోట్లు మంటలను బోనణచును. సెగరోగులకుగల మూత్రపు చురుకునకును చాలామంచిది. పసిబిడ్డల కానకములను సంజీవనియె.

వెల టిన్ను 1-కి రు. 1—8—0.

మృగమదవటి:—కస్తూరి మాత్రలుగల ఒక ఈసీసా ప్రతికుటుంబములో నుండవలసియున్నది. సకాలములో నీ మాత్ర లుపయోగింపబడిన యెడల జ్వరమును రాకుండ జేసికొనవచ్చును. మఱియు జలుబు, రొమ్ముపడిశము, సన్నిపాతములను బోగొట్టును. వెలసీసా 1-కి రు. 1.

సిద్ధగంధక రసాయనమ్:—రక్తశుద్ధినిచేయుటయందీ యౌషధమునంగల అత్యద్భుతమగు గుణమునుబట్టి చర్మవ్యాధులు కొద్దిరోజులీ యౌషధసేవవలన నివారణమగుచున్నవి ఏడుదినములయౌషధమునకు వెల రు. 2-8.0.

వాశారిష్టం:—జలుబుతో కూడినట్టిగాని, జలుబులేనట్టిగాని ఉబ్బసములను నశింపజేయును. క్షయరోగులకు, రొమ్ముపడిశములకు, ఊపిరితిత్తులకు జేరిన ప్రతివ్యాధికిని, రక్తపిత్తమునకును, రత్నమువంటిది.

వెల బుడ్డి రు. 1—0—0.

సౌరణపాకం:—రక్తముతోకూడిన మూలశంకను అద్భుతముగా కుదుర్చును. మఱియు మొలలతోకూడిన మూల జాడ్యమును కొంతకాలము సేవించిన నివర్తిజేయగలదు. వెల టిన్ను రు. 2—0—0.

స్వర్ణక్రవ్యాదరస:—చిరకాలమునుండియున్న అజీర్ణవాతములకు అమ్లశైత్యములకు అసమానమైనది. కడుపుబ్బరములను, పులితేపులను, బోనణచును. 7 రోజులమందు రు. 4—0—0

స్వర్ణవంగం:—శుక్లనష్టములకు, స్వప్నస్ఖలనములకు, సంజీవివంటిది. మఱియు చిరకాలపు శగరోగములను ధ్వంసముచేయును.

7 రోజులమందు వెల రు. 4—0—0.

చందనబలాలాక్షాతైలము:—ఉబ్బసరోగము, క్షయరోగము, పురాణ జ్వరములు, పాండు, తలనొప్పులు, శిరోవాతములు, శరీరతాపము, ఉడుకు—ఇవియన్నియు, ఈతైలముచే నొకటిరెండుతడవలు అభ్యంజనము చేసుకొనిన గుణమగును. మఱియు మెదడుకు చలవను, శక్తినికలిగించును.

వెల బుడ్డి 1-కి రు. 2—0—0.

ఖండకూశ్మాండలేహ్యము: ఎండిపోవు శరీరస్వభావముగలబిడ్డలకు పెద్దలకును మాంసమునకు పుష్టిజేయును. క్షయము, ఉబ్బసము, పొడిదగ్గు, కలవార్లకు మిగుల మేలుజేయును. ఊపిరితిత్తులకు మంచి బలమును గలుగజేయును. వెల టిన్ను 1-కి రు. 2—8—0.

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,

ఎ. వి. ఎస్.. ఎ. ఎమ్ బి, వారి

## జీవామృతము.

హిందూదేశమందలి మంచిమూలికలచే తయారుచేయబడినది.

రక్తమును వృద్ధిజేయును
మేహవాతనొప్పులను బోగొట్టును
అన్నివిధములగు బలహీనములను అణచును
పాండురోగులకు మంచిది
గుండెదడను నివారణజేయును
గర్భకారకములను దురమును
బాలురకు గర్భిణీలకు నుత్తమము
చనుబాలను వృద్ధిబరచును
మూర్ఛలకు మంచిది
మెదడుకు బలము గలుగజేయును
నరములకు శక్తిని హెచ్చించును
విద్యార్థులకు ప్రాణమిత్రము
ప్రాణశక్తిని హెచ్చించును
క్షయరోగులకు మిగుల మంచిది
కాసరోగులకు అమృతము
గుండెకాయకుమిక్కిలిబలమునిచ్చును
ఊపిరి తిత్తులకు అధిక బలముజేయును
ఉబ్బసరోగులకు మిగులహితము

వెలబుడ్డి 1-కి రు 3-0-0.

12 బుడ్లు వెల రు. 34-0-0.

ప్యాకింగు పోస్టేజి వేరుగా నివ్వవలెను.

## అమృతామలకతైలం

శిరస్సునుకండ్లను సర్వదా కాపాడును
సర్వవిధ శిరోరోగములను బోగొట్టును
పార్శ్వనొప్పులను దూరము జేయును
కణతనొప్పులను నిర్మూలము జేయును
పీనసరోగముల రానివ్వదు
మెదడుకు బలము జేయును
కర్ణరోగములను నశింపజేయును
కండ్లకు చలువజేయును
అపస్మారముల దూరము జేయును
తలనరములకు బలమునిచ్చును
నేత్రరోగములకు హితము
మూర్ఛలను బోగొట్టును
తలచుండును బోనణచును
వెండ్రుకలను నెరయకుండ జేయును
విద్యార్థులకు సర్వదా హితము
వెండ్రుకలను పట్టుకుంచవలెబెంచును
యోచన జేయువారికి మిక్కిలి హితకరము
మాడుపోట్లను నిర్మూలము జేయును
చర్మరోగులకు మంచి జేయును
తలమంటలను మాన్పును
అధికనిద్రను తగ్గించును
నిద్రలేమిని బోగొట్టును
దీనిగుణములు అనుభవజ్ఞులకు దెలియును

వెల బుడ్డి 1-కి అణాలు 12.